# ఎమెస్కో
# వచన రామాయణం





శతావధాని కోట వీరాంజనేయ శర్మ

# ఎమెస్కో వచన రామాయణం
(పదమూడవ సంపుటం)

రచన:
శతావధాని కోట వీరాంజనేయ శర్మ



201

యం. శేషాచలం అండ్ కంపెనీ,
మచిలీపట్నం-సికింద్రాబాద్

EMESCO VACHANA RAMAYANAM - Vol. 13

*as retold by*:

SATAVADHANI KOTA VEERANJANEYA SARMA

*first edition*:

MARCH 1982

*publishers*.

M. SESHACHALAM & CO.,
Machilipatnam, Secunderabad.

*cover design* :

BAPU



*printers* :

LAKHSMI SHYLAJA PRINTING PRESS
Somajiguda, Hyderabad - 500 482.

Price Rs 5-00

*distributors*:

M/s. ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rashtrapathi Road, Secunderabad - 500 003.



201

# కార్తవీర్యార్జునుడు నర్మదానదిలో స్త్రీలతో క్రీడించుట

పంక్తిముఖుడు బలపరాక్రమ వరసంపన్నుడైన పుత్రుని సాయంతో త్రిదివాన్ని జయించి, మూడులోకాలకు ఏలిక అయిన ఇంద్రుణ్ణి పాదదాసుణ్ణి చేసుకుని లంక ప్రవేశించి తిరుగులేని వీరుడుగా చాలా కాలం సుఖంగా కాలం గడిపాడు. ఆతనికి మళ్ళీ రణకండూతి కలిగింది. తానొక్కడే సైన్యంతో కార్తవీర్యార్జునుడు పాలించే మాహిష్మతీ నగరంపై దండెత్తి పోయాడు. ఆరోజే ప్రభువు నర్మదానదీ పరిసరోద్యానాల్లో విహారం నిమిత్తం వెళ్ళాడు. రావణుడు దండు విడిసి, మంత్రులతో తాను వచ్చిన కార్యం తెలుపుమని చెప్పాడు. వారు తగిన వారిని పంపి ఆవార్త అందచేశారు. అక్కడివారు అదివిని "రాజు ప్రస్తుతం నగరంలో లేడు. ఎక్కడికో వెళ్ళాడు. ఆయన వచ్చిన తరువాత వచ్చి నీ కోరిక తీర్చుకో"మని కబురు పెట్టారు. ఆవార్త విన్న అసురనేత పరివారంతో బయలుదేరి నీహార శైలాభమైందీ, ఆకాశాన్ని అందే శిఖరాలు కలదీ, "భూమిని బ్రద్దలుకొట్టి పుట్టిందా?" అని భ్రమకూర్చే విస్తృతి కలదీ, సూర్యచంద్ర గమనాన్ని అరికట్టే ఉన్నతోన్నత దేహం కలదీ, సహస్ర శిఖరాలతో ప్రకాశించేదీ, సింహ శార్దూల భల్లూక వృక తరక్షులాదివి క్రూరసత్త్వాలతో నిండిన కందరాలు కలిగి భయంకొలిపేదీ, శిఖరాలనుండి జారి తటప్రాంతాల్లో పడే జలపాత కారణంగా నిరంతరం

ఘోషించేదీ, దేవయక్ష గరుడ గంధర్వకిన్నర మిథున సంచారంతో రెండవ స్వర్గం వలె వుండి కనులకు విందు కూర్చేదీ అయిన వింధ్య పర్వతం చేరాడు.

## రావణుడు నర్మదానదీ తీరంలో విడియుట

ఆ పేరు మోసిన పర్వత ప్రాంతం చేరి, ఆ పర్వత శిఖరాలనుండి క్రిందికి ప్రవహిస్తున్న సెలయేళ్ళు పటికపురాళ్ళ వలె ధవళంగా, స్వచ్ఛంగా జిలుగుకాంతులతో వెలుగుతూ "తెల్లత్రాచులు కొండ దిగుతున్నవా?" అన్నట్లు చూడముచ్చట కొల్పుతుంటే, ఆ వింధ్యనగ శోభకు ఎంతో ఆనంద పడి పరివారాన్ని ఆపి, విశ్రాంతి నిమిత్తంగా పటకుటీరాలు సిద్ధం చేయుడని ఆదేశించాడు. ఆ పర్వతంలో పుట్టి పశ్చిమ జలరాశిలో కలిసే నర్మదానదిని చూచాడు. "అహో! ఈనదీ సౌభాగ్యం ఎంత హృద్యంగావుంది? ఎండలకు వడబడి, నాల్కలు తడియార దాహశాంతికై వచ్చిన వారణఘోణి మృగేంద్రాది వనసత్త్వాలూ, వాటిచే కలంచబడి, కళ్మలమవుతున్న నీళ్ళు, అంతలో ప్రవాహవేగంతో ముందుకు సాగిపోగా, మళ్ళీ స్వచ్ఛంగా, పానార్హంగా తయారవుతున్న ప్రదేశాలూ, అందులో సంచరిస్తూ, కర్ణపేయంగా సహజ రుతాలు చేస్తున్న నీటికోళ్ళు, జక్కవలూ, బెగ్గురులూ, అంచలూ ఎంత ఆహ్లాదం కలిగిస్తున్నై? ప్రకృతి రామణీయకం అంతా, ఈ నదీ, ఈ నగం "గుత్తగొన్నవా?" అన్నట్లు నామనస్సును హరించివేస్తున్నై. చూచిన కొద్దీ, బాగా వికసించిన పూలతో నిండిన వృక్ష కృతోత్తంసగా, చక్రవాక ద్వయ స్తనగా, వారిఫేన నిర్మలాంశుకగా, నీలనీరజ లోచనగా, హంసావళీ మేఖలాను బద్ధగా, విస్తీర్ణ సైకత సుశ్రోణిగా, కుసుమపరాగాను లిప్తపుణ్య జలసుస్నాతగా,సుకుమార స్పర్శగా ఈ నదీలలామ యౌవనోన్మత్తయోషగా కనుపించి,మనస్సులోని మాలిన్యం తొలగించి దర్శనీయగాసాక్షాత్కరించింది" అని భావించి మెచ్చుకున్నాడు. అనుకూలవతితో క్రీడించినట్లుగా తనివితీర స్నానం చేశాడు. పరమ మునీశ్వర సేవ్యమానమైన భవ్యతరంగిణీ తీరంలో మృదువుగా, సమంగా వున్న సైకత ప్రదేశంచేరి ఆసనపద్ధిగా ఉపవిష్టుడై నాడు. ఆ గంగను చూచి ఆనంద కందళిత హృదయారవిందుడైనాడు. మంత్రుల శుకసారణాదుల పిలిచి "మంత్రులారా! విశ్వమంతా తన తీక్ష్ణ

సహస్ర కిరణాలతో బంగరు మలాముచేస్తూ నదిమింలోకి వచ్చిన భానుడు నేనిక్కడ నివసించినందున వేడి కిరణాలను అమృత కిరణాలుగా మార్చి వెలుగుతున్నాడు.వాయువు శైవలినీ జలార్ద్రుడై మృదుల కుసుమావళి సురభి సంపద కానుకగా తెచ్చి నాకెంత ప్రీతిపాత్రుడవుతున్నాడో చూడండి. నర్మ వర్ధనంచేస్తూ ఈ నర్మద నక్రమీన విహంగ ఫేనాలతో నవ్యమై నివ్వెరతో నిలబడియున్న జవ్వనివలె నన్నెంతో అలరిస్తూంది. ఈ రమణీయ నర్మదా నదిలో, దేవేంద్ర తుల్యులైన మహీపతులతో పోరుటచే శరీరం గాయాలతో నిండి హరిచందన ద్రవంవలె రక్తం గారకట్టిన పంకం పరిహరించటానికి స్నానం చేస్తాను. మీరంతా దిక్కరులు జాహ్నవిలో జలకమాడినట్లు అవ గాహనానికి సిద్ధంకండి. నర్మద సర్వపంక నిస్తారక. శరత్కాల చంద్రో పమంబైన సైకతంలో ఈశ్వరార్చన చేస్తాను. ఇక మీ ప్రయత్నాల్లో మీరుండండి" అని ఆజ్ఞ చేశాడు.సారణశుకామాత్య శుకులు, ప్రహస్త మహో దరులు వెంటనే స్నానార్థం నదిలో ప్రవేశించారు. కరులు జలాశయాల కలచి నట్లు తనివితీరా వాళ్ల స్నానం చేశారు. ఈలో రావణుడు వేదాధ్యయనం చేస్తూ యథాక్రమంగా స్నానవిధి ముగించాడు. పీతాంబరాలు ధరించాడు. భస్మావలేపన సర్వాంగుడైనాడు. సమతల సైకత ప్రదేశంలో పూజనిమిత్తం వ్యాఘ్రాజినంపరచి దేవతాప్రతిమ సవరించి వుంచగా అర్చన నిమిత్తం ఆ చోటికేగి ఆసీనుడైనాడు. స్నానానంతరం మంత్రులు శివపూజకు కావలిన పూలు సేకరించి రాసులకొద్దీ కుమ్మరించారు. అసురపతి "హరోం హరహర శంభో శూలపాణే"అంటూ ఉచ్చరించిఅంతర్ముఖుడై ఆత్మలింగాన్ని స్మరించ గానే వేదికపై నిలువెత్తు సైకతలింగం సాక్షాత్కరించింది. ఇంతలోమంత్రులు భద్రంగా నిరంతరం ప్రభువు పూజించే స్వర్ణలింగం కొనివచ్చారు. అప్పటికే అసురపతి ధ్యానంలో వున్నాడు. అమాత్యులుతెచ్చిన స్వర్ణలింగం సైకత లింగంలో లీనమైంది.

## రావణుడు శివార్చన చేయుట

పంక్తివదనుడు పరమభక్తిపారవశ్యంతో సహస్రపంచాక్షరీమంత్ర జపం పరిపూర్తిగావించాడు. సహస్రగాయత్రీమంత్ర స్తవంముగించాడు. నమక చమకమహాన్యాస పూర్వకంగా ఏకాదశవారం రుద్రాభిషేకం చేశాడు. ఈశ్వర

సహస్రనామ పఠనంతో పుష్పాలతో పూజించాడు. బహువిధ ఫలాలను నైవేద్యం పెట్టాడు. కర్పూర నీరాజనం సమర్పించాడు. సువర్ణమంత్ర పుష్పం సమర్పించాడు. ఆత్మ ప్రదక్షిణ నమస్కారాలు ఆచరించాడు. స్వస్తిచెప్పాడు. అభిషేకజలం ముమ్మారు గ్రహించాడు. పునఃపూజచేసి ఉద్వాసం పలికాడు. ఆనందపారవశ్యంతో ఈశ్వర సంతోషకరతాండవం, నామ సంకీర్తనం వింశతి ముఖాలు గానంచేయగా అద్భుతంగా చేశాడు. అర్ధ నిమీలిత నేత్రాలతో "హే చంద్ర చూడ! ఫణిభూషణ! పినాకపాణే! మదనాంతక! గిరినందినీ నిరంతర విరచిత సేవా పరితృప్తమానస! జగన్నియామక! మృత్యుంజయ! ఆశ్రితభక్తజనసులభ! నందివాహన! గంగాధర! కైలాసవాస! శితికంఠ! ఫాలలోచన! పాహిమాం పాహిమాం పాహి, త్వాం భజేఽహంసదా" అని దిశలునిండేలాగా ప్రార్థించాడు.

## కార్తవీర్యార్జునుడు కరసహస్రంతో నర్మద నడ్డగించుట

ఇక్కడ ఈశ్వరార్చనలో దశాననుడు తన్మయుడై యుండగా, మాహిష్మతీపురం వదలి మదవతులతో క్రీడింపబోయిన అర్జునుడు పుష్పవాటికా విహారం పూర్తిచేసి పరిశ్రాంతుడై నిర్మలజలపూర్ణయై మందగమనంతో నడిచే మందయానవలె ప్రవహించే నర్మదానదిని చేరాడు. కరిణీసహస్రంతో గజరాజు దిగినట్లు ప్రియురాండ్రతో ప్రవాహంలో దిగాడు. ప్రవాహపుజలం పుష్కలంగా లేకపోవడంతో జలక్రీడలకు అంతరాయం కలిగింది. అది గుర్తించిన అర్జునుడు ప్రియురాండ్రప్రీతికై తన సహస్రకరాలు అడ్డుకట్టగాచాచి ప్రవాహాన్ని నిరోధించాడు. ఆతని బాహునిరోధాన్నితొలగించుకోలేక ఎదురొడ్డి నక్రమకరమీనకుసుమదర్భసంస్తరణ సహితంగా వానకాలంలోవలె తూర్పుముఖంగా మళ్ళి పారసాగింది. మానవపతి అసురపతి శివలింగార్చన భగ్నంచేయదలచి మళ్ళించాడన్నట్లు పశ్చిమంగా పారేనర్మద తూర్పుకు మళ్ళి ప్రవహించింది. నిర్జలంగావున్న సైకత ప్రదేశంలో అతి నిష్ఠతో రావణుడు అర్పించిన పూజాద్రవ్యాలు, మరలిపారటంవల్ల నర్మద తనలో కలుపుకున్నదా అన్నట్లు ముంచింది. రావణుడు భక్తిపారవశ్యంతో

పరమశివుని ధ్యానించి కనులు తెరిచాడు. ఇంకేమి మిగిలింది? తానర్పించిన పూజాద్రవ్యాలు నీట క ల సి పో యి నై. కాని తన ఆత్మస్వరూపుడైన పరమేశ్వర లింగం మాత్రం నీట కలియక యథాస్థానంలో నిలిచి వుంది. సంపూర్ణం కాకముందే జరిగిన అవాంతర ఘటనకు ఆశ్చర్య కోపాలు ఒకేసారి పొందాడు. "అనుకూలకాంత ప్రతికూలకాంతయై ఎదిరించి నట్లు పశ్చిమాశాముఖంగా ప్రవహించేనది ఈ నది ప్రాగ్దిశగా ప్రవహించ టానికిగల హేతువేమై వుంటుంది? ఇంత అల్పకాలంలో ఈ విపరీతం ఎందుకు జరిగింది?" అని దీర్ఘంగా ఆలోచించాడు. ఎదురెక్కి నీరు వస్తుంటే విహం గాలు గమన భంగం కలుగుతుండటంచేత కలవరపడ తున్నై. నిర్వికారాంగన వలె నర్మద నిండుగా వుంది. అర్చన పూర్తికాకముందే అసురపతి పూజా ద్రవ్యాలు ఏటిపాలు కావటంతో అమాత్యులు అలజడి పొందారు. వాళ్ళను గాంచి ప్రభువు మౌనంగా కారణం కనుక్కోమని తర్జనితో సైగచేశాడు.

## శుకసారణులు నది ఎదురెక్కి పారటం రావణునకు చెప్పుట

ఆశరేశుని ఆజ్ఞపొంది అమాత్యులు పశ్చిమంగా కొంత దూరం పోయారు. రావణుడు విడిసిన ప్రదేశానికి అర్ధయోజన దూరంలో అర్జునుడు అతివలతో జలక్రీడలాడటం అంతరిక్షం నుంచి చూచారు. ఆశ్చర్యపడ్డారు. వెంటనే వెనుదిరిగి వచ్చారు. "ప్రభూ! వింతల్లో వింతచూచి వచ్చాం. ఈ నది ఈ విధంగా వెనుకకు మరలి పారటానికి కారణం ఒక మహాశక్తి సంపన్నుడు తన వేయి చేతులతో ప్రవాహాన్ని బంధించటం. అతడు నదీ గమనాన్ని ఆగి అంగనా సహస్రంతో క్రీడించుతున్నాడు. సమదవశా సహ స్రంతో కూడిన మత్తమాతంగంలాగా వున్నాడు. అరిభయంకరుడుగా, అద్భుత చరితుడుగా కనుపించాడు. చూచిన విషయం వివరించాం. తరువాత ప్రభువులు ఏంచేయమంటే అదిచేస్తాం" అని చెప్పారు.

## రావణుడు కార్తవీర్యార్జునునితో పోరుటకు పోవుట

మంత్రుల మాట లాలకించిన మనుజాశనభర్త "సచివులారా! వాడే అర్జునుడు. వాడి కోసమే మనం మాహిష్మతీ పురానికి వెళ్ళాం. ఇప్పుడు

మనం ఆతడున్న చోటికే పోదాం. ప్రయాణించండి" అని చెప్పాడు. పరివారం సంరంభంతో ప్రభువును అనుసరించింది. అకారణంగా వాయువు బలంగా ఎదురుగా వీచింది. మేఘం రక్తధారలు వర్షించింది. ప్రళయభీకరంగా గర్జించింది. శుకసారణ ధూమ్రాక్ష మహోదర మహాపార్శ్వులు యుద్ధ సన్నద్ధులై వెంటరాగా రావణుడు అర్జునుడు క్రీడించే చోటికి కొంత దూరంగా చేరి ఆతని సాహస కార్యం చూచి అచ్చెరువు పొందాడు. ఆతనికి అనతి దూరంలో ఆయనతో వచ్చిన సచివ సేనానాయక భటవర్గం విడిసివుంది. తన విరోధి తన ఎదుట పొందుతున్న ఆనందానికి అ సు ర నా థు డు అసూయపొందాడు. మహాపర్వతం క ద లి వ చ్చి న ట్లు మ ం త్రు ల తో సమీపించి, ఆతని అమాత్యుల రావించి "పెగ్గడలారా! మీరు పోయి మీ ప్రభువుతో నామాటలుగా ఇలా చెప్పండి. "ఓ మానవపతీ! నిన్ను నిర్జించటానికి మానవభోజి, విరించి దత్తవరబలశాలి, ఇంద్రజిన్మాతధారి తండ్రి, త్రిలోకాధిపతి, రావణుడు దండెత్తి వచ్చాడు. శక్తివుంటే సమరం సలుపు. లేకుంటే "జితోస్మి" అను. ఏ సంగతి వెంటనే మాకు తెలియచేయి" అని. అంత గంభీరంగా పలికిన ఆశరేశుని పల్కులు పెగ్గడలు విని పరిహాస పూర్వకంగా పకపక నవ్వారు. "బలేబలే. రాక్షసపతీ! రణధర్మం నీకుతెలిసినట్లు ఇంకెవరికీ తెలియదనుకుంటాం. రాత్రింవడలి, రమణులతో విహార యాత్రకు వచ్చిన ప్రభువుతో పోరవచ్చావా? మంచి సమయమే దొరికింది. నీ త్రిలోక విజయయాత్ర ఇలా సాగిందేనా? అసమయంలో వచ్చి ఆహవం చేయమని కోరే వీరుడవు నీవుగాక ఇంతవరకెవ్వరూ మాకు కనుపించలేదు. అంత ఆపుకోలేని ఉత్సాహం వుంటే రాజధానిలో ప్రవేశించగానే యుద్ధం చేయి. ఇప్పుడా యుద్ధం? మారాజు క్రీడనిమిత్తం తగువారితో వచ్చాడేకాని, నీవలె యుద్ధయాత్రకు రాలేదు కదా?

## అర్జున రావణ మంత్రుల యుద్ధం

ఈ రాత్రికి ఓపికపట్టు. తెల్లవారగానే నీకు చేతినిండాపనిగల్పిస్తాడు. మేం ఇప్పుడు ఎలాపోయిచెపుతాం? నీవే ఈ స్థితిలో వుంటే నీవారు నిన్ను దర్శింపవస్తారా? నీకు మా మంచిమాటలు రుచించకపోతే ముందు మాతో యుద్ధంచేయి. మమ్మల్ని జయిస్తే మా ప్రభువుతో సమరం సలుపుదువుకాని.

కాని,నీ ఆత్రం చూస్తుంటే తిరిగి లంకకు పోతావన్న నమ్మకం కలగటంలేదు" అని హేళనగా సమాధానం చెప్పారు.ఆ మాటలు చెవు ల్లో సీసం పోసినట్లుగా బాధ గల్పించ సచివులు సంగ్రామానికి తలపడ్డారు. అర్జునుని మంత్రులు అసురపతి మంత్రులతో పోరుతూనే రావణునిపై శూలఖడ్గబాణపరిఘాది సాధనాలను ఒక్కుమ్మడిగా విసిరారు. ప్రహస్తాది మంత్రులు, బరితెగించియుద్ధం చేసి భీతి కలిగిస్తున్న అర్జునుని అమాత్యులపైబడి కాలుచేతులు ఆడకుండ ఖడ్గశ్రేణితో ఖండించారు. శూలాలతో పొడిచి కూలద్రోశారు. కనురెప్ప పాటులో కార్తవీర్యుని మంత్రులు కొలిచి సైన్యం నామరూపాలు లేకుండా పోయింది. శిబిరరక్షణ చేస్తున్న భటులు పరుగుపరుగున పోయి పంక్తి ముఖునిచే కల్గిన ప్రమాదం ప్రభువుతో విన్నవించారు. ఆయన కోపానికి హద్దులేకుండాపోయింది. వెంటనే నర్మ నిరోధం ఉపసంహరించి, అంగనాజనానికి ధృతివాక్యాలుచెప్పి, జలంనుంచి వెల్వడి వీరోచిత వేషంధరించి, గదామాత్రద్వితీయుడై, ధారుణి కంపించగా అడుగులువేస్తూ, రెండవ దండధరుని చందంగా చండవేగం, ఉద్దండశౌర్యం వెలారుస్తూ రావణుకున్న ప్రదేశానికి వచ్చాడు.

## అర్జునుడు ప్రహస్తుని పడ నడచుట

గారుడవేగంతో గదామాత్ర సహాయుడై వస్తున్న కార్తవీర్యార్జునుని చూచి రాక్షసమంత్రులు ఎన్నడు ఎరుగని ఏదో సంచలనం పొందారు. ప్రహస్తుడు దండతాడిత దండశూకంవలె రోజుతూ ఎదురునిల్చి సూర్యగమనాన్ని వింధ్య పర్వతం నిరోధించినట్లునిరోధించి లోహబద్ధ ముసలాన్ని గిర్రునతిప్పి ఏటవాలుగా తగిలేట్లు విసిరాడు. ఆరోకలి వచ్చే విధంచూచి అవనీశుడు తన గదను సహస్ర బాహువులతో బిగించిపట్టి బిల్లంగోడు ఆటలో బిల్లను కొట్టినట్లు కొట్టాడు. అది నడిమికి విరిగి అర్ధక్రోసు దూరంగా రెండు ముక్కలుగా పోయి పడింది. ప్రత్యర్థి ముసలాన్ని తన గదచే పరిహరించి సాహవ ఎర తన్నుటవు ద్రావాలే వడితోవచ్చి ప్రహస్తుని తలపై బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు చావలేదుకాని, చచ్చినంత పని జరిగి స్పృహ లేకుండా వజ్రహతి పక్షాలు తెగిన పర్వతంలాగా నేల పడ్డాడు. అతనిపాటు చూచి అసుర మంత్రులు కాలుకొలది కదనరంగంనుంచి తప్పుకున్నారు. మారీచ మహోదర

శుకసారణ ధూమ్రాక్షులుభయపడి ప్రాణరక్షణకోసం భండనం వదలిపోవటం ప్రహస్తుడు పడి లేవకపోవటం రావణునికి చెప్పరానంత సిగ్గు గలిగించి. దేవతలతో సమంగా పోరి పై చేయిగా పేరుగన్న తన ముఖ్యమంత్రులు, సేనాపతి తనపట్ల గౌరవం, భయంకూడా లేశమాత్రం ఆలోచించక ఆత్మ రక్షణకోసం ఆహవ పరిత్యాగం చేసినందుకు లోలోపల చింతించాడు. "తాను అల్పులుగా భావించిన మానవులు ఇంత పరాక్రమవంతులా?"అని దిగ్భ్రాంతి పొందాడు. "జలక్రీడా సమయంలోనే ఒక్కడు ఇంతటి మహాశూరుణ్ణి లేవ కుండా కొట్టాడంటే రాజధానిలోనే వుంటే నా ముట్టడి నీళ్ళు కారిపోవటంకాక నావాళ్ళంతా నాకు లేకుండా పోయేవా"రని కించిత్తు పశ్చాత్తాపం, యథార్థ దర్శనం చేశాడు.అయినా, ఆతడు త్రిలోక విజేత. దేవతాగ్రేయవరావితుడు. (బ్రహ్మచే వరాలు పొందినవాడు) మృత్యుభీతి లేనివాడు. భువన భయం కరుడు. యుద్ధంమాని వెనుతిరిగి పోతాడా? కాలదండంవంటి గదాదండం గ్రహించాడు. కదనానికి నడిచాడు. మహాపర్వతం కదలి వస్తున్నట్లువస్తున్న పంక్తిముఖుని కనుగొని అవనిపతి ఆగ్రహాగ్నులు నేత్రకుండంలో వెలువ రిస్తూ, మీసం మెలివేస్తూ నిర్భయుడై, "ఏం చేస్తాడో చూస్తాం" అన్నట్లు నిలుచున్నాడు. ప్రతిపక్షి తన్నంత చులకనగా చూడటం దానవేశ్వరునకు ఇంకా కోపకారణమైంది. తానెంతవాడో తెలిసేలాగా గదా యుద్ధంలో కౌశలం చూపించి శక్తిహీనుణ్ణిచేసి నర్మభాషణతో అవహేళనచేస్తూ అవమానించాలని ఆకాంక్షించాడు.

## రావణ కార్తవీర్యార్జునుల గదా యుద్ధం

ఇరవై చేతులతో సుర విరోధి గదను త్రిప్పుతుంటే వేయిచేతులతో మేదినీపతి త్రిప్పుతున్నాడు. ఆ విధంగా త్రిప్పుతూనే తలపడ్డారు. పొంగు తున్న రెండు సంద్రాలో, హద్దులు వదలి చైతన్యంతో పరస్పరం ఘర్షించే రెండు పర్వతాలో, మంటలు జిమ్మే మధ్యందిన గ్రీష్మ మార్తాండ ద్వయమో, ఉద్ధృతంగా వెలికివచ్చి ఎదుర్కొన్న బడబాగ్ని యుగళమో, ఆడఏనుగును ఆశించి ఎదుర్కొన్న మదమాతంగ యుగళమో, ప్రళయంగా గుద్దుకుంటున్న జలధర ద్వంద్వమో, క్రుద్ధ వ్యాఘ్రయుగమో, ఇద్దరు పాలనేత్రుల విజృం

ఘణమో, యమున లదుగమో అన్నట్లు పిడుదివియక పోరాటం సాగించారు. పరస్పర గదా ఘర్షణకు పుట్టే రావం, కోట్ల పిడుగులు పడుతున్నప్పటి ధ్వని దుస్సహంగా వున్నట్లు వుంది. నీలనీరద మండలాన్ని వెలిగించే మెరపుల్లాగా కాంతులు విరజిమ్ముతూ కార్తవీర్యార్జున ప్రయోగ గదాదండం రావణుని విశాల వక్షంపై విసురుకపడింది. ఆ సమయంలోనే పంక్తిగళుడు విసిరిన గద అర్జునుని యెదదపై గిరిపైపడ్డ ఉల్కలాగా వచ్చి పడింది. దక్షులైన బుభుక్షునకూ, బలికీ జరిగిన పోరువలె అతి భీషణంగా జరిగింది. కొమ్ములతో కోడెలు, దంతాలతో ఏనుగులు కుమ్ములాడుకున్నట్లు గదలతో కుమ్ములాడుకున్నారు. గదకు గద అడ్డుపెట్టి బలంగా నొక్కి ఆ బిగువుతో ఒకడు పది బారలు వెనుకకు గెంటితే మరొకడు ఇరవై బారలు వెనుక్కి గెంటాడు. ఎంత సూక్ష్మంగా యత్నం చేసినా ఏ ఒక్కరూ గదను శరీరానికి తాకే అవకాశం రాకుండా కాపాడుకున్నారు. వింశతిభుజుడు సహస్రభుజుని గదా కౌశలాన్ని నిగ్రహించలేకపోతున్నాడు. దెబ్బకాచుకునే స్థితిలోకి క్రమంగా జారుతున్నాడేకాని, దెబ్బతీసే స్థితిలో లేడు. అర్జునుడు ప్రతిపక్షి బలం క్షీణిస్తున్నదని గుర్తించాడు. లొంగినట్లుగా తడబాటుతో గదను తప్పిస్తూ అదను చూచి అయస్కాంత నిర్మిత గదాదండం అదాటుగా ఎత్తి మెరపు మెరసినట్లు గుండెపై కొట్టాడు. మనుజాధీశునిచే ప్రహరించబడిన గద మాంసఘూర్ణాయకుని వక్షం దాకి రెండు తుండాలై నేలపడింది. ఆతని శరీర పాటవానికి అర్జునుడు అచ్చెరువుపడ్డాడు.

## అర్జునుడు రావణుని బంధించి రాష్ట్రానికి కొనిపోవుట

అర్జున గదాఘాతంతో ఆశరనేత రొప్పుతూ, రోలుతూ, ప్రక్కకు పది బారలదూరంపోయి పర్వతంలాగా పడిపోయాడు. రామచంద్రా! బ్రహ్మ శివదత్తదీర్ఘాయువుగలవాడుకావటంవల్ల బ్రదికాడుగాని, లేకపోతే చిత్రగుప్తుని కవిలెకట్టలో పేరు కొట్టివేయబడేదే. ఫణిపై దాడిచేసే పక్షిరాజు వలె తటాలున ఆతని మీదికి లంఘించి బలిని వామనుడు బంధించినట్లు త్రాళ్ళతో బంధించాడు. దేవలోకాన్ని దిక్కు లేకుండా చేసిన రాక్ష

సేశ్వరుకు మానవేశ్వరునిచే అవలీలగా బంధింపబడటం అమరులకు చెప్పరాని హర్షం కల్గించింది. పరిమళ కుసుమాల వర్షించారు. గంధర్వులు గానం చేశారు. అచ్చరలు ఆడారు. హర్యక్షం దంతిని స్వాధీనం చేసుకున్నట్లు రావణుని నిర్జించటమే కాకుండా బంధించి స్వాధీనం చేసుకుని విజయ గర్వంతో పెనుబొబ్బ పెట్టాడు. ఆ అట్టహాసానికి తెలివితప్పి పడిన ప్రహస్తుడు ఉలికి పడి లేచి కొంత తెప్పరిల్లి ప్రభువు పొందిన దుస్థితి చూచి ప రి తా ప ం హెచ్చగా, మంత్రులనూ, సేనానులనూ, భటులనూ సన్నద్ధంచేసి కారుమబ్బులు ఆకాశం గ్రమ్మినట్లు అర్జునుని ముసిరి వివిధ సాధనచయంతో ఎదుర్కొని ప్రహరించసాగాడు. "నిలు నిలు. పోకు. పోకు. మా ప్రభువును మేం బ్రదికి వుండగా కొనిపోలేవు" అన్న పౌరుషవాక్యాలకు పర్వతాలు ప్రతిధ్వనించాయి. ముసురువేళ చినుకులు ఎడతెరిపి లేకుండా కురిసినట్లు శూలాలతో, ఖడ్గాలతో తలపడి విసిరారు. శత్రు ప్రయోగ శస్త్రాలను వేయి చేతులతో అందుకుని వాటినే త్రిప్పి మార్తురపై మళ్ళీ విసిరాడు. అవి తిరిగి వచ్చి తాకుతుంటే నిలువరించుకోలేక కొందరు నీల్గారు. మరికొందరు దిక్కు లేకుండా దిక్కులకు పరిచారు. పెనుగాలికి మబ్బుల్లాగా దనుజులు పారిపోగా దశవక్త్రునితో ధరణీపతి మాహిష్మతీ పురానికి మంగళవాద్యాలు మిన్నుముట్టగా పోయాడు.

## పులస్త్యుడు రావణుని విడిపించుకుని పోవుట

ఆసురపతిని అవనీపతి బందీగా పురానికి కొనిపోగానే, ప్రహస్తాదులు మతిహీనులై మాహిష్మతీపురం వెలుపల కాందిశీకులకంటె కనాకష్టంగా కాలం గడుపుతున్నారు. కాని, ఒక్కడైనా లంకకుపోయి ఇంద్రజిత్తుతో ఈ విషయం చెప్పాలనికూడా తలంచలేదు. ఆనోట ఆనోట అమరులు రావణునికి జరిగిన పరాభవం ప్రభంజనంవలె స్వర్గలోకమంతా వీచేలాగా చెప్పసాగారు. క్రమంగా ఆ వార్త మహా తపస్సంపన్నుడైన పులస్త్య మహర్షి విన్నాడు. తన మనుమడికి పట్టిన దుర్గతికి విచారపడ్డాడు. ఎంత దుర్మార్గుడైనా తన కొడుకు కొడుకు గదా? బంధుభావం బంధం వేయగా ఆ మమకారం త్రెంచుకోలేక ఆకాశమార్గాన మరుజ్జవంతో మాహిష్మతీ నగరానికి వచ్చి వ్రాలాడు. అమరావతీ సన్నిభం, పుష్టహృష్ట లోకాన్వితం, ధర్మదేవతామందిరం, మహా

వీర సహస్ర భుజపరిపాలితం అయిన రాష్ట్ర రాజధానిలో ప్రవేశించి, రాజ మందిరంచేరి, తనరాకను ధరణిపతికి చెప్పి పుచ్చాడు. ప్రతీహారి ఆ వార్త నందుకుని ప్రభుని దర్శించి నమస్కరించి "దేవా! పద్మ బాంధవుడే పాదచారిగా వచ్చాడా? అన్నట్లు చండ తేజోరాజి దుర్ని రీక్షుడై ప్రకాశించే మహర్షివచ్చి తమ దర్శనం కోరుతున్నా"డని చెప్పాడు. వెంటనే వచ్చినవాడిని పంపి, అర్ఘ్యం, మధుపర్కంకొని ఆత్మపురోహితులు వెంటరాగా అవనీపతి సహస్రకరాలు శిరంపైచేర్చి ఎదురునడచి, అర్ఘ్యపాద్యా దులు, ఆవు, మధుపర్కం సమర్పించి, సంతోషం పెల్లుబుకగా లోనికి కొని వచ్చి, ధర్మాసనంపై ఉపవిష్టుణిచేసి, కుశలప్రశ్నలుసలిపి, మహనీయ వాక్కుల సంస్తుతించి, హర్షసంభ్రమాలు పెనగొన, గద్గదకంఠంతో "స్వామీ! పులస్త్యమహర్షీ! బ్రహ్మసంకాశా! అతులిత తపస్సంపన్నా! నీరాకచేత మా మాహిష్మతి అమరలోక సాదృశ్యం పొందింది. నా భాగ్యానికి మేరలేదు. తమవంటివారు సామాన్యులమైన మావంటి రాజుకడకెందుకు వస్తారు? అగో చరుడవై అమరులచేత పూజలందే నీవే నా వీటికివచ్చి నాచే పూజలందుకొన టం నాకు ద్విజేంద్రపదం చేకూరినట్లయింది. ఇప్పుడేపో నేను నిజంగా కుశ లతకలవాడనైనాను. ఇప్పుడేపో నేచేసిన వ్రతాలు ఫలితానికి వచ్చినై. ఇప్పుడేపో నా జన్మచరితార్థమైంది. ఇప్పుడేపో నాతపం పండి కృతమతి నైనాను. ఈ రాజ్యం, ఈ సుతులు, ఈ కాంతలు, ఈ ఎల్లవారు, నేను నీ వారం. ఏపని నాచే చేయించి నన్నొకమానవుడుగా గుర్తింపచేయ సంక ల్పించి వచ్చారు? సెలవిస్తే తలతో చేస్తాను"అని సగౌరవంగా, సవినయంగా సంకల్ప పూర్వకంగా, మృదుమధుర వాక్కులతో వచ్చిన కార్యాన్ని ప్రశ్నించాడు. ఆతని వినయసంపదకు, అభిమాన గౌరవ సత్కారాలకు పులస్త్యమహర్షి పొంగిపోయాడు. "రాజా! నీవు సామాన్య భూపతివికావు' హేహయవంశరత్నానివి. అనుజన్ములంతా కుశలంగా వున్నారుకదా? నీవర వర్ణినీతతికి సేమమేనా? అగ్నులు నిరంతరం అంతరాయరహితంగా వున్నై కదా? ధర్మలోపం ఎక్కడా రాకుండా పాలన జరుగుతుందా? ఏదో పెద్ద వాళ్ళం కనుక ఇలా అడుగుతున్నాంకాని, నీ పాలన సత్యలోకంలో ప్రశంసా పాత్రంగా వున్న సంగతి తెలుసు. నీచేత మర్త్యలోకం అమర్త్యలోకంకంటె

అధిక సౌభాగ్యవంతంగా మార్చబడి పౌరజానపదులు ప్రహృష్ట మానసులై జరారుజాదిబాధలకు దూరంగా వుండి సుఖిస్తున్నారనికూడ తెలుసు. ఇంతకు నేను వచ్చిన కార్యం నీకు చెప్పనేలేదు. అది అల్పవిషయం, అనర్థదాయకం కూడా. నావంటి విశ్వశ్రేయఃకామికి అంతగా తగిందికాదని తెలిసే అర్థింప వచ్చాను. ఇప్పటి నా రాకలో నిగూఢార్థం ఇమిడివుంది. ఎవనిపేరు వింటే చతుర్దశభువనాలు కంపిస్తవో ఆ దశకంఠుణ్ణి, ఆహవంలో నిర్జించావు. అంతతో వదలక చెరబట్టి తెచ్చావు. ఈ పని దేవతలకే సాధ్యంకాదు. నీ విజయాన్ని దేవతలు చెప్పుకుంటుంటే విని నిన్ను చూడవచ్చాను. నాకెంతోఆనందంకలిగింది. నా మనుమడి కీర్తిజలాన్ని అగస్త్యుడు సముద్రంవలె పానం చేశావు. అందుకు అభినందిస్తున్నాను. నా కోరిక విని ప్రశ్నలు వేయవద్దు. అన్నీ నాకు తెలిసే వచ్చాను. మా వాడికి నీవు విధించిన శిక్ష చాలు. ఇక వాడిపై కోపంమాని విడిచిపెట్టు. ఈ కార్యం ఇతరులవల్లకాదని నేనే వచ్చాను. నా కోరిక మన్నిస్తావని నమ్మాను" అని సద్గుణరాశియైన పులస్త్యబ్రహ్మ పుడమిరేనితో చెప్పాడు. ఆ మహర్షి వాక్యాలు విని ఇతరాలోచనలేమీ చేయకుండ "పరమపూజ్యుడా! నీ కోరిక నేను ఆజ్ఞగా తల ధరిస్తున్నాను. దశవదనుడేమి? ఈ ధరణీరాజ్యం మీ పాదార్చనకుసమర్పిస్తాను" అని మంత్రుల వంక చూచాడు. వారు సేనానుల వంక చూచారు. వారు దళాధిపతుల వంక చూచారు. వారు వెంటనే చని సగౌరవంగా రాజ మర్యాదలతో రావణుని చెర విడిపించి సభాస్థలికి తెచ్చారు. అర్జునుడు ఎదురు నడచి గౌరవపురస్కృతంగా కొనివచ్చి కాంచనపీఠిపై ఆసీనుణ్ణిచేశాడు. మహర్షి వారిరువురికీ అగ్నిసాక్షిగా మైత్రీబంధనం కలిగించాడు. పరమమునికి పాదాలకు పూజచేసి అర్చించి ఆశీస్సులందుకుని అర్జునుడు అంతఃపురానికిపోయాడు. పులస్త్యుడు మనుమణ్ణి తలవాచేట్లు చీవాట్లు పెట్టాడు. సిగ్గుతో శిరం వంచి తాతకు దండప్రణామం సలిపి పరివారంతో పంక్తివదనుడు లంకకు వెళ్ళాడు. మహర్షి తన కార్యం నెరవేర్చుకుని పరమేష్ఠి సన్నిధికి ప్రయాణించాడు. విన్నావుకదా రామభద్రా! కార్తవీర్యార్జునుని అవక్ర విక్రమం? ఎంత బలవంతుడైనా సమయాసమయాలు తెలుసుకుంటూ అల్పులపట్ల అవజ్ఞతగా ప్రవర్తించరాదు. తాడినెక్కువాడుంటే తలతన్నేవాడూ వుంటాడని అనుభవశాలులు అందుకే అంటాం

టాడు. రాక్షసరాజు హైహయునితో స్నేహం చేసుకుని మళ్ళీ పొగరుబోతు తనంతో ధాత్రీపతులపై దాడికి తిరుగుతూనే వున్నాడు. అతని వరగర్వం, అర్జునుని సాహచర్యం సిగ్గుమాలినవాణ్ణి చేసినై.

## రావణుడు వాలితో పోర కిష్కింధా నగరానికి పోవుట

తిరిగే కాలూ, తిట్టే నోరూ స్తిమితంగా వుండవన్నట్లు తనకు వైరి బాధ లేకపోవటం కారణంగా, వీరుడైన వాడి పేరు వింటే మానవుడైనావాడు దానవుడైనా కోరినచోటికి చేర్చే పుష్పకంపై సర్వసైన్యంతోపోయి యుద్ధానికి పిలవటం, కాదంటే జితోస్మి అనిపించటం పంక్తిముఖునకు పరిపాటి ఐంది. అప్పట్లో అర్జునుడుతప్ప అతని నెదుర్కొన్న మానవపతిగాని,దానవపతిగాని లేడు. ఆ తిరుగుడులో ఎవరో "వాలి పరాక్రమశాలి" అని చెప్పారు. ఇంకేం వైరిప్రీతినవాడివలె విమానంపై వాలి పాలించే కిష్కింధా నగరానికివచ్చాడు. వచ్చీరావటంతోటే మంత్రులచే వార్త పంపాడు. మంత్రుల మాటలు విని తారుడూ, సుగ్రీవుడూ, తార తండ్రీ వచ్చి "రాక్షసరాజా! నీవెంతో ఆశతో వచ్చావు. నీకు ప్రతి వీరుడైన వాలి ఇప్పుడు ఇక్కడ లేడు. ఇంకెవరితో యుద్ధం చేస్తావు? ఆయన వచ్చిన తరువాత వస్తే నీకు యుద్ధవాంఛ మళ్ళీ పుట్టకుండా చేస్తాడు. అంతవరకు నీవు ఓర్చుకోగలిగితే ఓర్చుకో. కాదుకూడ దంటే, మా ప్రభువు సంధ్య వార్చుకునేందుకు సముద్రానికి పోయాడు. ఆయన నాల్గు సముద్రాల్లో స్నానం చేసి యథావిధి సంధ్యవార్చి ఇంటికి వస్తాడు.నీవు పోదలుచుకుంటే ఈసమయంలో దక్షిణవార్ధి తటంలో వుంటాడు. పోయి అతనితోనే సంభాషిస్తావో, సంగ్రామం చేస్తావో,లేక చావునే వరిస్తావో నీవే తేల్చుకో. మా ప్రభువుతో ధంయనార్థం వచ్చిన శంఖవర్ణాస్థి చయం చూడు. అమృతం త్రాగి వచ్చినా మా స్వామిని చెనకితే నీకు మృత్యువు తప్పదు. సర్వజన చిత్తహారి, మా స్వర్ణమాలి, వాలి. కారణం లేకుండా కయ్యానికి కాలుదువ్వి నీ బ్రతుకు బాధలు చేసుకోవద్దు. నీ హితంకోరి చెప్పాం. ఇంటికి పోవటం సర్వశ్రేయం. చావదలిస్తే ఆయన యమదిశలోనే వున్నాడు. వెంటనేపో. శ్రమలేకుండా శమన మందిరం చేరుస్తాడు. ఈపాటికి

స్నానం ముగించి పావక తేజంతో పద్మాసనస్థుడై ధ్యానంలో వుంటాడు" అని ఎంతో ఆదరంతో అతి యథార్థం చెప్పారు. వాళ్ళ మాటల నిర్లక్ష్యం చేసి నానా దుర్భాషలు పలికి పుష్పకారూఢుడై దక్షిణాంభోరాశి దర్శనార్థం వెళ్ళాడు. అల్లంత దూరంలో మేరు పర్వతం మూర్తి వహించి వచ్చినట్లు, ఉదయభానునివలె బంగారుకాంతులు పరగిస్తూ, సంధ్యోపాసనా తత్పరుడై యున్న వాలిని చూచాడు. వెంటనే వ్యోమయానం నుంచి క్రిందికి దిగాడు. తన కోరిక తేలికగా సిద్ధించిందని పదాలు చప్పుడుగాకుండా వెనుకవైపునుంచి వచ్చి సౌత్రామిని (వాలిని) బంధించాలెనని భావించి చేరవస్తున్నాడు. నిశాచరపతి నిర్భాగ్యం పండిందేమో యాదృచ్ఛికంగా వానరేపుడు వాడిరాకను క్రీగంటితో చూశాడు. అతడు ఏ దుర్బుద్ధితో వచ్చాడో అర్థం చేసుకున్నాడు. తెలిసినట్లే లేకుండా మామూలుగానే తన ధ్యానంలో తానున్నాడు. కుందేలును చూచిన సింహంలాగా, పామునుచూచిన పక్షీంద్రుని చందంగా, రావణుని రాకను నిర్లక్ష్యంచేస్తూ "ఈ దుష్టుడు నన్ను క్షుద్ర జీవిగా భావించి పొంచి పట్టుకోవటానికి వంచనతో వస్తున్నాడు. వీడు చంకల క్రిందుగా చేతులు పెట్టగానే బిగించి ఇరికించుకుని మిగిలిన మూడు సంద్రాలలో మునిగి ఆహ్నిక విధి నిర్వర్తించుకుంటాను. నేను ఆకాశపథంలో మనోవేగంతో పోతుంటే గరుడుని కాళ్ళలో చిక్కిన కాల భుజంగం వ్రేలినట్లు వీడు వ్రేలాడి గత ప్రాణుడవుతాడు" అని తనలో తలపోసి, శ్రవణాలు ఆతనిపైనే వుంచి, బిగ్గరగా శ్రుతి మంత్రాలు జపిస్తూ కనులు మూసుకున్నాడు. ఈ విధంగా ఇద్దరూ అన్యోన్య బంధనాసక్త చిత్తులై అవకాశంకోసం వెదుకుతూ ఎవరి జతనంలో వారు వున్నారు.

## వాలి రావణుని చంకలో ఇరికించుకుని వనధుల్లో ముంచుట

మెల్లమెల్లగా దశవదనుడు తారా నాయకుని చేరవచ్చాడు. వాలి వాడి రాకను గుర్తించాడు. ఇంతలో వింశతిభుజుడు చేతులు చప్పుడు కాకుండా చాచాడు. తెలియనట్లే రెండు చేతులు గట్టిగా నొక్కాడు. పట్టిన పట్టుతోనే ఆమిషాన్ని తన్నిన డేగవలె అంబరానికి లంఘించి వాలి వాయువేగ మనో

వేగాలతో ఒగుదాకును సుడిగాలి కొనిపోయినట్లు రావణుని కొనిపోతున్నాడు. పోతూ పోతూ, తన వీపు గోకికొన్నట్లు రావణుని వీపు వాడి నఖాలతో చీర సాగాడు. నీలాంబుదం రక్తం వర్షించినట్లు రావణుని శరీరంనుంచి రక్తధారలు గురియఁగొచ్చినై. తాను తీసిన గోతిలో తానే పడ్డట్లు, వనచారిని బంధించ బోయిన నిశాచరి బంధితుడై మహా వాయుపథంలో కొనిపోబడుతుండే మంత్రులు ఉప్పరానికి ఎగసి వారిని వెన్నంటి ఆయుధాలు విసరసాగారు. మింటిపై పోతున్న భాస్కరుడులాగా వాలి పోతూ, తన్ను తరుముతూ వస్తున్న దనుజులకు బుద్ధి చెప్పదలచి వేగం హెచ్చిస్తూ పయనిస్తుండే ఆతని బాహూరుజవభవ వాయు విఘాతులై సమీపించలేక వెనుకకు తగ్గారు. రామచంద్రా! వాలి పరాక్రమం ఎంత చెప్పినా తనివితీరదు. అతడు గగన మార్గంలో ప్రయాణిస్తుండే ఉన్నతోర్వీధరాలు ఒరిగిపడి తలకి దారి ఇస్తవి. జీవకోటి మాట చెప్పేదేముంది? రాజహంసలకుగాని, వైనతేయునకుగాని పోరాని మార్గంలో పోయి సాగరత్రయంలో స్నానంచేసి, సంధ్యను ఉపాసించాడు. దక్షిణపు కడలినుంచి పడమటి కడలికీ, అక్కడనుంచి ఉత్తరపు సంద్రానికీ, ఆపై తూర్పు వారాశికి చని తన అనుష్ఠాన విధులన్నీ పూర్తి గావించుకుని కిష్కింధా నగరాభిముఖుడైనాడు. ఆ మహా జవసత్త్వ సంపన్నుడు ఆచరించిన అతిలోక కార్యం తిలకించి దేవతలు ముక్కుపై వ్రేలు పెట్టుకుని మురిసిపోయారు. తమ వైరికి జరిగిన పరాభవం కన్నుల పండుగగా కాంచి సుఖంగా శ్వాస విడిచారు. చతుస్సాగరాల మధ్యదూరం ఎన్ని వేల ఆమడలో, పాపం! అసురపతి కిక్కురుమనకుండా అన్ని వేల ఆమడలు భరించలేని బాధతో బొమ్మవలె ఆతనితో కొనిపోబడ్డాడు. కాల్యాలు నిర్వర్తించి ఇంద్రసుతుడు యథాప్రకారం, యథాకాలానికి కిష్కింధా ప్రాంత వనంలో అవతరించాడు. వింధ్య పర్వత సన్నిభుడైన నిశాటునితో వేల యోజనాలు గమించటంతో కలిగిన అలసట తీర్చుకొటానికి తన చంకనున్న రావణుని వదలి వెనుదిరిగి ఎరుగనివానివలె "అసురపతీ! ఎప్పుడువచ్చావు? ఇదిఏమిటి? ఎక్కడనుంచి రాక?" అని ఎలనవ్వొలయగా కుశల ప్రశ్న చేశాడు. ఆ ప్రశ్నలు ఆ శరణాయకునకు వినిపించినవోలేవో చెవులు దిబ్బెళ్ళుపడి ప్రాణ మాత్రావశిష్టంగా మిగిలింది కదా శరీరం?

## రావణుడు వాలితో స్నేహం చేయుట

వనేచర నాయకుని కుశల ప్రశ్నలకు నిశాచర నాయకుడు విస్మయాన్ని పొందాడు. వాలి చంకలో చిక్కి నలుగుకుపాటుచెంది, నయనాల్లో ప్రాణాలుంచుకున్న పంక్తిగ్రీవుడు చూపులు చలించగా, బొంగురుపోయిన గొంతుతో, "అగచరనాథా! ఆహాహా! ఏమి నీబలం? ఏమివేగం? ఏమిగాంభీర్యం? ఇటువంటి వీరపరాక్రమ, మహాశక్తిశాలిని ఇంతవరకు చూడలేదు. నాయంతవాణ్ణి చంకలో వాల్చిన కర్రవలె ధరించి, పసరాన్ని ఈడ్చికొని పోయినట్లు ఈడ్చుకునిపోయి అబ్ధిచతుష్కంలో అవలీలగా ముంచిలాగి తెచ్చావు. ఇంతచేసికూడ లేశమైనగానిసీ చెందవు. నారాక నీతో ఏమనిచెప్పేది? నీవు త్రిలోక వీరుడవని చెప్పగా విని నీతో పోరాడవచ్చాను. నాపేరు రావణుడు. వినతా తనయునకూ, వాయువునకూ, మనస్సుకూ మించిన వేగవంతమైన ప్రాణి లేదని లోకంలో వినికిడి వుంది. నీవు అంతవాడవేకాదు– అంతకంటె అధికుడవుకూడ. నీ వేగం, నీ శౌర్యం నేను స్వానుభవంతో తెలుసుకుని చెపుతున్న మాటలుకాని పొల్లుగాపల్కే పొగడికలుకావు. నీవంటివాని సఖ్యం నావంటివాడికి పెట్టనికోట. నేటినుంచీ నీతో చెలిమి గాఢంగావాంఛిస్తున్నాను. అగ్నిసాక్షిగా మనం మిత్రులమవుదాం. దారలు, తనయులు, పురం, రాష్ట్రం, భోగం, వస్త్రవాహన భూషణాహారాలు మనం అవిభక్తంగా అనుభవించుదాం. నీవూ నేనూ అనే భేదంలేకుండా ఏకజీవులుగా మెలగుదాం" అని అసురేశుడు అగ్ని రగుల్కొల్పి పావకసాక్షిగా ప్రమాణంచేసి చేయించాడు. అనంతరం ఒకరినొకరు ఆలింగనం చేసుకున్నారు. చేతిలోచేయివేసి బాస చేసుకున్నారు. ఈ విధంగా రెండు సింహాలు కలిసినట్లు, గుహలో ప్రవేశించినట్లు, వాలిరావణులు కేలుకేలు గదించి పుర ప్రవేశంచేశారు. ఒకనెల కిష్కింధలో వాలి మందిరంలో సుగ్రీవుని విధంగా పౌలస్త్యుడు అరమర లేకుండా హాయిగా కాలం గడిపాడు. అతికష్టంమీద అమరవిరోధి వృత్తాంతం తెలుసుకుని మంత్రులు ప్రభువును చూచి తాము వచ్చిన దండయాత్రలక్ష్యం జ్ఞప్తికి తెచ్చారు. వాళ్ళ పలుకులాలకించి దశముఖుడు వాసవపుత్త్రుని అనుజ్ఞగొని పూర్వంవలె లోకాలను బాధింపడానికి సపరివారంగా విమానారూఢుడై తరలిపోయాడు. విన్నావుకదా రామా! వీరుడైన రావణుని కథ? వాలి ఎంత

బలశాలో, రావణుని అలవోకగా ఎలా లోకట్టుకున్నాడో విన్నావుకదా? అంతటి శక్తిసంపన్నుడయిన వాలిని నీ శరానికి మంటలో పడిన శలభం చేశావు. ఇక నిన్నుగూర్చి ప్రశంసించటానికి ద్విసహస్ర జిహ్వలుకల అనంతునికే సాధ్యంకాదు. మాపోటులేపాటి? నీ ఆవిర్భావంతో నేల నాల్గు చెరగులు దుష్టులపీడనుంచి విముక్తమై నిర్భయంగా నిదురిస్తున్నై. మావంటి జడదారులకు జపతపోనిష్ఠలు నిరంతరాయంగా సాగుతున్నై. ఆ మిత్రులిద్దరు నీచేతనే నిహతులయ్యారు" అని అగస్త్యుడు పల్కి ఊరుకున్నాడు.

## శ్రీరాముడు అగస్త్యుని హనుమంతుని కూర్చి ప్రశ్నించుట

పరమ పూజ్యుడైన మహర్షి చెప్పిన వాలి రావణ మైత్రీబంధగాథవిని పరమానందాశ్చర్యాలు రాముడు పొందాడు.అంతటి వాళ్ళ మరణానికి వాళ్ళు ఆచరించిన ధర్మ విరుద్ధ కార్యాలపంటకు తాను నిజంగా నిమిత్తమాత్రుడనని తలచాడు. "బ్రహ్మర్షీ! మీ వాగమృతం ఎంత గ్రోలినా తృప్తి కలగటంలేదు. ఎంత ఇంపుగా, సొంపుగా, తీయగా కథ చెపుతారో ఇదమిత్థంగా చెప్పటం నాకు సాధ్యం కావటం లేదు. నా బాల్యంలో అపరబ్రహ్మ విశ్వామిత్రమహర్షి కూడ మీవలెనే చెప్పి ఎంతో ఆనందం కలిగించాడు. నేను వాలి రావణుల చరిత్ర శ్రద్ధగా విన్నాను. గెలుపోటములకేమి? అవి వీరులకు అవిలంఘ్యాలే. కాని నాకొక చిన్న సంశయం కలిగింది. వారిద్దరుకలిసికూడ మా హనుమకు తుల్యులు కారేమో? అన్నదే ఆసంశయం. శౌర్య నయసాధనాలూ, ధైర్య పరాక్రమాలూ, వాక్యబలాలూ, స్థైర్య ప్రాజ్ఞతలూ, పాండిత్యమహిమలూ, గుణదోషజ్ఞతలూ, సమయోచిత కార్య సంవిధాన స్ఫూర్తులూ వారిద్దరిలో హనుమ కున్నంతగా కనుపించవు. సముద్రం దాటటం సాధ్యంకాదని స్రుక్కె వానరులు ముదమందగా శతయోజన విస్తీర్ణ సాగరం దాటాడు. చీమకైనా ప్రవేశంలేని రావణుని అంతఃపురంతో లంకంతా శోధించాడు. పరులకర్థంకాని పలుకులతో నా వృత్తాంతం దేవికి వినిపించాడు. ఆమెను విగతప్రాణకాకుండా కాపాడాడు. దళవాయులనూ, మంత్రిపుత్ర కింకరులనూ, అక్షయకుమారుని ఒక్కడే హతం గావించాడు. ఇంద్రజి ప్రయోగించిన బ్రహ్మాస్త్రాన్ని విద

శించి రావణునితో నిర్భయంగా ముఖాముఖీ సంభాషించి, లంకను బూడిదెరాశి కావించాడు. రవిపుత్రాదులు ప్రతిఘటించినా విభీషణుని ఆప్తమిత్రునిగావించి సమయోచిత కార్యం సలిపాడు. ఇక ఆహవరంగంలో ఆతడు చూపిన శౌర్య ధైర్య స్థైర్యాలు అపారం. అవిఘంగా కాలుడుగానీ, సురపాలుడుగానీ, హవ్యవహుడుగానీ, గంధవహుడుగానీ, ఈశుడుగానీ, యక్షేశుడుగానీ ఎన్నడైన చేసినట్లు విన్నామా? ఈతని సాయంవల్లనేకదా లంకాపతి గెల్చి తమ్ములతో, సీతాసతితో, బంధువ్రాతంతో సుఖంగా వుండగలిగాను? ఈతడే లేకుంటే ఇంకెవరు సీతావార్త తెచ్చి నాకు వినిపిస్తారు? ఇటువంటి భూనుత విక్రమాఢ్యులు చతుర్దశభువనాల్లో ఎవరైనా వున్నారా? ఇది నాకు జరిగిన మేలు కూర్చి ప్రశంసించటంకాదు. అట్టిది ఎవరికి జరిగినా ప్రశంసాపాత్రమే కదా? ప్రభువూ, బలవంతుడూ అయినా వాలిని వదలి సుగ్రీవుని చెలిమి చేయటంలోనే హనుమ ఎంత ధర్మపరుడో, బుద్ధిమంతుడో తెలుస్తూనే వుంది. ఆతడు అన్న చేత అన్ని అగచాట్లు పడుతుంటే అడ్డుకోలేదు సరికదా తానూ అతనితోపాటు అనుభవించాడు. కాని, దవానలం అడవిని దహించినట్లు వాలిని హత మార్చక వూరుకోవటమే వింతగా వుంది. సామాన్యులే అభిమానం కలవానికి అపకారం జరిగితే సహించలేరే? ఈ లోకోత్తరమూర్తి కారణ జన్ముడు ఆత్మీయునకు అంతచేటు కల్గితే "ఎలా వూరుకో గలిగాడా?" అని శంక కలుగుతూంది. దీనిని బట్టి విచారిస్తే మాహనుమకుతనకు దైవమిచ్చిన బలం తనకే తెలియదేమో అనిపిస్తూంది. అలా అనుకొని సరిపెట్టుకోటానికి వీలులేకుండా నిర్వహించే పనులన్నీ నేర్పరులే తలక్రిందులయ్యేలాగా చేస్తున్నాడే? ఈ లక్షణం పరస్పర విరుద్ధంకదా? ఈ మూర్తిలో అది ఎలా అమరింది? ఎంత దీర్ఘంగా ఆలోచించినా నామనస్సుకు అందటంలేదు. ఈ భావం ఈతనిని కలిసినప్పటినుంచీ మనశ్శల్యంగా మారిపోయింది. పరిహారం ఈ నాటికి మీచే ప్రాప్తమైంది" అని హనుమ సమక్షంలోనే అడిగాడు. తన్నగ్గిస్తూ, తనపైగల అపారప్రేమ గౌరవాలు ప్రకటిస్తూ, తన గాథను అడుగుతున్న రామచంద్రుని ప్రఫుల్ల వదనారవిందం సిగ్గుతో చూడలేక పదారవిందాలపై పావని చూడ్కులు నిలిపాడు. అంతకాలం తన్ననుసరించివున్నా ఈ ఆలోచన చేయని తన తెలివితేని

తనానికి రవిజుడు తలవాల్చి రాముని చరణాలనే చూస్తున్నాడు. శత్రు మధ్యంలో తనకు స్థానం కల్పించి, రామానుగ్రహ పాత్రుణ్ణిచేసిన హనుమ జననగాథ వినే అవకాశం లభించి నందుకు శ్రవణేంద్రియానికి పని కల్పిస్తూ ఆ భాగ్యం పంచిపెట్టించుతున్న రఘుకుల తిలకుని చరణ రాజీవాలపై విభీష ణుడు చక్షురింద్రియాన్ని లక్షింప చేశాడు. సీతామాత హృదయపదన సరో జాలు ఒక్కసారే వికసించినై. ఆత్మపుత్రుని గుణగణాలు అభివర్ణిస్తుంటే తల్లి పొందే ఆనందం ఆ తల్లిలో వెల్లివిరిసింది. "అతడు చేసిన అనుపమాన కృత్యాలవల్ల గదా భర్తృచరణ సరోజసేవా భాగ్యం నిరంతరం నాకు కలి గింది" అని ఆనందాశ్రులతో అభిషేకిస్తూ పతి పదద్వయం వంక చూచింది. ఆ సభ అంతా పావనుని జన్మరహస్యం వినే కుతూహలంతో ఆతురత పొందింది. ఆ సమయంలో మహర్షి శంఖ స్వచ్ఛమైన బవిరిగడ్డం చేతితో స్పృశించి "రామచంద్రా! ఏమి నీబుద్ధి కౌశలం? ఏమి నీభక్త వాత్సల్యం? ఏమి నీసమతాదృష్టి? ఏమి నీవినయ సంపన్నత? మామనస్సులు, మాట్లాడు తున్నా, చూస్తున్నా నీ దివ్యమంగళ విగ్రహంలో లీనమైపోయినై. ఈ రహస్యం అందరికీ తెలియదు. దీర్ఘకాలం జీవించిన మావోంట్లకూ, జాంబవంతునికి మాత్రమే తెలుసు. ఆరహస్యం తెలిసినవాడు కనుకనే హను మంతుని స్తుతించి, ఆతని బలం ఆతనికి తెలిసేలాగా ప్రబోధించి భల్లూక పతి నీ కార్యం సాధించగలవాడు. ఇప్పుడాగూఢగాథ లోకం గ్రహించుగాక. నీవు సత్యవాక్పరి పాలకుడవు. సత్యకార్యాచరణాసక్త చిత్తుడవు. కనుకనే సత్య దర్శనుడవైనావు. నీవు శంకించింది సత్యమే. హనుమకు తనశక్తి తనకు తెలియదు. అందుకు బలవత్తరమైన మహర్షుల శాపం కారణం. ఆశాపం కూడ అతి బాల్యంలో అజ్ఞానంచేత వచ్చింది కాని, సాహంకారంతో సంపా దించుకున్నది కాదు. బలగమనంలో, ప్రజ్ఞలో, మేధలో, విద్యలో అతనికి అతడే సాటి. ఆతనికి ఆ శాపం ఎందువల్ల వచ్చిందోకూడ తెలియదు. ఆతని జన్మకథ వివరిస్తాను. విను.

## హనుమదుపాఖ్యానం

రామా! రవివంశజలధి సోమా! ధంతన భీమా! దైత్యవిరామా! ఈ గాథ చెప్పిన నాకూ, విన్న మీకూ సర్వసుఖాలు సమకూరుతై. మహీమండల

మందనాయమానమై భాస్కర వరంతో బంగారు కాంతులు చిమ్ముతూ మేరు పర్వతం మానదండంగా వుంది. ఆ పర్వత ప్రాంతానికి ఏలికగా 'కేసరి' అనే పేరుగల వానర వీరుడు ఉండేవాడు. అతనికి అంజనా నామంగల సాధ్వి సహధర్మచారిణి. ఆమె పవనుని అనుగ్రహంతో ఈ పవిత్రమూర్తిని కన్నది. ఈతడు సీవారశూకవర్తనువు (వరి ముల్లువంటి వన్నె గలవాడు) కలవాడు. ఈ బిడ్డను కని ఫలార్థం అడవికి ఆమె పోయింది. పుట్టగానే పావని పట్టలేని ఆకలితో, శరవణంలో షణ్ముఖునిలాగా రోదనం చేయసాగాడు. ఆ సమయంలో దాసాని పువ్వు జిగితో తూర్పు కొండపై సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఆ ఉదయ భాస్కరుణ్ణి ఎర్రని పండుగా ఎంచి క్షుద్బాధకు తాళలేక ఆ దిక్కుగా నేలపైనుంచి మింటికి లంఘించి పోసాగాడు. పుట్టీ పుట్టక మునుపే ఎవరికీ సాధ్యంకాని సూర్యమండలాన్ని చేరబోయే కపిబాలుణ్ణి చూచి దేవతలు, మునులు, యక్షులు దిగ్భ్రమచెందారు. వాయువేగ మనోవేగాలతో వాయు పథంలో ప్రయాణిస్తున్న వాలాత్మజుడు చూసేవాళ్ళ మనస్సుల్లో "చిన్నతనంలోనే ఇంత శక్తిగలవాడైతే యౌవనంలో ఏ విధంగా చేస్తాడో" అనే భావం ఆవిర్భవింపచేశాడు. తన కుమారుడు, ఆకలి తీర్చే తల్లి అడవిలోకి పోవటం, ఆకలితో సూర్యుని ఫల భ్రాంతితో మ్రింగపోతుండటం గమనించి సూర్య కరస్పర్శతో దగ్ధుడు కాకుండా శీతలత్వాన్ని వెదజల్లుతూ వాయువు వెంటపోతున్నాడు. సర్వసాక్షి, జగచ్చక్షువు అయిన భానుడు హనుమ రాక చూచికూడ, తన తీవ్ర కిరణ సహస్రాన్ని తాపరహితంచేసి "ఈ బిడ్డడు ఏమీ తెలియని శైశవావస్థలో వున్నాడు. ఈతనివల్ల మహా కృతులెన్నో ముందు ముందు జరుగవలసి వున్నై" అని భావించి ప్రతీకారం మాని చల్లని వెన్నెలలాగా మార్చాడు. తన గమనానికి ఎట్టి ఆటంకం లేనందున, జనకుని శక్తి, తన శక్తి తోడ్పడగా వేల యోజనాలు ప్రయాణించాడు. ఆ రోజే సూర్యగ్రహణం. రాహువు సూర్యుణ్ణి గ్రసించవచ్చాడు. అంతకుముందే భానుడివైపు బాణ వేగంతో పరువెత్తుతున్న వింత మూర్తిని కాంచి వెరగుపడి భయంతో పారిపోయి సురేశుని పాదాలపైపడ్డాడు. కారణం ప్రశ్నించిన మహేంద్రునితో "దేవా! సూర్యచంద్రులను కొంతకాలం తేజోహీనులచేసే కార్యం నాకూ కేతువుకూకల్పించి, ఈరోజు ఇంకో వింతమూర్తిని

ఎందుకు నియమించావు?" అని దీనంగా పల్కాడు. స్వర్లోకపతి స్వర్భానుని పలుకులాలించి, ఊరడించి, చప్పున పీఠంపైనుంచిలేచి, కాంచనమాల ధరించి, కైలాసనగాగ్ర సన్నిభం, లాలితభూషణ భూషితం, ఘంటికాసముదయ ఘోషితం, చతుర్దంత సంశోభితం అయిన ఐరావతాన్ని అధిరోహించి రాహువు దారిమాపగా రవిప్లవగార్భకులున్న చోటికి వచ్చాడు అమరేశుడు ఆజ్ఞ ఈయగా రాహువు రాజీవమిత్రుని అడ్డగించపోయాడు. దూరంగా వున్న దినమణినివదలి దగ్గరగావున్న రాహువును చూచి నల్లనిపండని తలచిపట్టి మింగాలని మారుతి వెంటబడ్డాడు. ఆ బాలుని వేగంమాచిన రాహువు ప్రాణ భయంతో పారిపోతే విడవకుండా బాలకపి వెన్నాడాడు. ఇక తనకు చావు తప్పదని ముఖశేషుడు (రాహువు) "దిక్పాలపతీ! నీవేదిక్కు. నన్నీ బాల వానరం కబళింప వస్తూంది. నన్నెలాగైనా రక్షించు" అంటూ ఘోరంగా అరవసాగాడు. ఆ ఆర్తనాదం విన్న ఇంద్రుడు "భయపడకు. బాలకుని త్రుంచి నిన్ను రక్షిస్తా"నని అభయం ఇచ్చాడు. ఇంతలో పారిపోతున్న రాహువును వదలివేసి తెల్లంగా వున్నతంగావున్న సురేశుడెక్కివచ్చిన ఐరావతాన్ని చూచి "ఇది తెల్లనిపండు" అని దాని మింగ ఎదురుగాపోసాగాడు. అదిచూచి అమరనాయకుడు మొదలుకే మోసంవస్తుందన్నదనే భీతితో ముందూవెనకా చూడకుండా చేతనున్న వజ్రాయుధాన్ని గిరగిరత్రిప్పి విసిరాడు. ఆ కులిశం ఆగకుండా వచ్చి బాలుని హనువుభగ్నం చేసిపోయింది. ఆశరాఘాతికి ఆగలేక మూర్ఛిల్లి బాలుడు పర్వతంపై పడ్డాడు. ఆపాటులో బాలుని వామహనువు భగ్నమైపోయింది. సర్వవ్యాపకుడైన వాయుదేవుడు కుమారుని పాటుగని కోపఘూర్ణితలోచనుడై ఆకృతి ధరించి అర్భకుని గ్రుచ్చి ఎత్తి అంకంలో చేర్చుకున్నాడు.

## వాయు నిరోధంతో లోకాలు బాధపడుట

"ఇంద్రుడు ఎంతపనిచేశాడు? నా యత్నం సర్వనాశనం చేశాడు. దేవతాకార్యం చెరిచాడు. తమ విముక్తికి పన్నిన వ్యూహ ఫలితంగానేకదా ఈ బిడ్డ జన్మకు నేను కారకుడయ్యాను. ఈ బాలుడుచేసిన అపకారం ఏముంది? ఆ బాలచేష్టకు ఎవరైనా ముప్పుపడతారుకాని, మృత్యుముఖంలో తోస్తారా? నా ఆనందం నాశనం అయిన తర్వాత ఈ లోకాలు వుండేం? ఊడితేఏం?"

అని తన సర్వవ్యాపకత్వాన్ని ఉపసంహరించి, ఈశ్వరాంశతో తనంతవాడుగా జనించిన పుత్రుడు స్పృహలేకుండా పడివుండటం చూడలేక, ఏం చేయాలో తోచక ఆత్మీయమైన ప్రాణాధార శక్తిని కేంద్రీకరించి బిడ్డపై ప్రయోగించాడు. కొంచెం కదలగా పుత్రునికొని గిరికందరంలోనికి ప్రవేశించాడు. పర్జన్యుడు వర్షాన్ని ఆగినట్లు వాయువు సంచారాన్ని నిగ్రహించేసరికి బ్రహ్మాండ గోళాలు పరిభ్రమణం మాని స్తంభించినై. జీవకోటికి విణ్మూత్ర విసర్జనంలేదు. శ్వాసలేదు. సంధులు బద్ధమై, రక్తస్రావం ఆగి, జడములై, కట్టెలవలె ముడుచుకు,చాచుట దుస్సాధమైంది. శ్రుతిపఠనం,హోమకార్యం సున్న అయినై. నిత్యకర్మలు నిలిచిపోయినై. ధర్మకార్యాలుతలగిపోయినై. పవనాగ్రహంతో బ్రహ్మ సృష్టికే బ్రతుకులేకుండా పోయింది. ఆవేళ ఈ హఠాత్సంఘటనకు భయభ్రాంతులై, యక్షరక్షో గంధర్వ సురుద్ర మరుద్గణాలు గొల్లున గోలపెడుతూ, పొట్టలుబ్బగా, నడక క్షీణింపగా అతి కష్టంమీద సత్యలోకంచేరి "పాహిమాం, రక్షమాం, హేభగవాన్! అభవ" అంటూ మొర పెట్టారు. సృష్టి కార్యంలో నిమగ్నుడైన చతుర్ముఖుడు వెంటనే ఆత్మ సమాధిమాని వారిమ్రోల ఆవిర్భవించాడు. వచ్చిన వాళ్ళంతా వనజగర్భుని పాదాలపైబడి, "స్వయంభూ! జీవరాశిని సృష్టిస్తూ ప్రభంజనుణ్ణి ప్రాణపతి చేశావుకదా? ఆ జగత్ప్రాణుడు ఆగ్రహించి, అంతఃపురకాంతల వలె అవరోధం కలిపించి అటు ఇటు కదలకుండ చేశాడు.సర్వప్రాణిసంహారం జరిగి ఎప్పుడో రాదగిన ప్రళయం ఇప్పుడే వచ్చేట్లుంది. శరణు శరణు పద్మాసనా! మాతోపాటు లోకాలను ఉద్ధరించు" అని నూతిలో ధ్వనివలె వేడుకున్నారు. వారి బాధచూచి ఆత్మదృష్టిని అసలు విషయం గ్రహించి, "మహాప్రజలారా! మీరు భయపడకండి. అంతా తెలుసుకున్నాను. సింహికా పుత్రుడు చెప్పిన మాటలువిని ఇంద్రుడు చిత్తస్థిరతలేక పవనుని ప్రసాదంచే అంజనకు కల్గిన కపిబాలుని వజ్రాహతిచే బాధించాడు. ఆ శిశువు మూర్ఛ మునిగి వున్నాడు. లోకరక్షణ దీక్షాదక్షమైన ఆత్మశక్తి అంతా కేంద్రీకరించి ఆ బాలుని బ్రతికించుకోవాలని అనిలుడు యత్నిస్తున్నాడు. తొందరగా పదండి. ఆ బాలుడు కారణజన్ముడు. మృతిచెంద వీలులేదు" అని హంస వాహనారూఢుడై దేవతలంతా సేవింపగా, మేరు పర్వత గుహాభ్యంతరంలో

సాక్షాత్కరించి, దిననాథ కాంచన కృశాను సమాన తేజోవంతుడైన పసిపాపని ఒడిలో పెట్టుకుని విచారంతో వున్న పవమానుని ప్రబోధించాడు. వెంటనే స్పర్శనుడు కుమార రత్నాన్ని చేతులలో తాల్చి లేచివచ్చి నలినభవుని దర్శించాడు.

## బ్రహ్మాది దేవతలు హనుమకు వరాలిచ్చుట

చలించుతున్న కుండలాలతో, సుమదామాలతో, మణికాంచనహారాలతో ముమ్మారు సాష్టాంగదండ ప్రణామాలుచేసి పసిబాలుని పాదాలపై నుంచి కన్నీరు మున్నీరుగా శోకించాడు. పరమేష్ఠి చతుర్బాహులతో పవనుని లేవనెత్తి, పాదాలపై నుంచిన బాలుని ఎత్తుకొని ప్రేమపూర్వకంగా శరీరమంతా నిమిరాడు. పద్మజుని పవిత్రహస్త స్పర్శవల్ల వాడిన సస్యం వర్షానికి తేరుకున్నట్లు పావమాని మరల ప్రాణవంతుడైనాడు. పుత్రుడు పునర్జీవితుడు కాగానే దుఃఖాశ్రువులు మోదాశ్రువులుగా మారి గంధవహుడు చతురాననుని అనేక విధాల స్తుతించాడు. ఆనందం వెల్లివిరియగా ఆత్మనిగ్రహం విడిచి సర్వప్రాణుల్లో సంచరించి చైతన్యం సముద్ధరించాడు. స్తంభీభూతమైన లోకాలు వీత శీతవాత జాతబాధమైనై. సూర్య గమనం సాగింది. సమస్త జీవకోటి చైతన్య సమృద్ధమై స్వీయ కర్మాచరణకు గడంగింది. అబ్జజుడు ఆనంద వికసితవదన సరోజుడై స్పర్శనుని సంతోషపెట్టవలచి "ఓ హరిహయా! ఈశా! అపాంపతీ! ధనేశా! దండధరా! మీరంతా ఈ బాలుని ఆశీర్వదించండి. ఈ బిడ్డకు దేవహితంకోసం పరమేశ్వరాంశతో నా సంకల్పానుసారం సమీరుని కృతంగా జన్మించాడు. లోకంలో ఇంతవరకు ఎవరు చేయనిదీ, ఈతని అనంతరం ఎవరూ చేయలేనిదీ అయిన మహాకార్యం చేయవలసి వుంది. అది ఏదో మీకూ తెలుసు. భావిని దృష్టిలో వుంచుకుని బాలకుని దీవించండి. మనం చేసిన ఈ కార్యం మారుతునకూ, మారుతికీ మోదంకల్గి శుభావహంగా పరిణమించాలి" అని చెప్పాడు. అప్పుడు శక్రుడు దివ్య పద్మమాలిక సృజించి పసివాని మెడలో వేసి, "నా పవిధార చేత గదా బాలుని హనువు నొచ్చింది? అది బాలునికి అలంకారహేతువై హనుమంతుడనే నామం కలిగించి సకల భువన పూజితునిగా చేస్తుంది. ఇకముందు శతార పాతంతో మరణించకుండా వరమిస్తున్నాను" అని దీవించాడు. తరువాత

భాస్కరుడు కరుణార్ద్రచిత్తుడై "ఈ బాలకునకు నా తేజంలో శతాంశ ఇచ్చాను. వీడు విద్యార్జనచేసే వయస్సు రాగానే వీనికి గురువునై సర్వవిద్యల్లో సముడు లేనట్లు చేస్తాను" అని పల్కాడు. పిమ్మట దండధరుడు బాలుని లక్షించి "కాలదండాదులచేత చావకుండా, ఆధివ్యాధులు రాకుండా, యుద్ధంలో అప జయ విషాదాలులేకుండావుండే వరాలు ఇస్తున్నాను"అని అన్నాడు. అనంతరం యక్షేశుడు, తన గద వలనగానీ, తన శక్తిగలిగిన ఏ ఇతరమైన ఆయుధాల చేతగానీ చావనట్లు వరమిచ్చాడు. ఈశ్వరుడు ఆత్మ మహితాస్త్ర శస్త్రాదులు కారణంగా మరణించకుండా అనుగ్రహించాడు. అందరు తమతమ ఉత్సాహం కొద్దీ ఇంకెన్నో వరాలు ఇచ్చి ఆశీర్వాదంచేశారు. అజుడు ఆనందం సముద్రం వలె పొంగగా ఆ బాల కపికి "వాడిచేత, వీడిచేత అనే విచక్షణ లేకుండా పునస్సృష్టి వరకు జీవించే ఆయువు నేను ఇస్తున్నాను. తిరుగులేని బ్రహ్మా స్త్రం, బ్రహ్మదండం మొదలైన నా పేరిటి ఆయుధాలు బాలునేం చేయకుండా వుండేట్లు అనుగ్రహిస్తున్నాను. ఈతడు ఘటికా సప్తకం ఆ శక్తిని ఒక్క సారి మన్నిస్తే ఆపై అది ఏంచేయలేవు"అని అపూర్వమైన వరాలు ఇచ్చాడు. విశ్వకర్మ "నాచేనిర్మితమైన అస్త్ర శస్త్రాలు ఈ బాలునిపైన పనిచేయకుండు గాక. చిరాయుష్మంతుండగుగాక" అని దీవించాడు. పద్మాసనుడు "సమీరా! ఇక గతంమరచిపో. నీ పుత్రుడు నిజంగా మాకంటే అధికుడైనాడు. అందుకు నాకెంతో హర్షం కలిగింది. ఇకముందీతడు అమిత్రభీప్రదుడూ, మిత్ర ముదా వహుడూ, భుజశాలీ, దుర్జయుడూ, సకల విద్యావిశారదుడూ, కామచరుడూ, కామరూపీ, ఎదురులేని మహావీరుడూ, సిద్ధపురుషుడూ అవుతాడు. రావణ సంహార సమయంలో రామచంద్రునకు బాసటగానిల్చి అద్భుతకార్యాలు నిర్వ హించి నిరంతర ప్రవర్ధమానయశోవిశాలుడై అనంతరం నా స్థానం ఆక్ర మించుకుంటాడు. నీవు నీవిధి యథాప్రకారం నిర్వహించి జగత్ప్రాణ నామం సార్థకం చేయి" అని పల్కి బాలుని చేతికందించి దేవతాగణంతో అదృశ్యు డైనాడు. పరమానంద భరితుడైన పవనుడు పసివానిని ప్రేమతో ముద్దాడి బిడ్డ కానరాక దురపిల్లుతున్న అంజనాదేవివద్ద కేగి జరిగిన విషయం తెలిపి సంతోషం కలిగించి తన విధ్యుక్తధర్మంలో నిమగ్నుడైనాడు.

# మునులు హనుమంతుని శపించుట

అప్రయత్నంగా అద్భుతవరాలు పొందిన అంజనా సుతుడు శైశవావస్థలోనే, కారణం తెలియకపోయినా సర్వశక్తులు తన్నాశ్రయించి వున్నందున జాతి చపలత్వంతో మునుల ఆశ్రమ ప్రాంతాల్లో ప్రవేశించి వల్కలాలువిచించి, అగ్నిహోత్రాలు ఆర్పి, స్రుక్పటాలను పగులగొట్టి పీడాకరంగా ప్రవర్తించ మొదలు పెట్టాడు. అక్కడి మునిచంద్రులు, సకలదేవతానుగ్రహపాత్రుడూ, విధివిశ్వకర్మదత్త చిరాయుష్మంతుడూ అల్లరికపి బాలుడని తెలిసిన వారు కనుక ఆగ్రహం మాని చూచీ చూడనట్లు సద్దుకొన్నారు. అంత కంతకు ఎదుగుతున్న వయస్సుతోపాటు అగచరబాలుని అల్లరి చేష్టలు కూడ ఎదుగసాగినై. మునుల నిత్యకర్మలకు అంతరాయం అధికమైంది. చెపితేవినే వయస్సుకాదు. తెలిసిచేసే చిలిపిపనికాదు. శిక్షించేంత పెద్దకార్యం కాదు. అది అజ్ఞానం చిందులుత్రొక్కే శైశవం. కాని ఏదోవిధంగా ఆబాలుని అగడం ఆపాలి. అందుకు మునులంతా ఆలోచించి "కపిబాలకా! ఏ వరశక్తి బలంతో ఇంత అల్లరి చేసి మా కర్మలు పాడుచేస్తున్నావో ఆ వర బలం నీకు స్మృతిలో నిలిచి వుండకుండుగాక" అని శపించారు. వెంటనే వాయుదేవుని హృదయం ఝల్లుమంది. దేవకార్యం నిమిత్తం తనకు ప్రతిగా సృజించిన బాలుని మునీశ్వరులు శపించటంతో భావికాలం అంధకార బంధుర మవుతుందని వాణిని ప్రేరేపించి మునులచే శాపోపసంహారం చేసేట్లు చేయమన్నాడు. ఆమె ఒక వృద్ధముని హృదయంలో ప్రవేశించింది. తత్‌క్షణం ఆవృద్ధతాపసి "అయ్యో! ఎంత పెద్దపని చేశారు? మీతపఃఫలం ఎంత వ్యర్థం చేశారు? ఆ బాలుని అంత ఘోరంగా శపిస్తారా? ఈ మాత్రం సహనం లేని మన తపస్సెందుకు? అరణ్యవాసమెందుకు? కాల్పనా? ఇక్కడ సుఖంగా కర్మలు జరక్కపోతే ఇంకోచోటికిపోయి నేరవేర్చుకుంటాం. ఎంతో దూరదృష్టితో దేవతలు వరాలిచ్చి ఈ బిడ్డను ఉద్ధరిస్తే మీరు ఆ బిడ్డను అప్రయోజకుణ్ణి చేస్తారా? దైవకార్యం విఘ్నంచేసి, శిష్టరక్షణకు అవకాశం శూన్యంచేసిన మిమ్ముల నేనిప్పుడే శపిస్తున్నాను" అని అంటుండే మునీశ్వరుల మోములు వెల్లనైనై. చేసిన తప్పులు తెలుసుకున్నారు. ఆక్షణమే వృద్ధతాపసిని ఆగ్రహముక్తుణిచేసి "హనుమా! నీవు పొందిన సర్వశక్తులు నీలోనేవుంటై. మాశాపం

వల్ల నీకు స్మృతికిరాపు కనుక ఎవరైనా నిన్ను స్తుతించి నీ ప్రజ్ఞను గుర్తుచేస్తే అన్నీ యథావిధిగా ప్రవర్తిస్తై" అని శాపవిముక్తి అనుగ్రహించారు. ఆనాటి నుంచి ఈ మహాసుభావుడు సామాన్య మర్కటబాలకునివలెనే సాధుశీలుడై సంచరించసాగాడు. ఇక్కడ ఇలా వుండగా, దక్షిణాపథంలో ఋక్షరజుడు అనే నామంగల మహా మర్కటుడు కిష్కింధకు రాజుగా పాలిస్తున్నాడు. ఆతడు ధర్మపరతంత్రుడై బహుకాలం కపికులాన్ని ఏలాడు. ఆయనకు ఇంద్రతేజంతో ఒక శిశువూ, సూర్యతేజంతో ఒక శిశువూ అర్ధాంగియందు ఏకకాలంలో కవలుగా కలిగారు. ప్రథమంగా ప్రసవించిన బిడ్డకు వాలి అనీ, ద్వితీయంగా కన్న శిశువుకు సుగ్రీవుడని నామకరణం చేశాడు. ఆ బిడ్డలు శుక్లపక్షశశాంకరులవలె దినదిన ప్రవర్ధమానులైనారు. బహుకాల పాలనానంతరం వయోవృద్ధు ఋక్షరజుడు స్వారాష్ట్రం చేరుకున్నాడు. ఆయన మరణానంతరం మంత్రులు వాలిని తండ్రి పీఠంపై, సుగ్రీవుని అన్నపీఠంపై నిల్పి రాజుగా, యువరాజుగా అభిషేకించారు.ఆమహోత్సవానికి ఆహ్వానితులై అంజనాసతీ, హనుమంతుడూ, బంధుపరివారంతో కేసరి కూడా వచ్చాడు. అప్పుడే రవిపుత్రునకూ, హనుమకూ చెలిమి కలిగింది. తదాది ఇరువురూ ఏకరూపులుగా స్నేహం చేశారు. ఆ స్నేహం అనుపమానం. ఛిద్రవర్జితం. అద్వైతం. తలిదండ్రులు స్వరాష్ట్రానికి పోయినా హనుమ మాత్రం మిత్రుని విడిచిపోలేదు. శైశవంలో మౌనివరులచే పొందిన శాపకారణం వల్ల తన శక్తి తనకు తెలియక, అనంతరం వాలిచే కల్గిన కష్టాలు భరించలేక సుగ్రీవుని వలెనే తానూ ఆతనితో పారిపోయాడు. ఏమాత్రం హనుమ శాప వృత్తాంతం ఎరుగనివాడు కావటంచేత సుగ్రీవుడు కూడ స్మృతికి ఆతని పరాక్రమాది గుణవిశేషాలు తీసుకరాలేదు. ఇంత మహాబలుడు అండగా తనవద్ద వుండికూడ దంతి తరుమగా సింహం పారిపోయినట్లు రవిజుడు పారిపోవటానికి, అతనితో హనుమ పోవటానికి అదే కారణం. ధైర్యస్థైర్య పరాక్రమాల్లో, శౌర్యగాంభీర్య బుద్ధుల్లో, చాతురీనయ వీర్యయుక్తి సూక్తుల్లో, మాధుర్యకార్యధురీణతా జనతుష్టికారణ చర్యల్లో, సూర్య శిష్యుడూ, ప్రభంజన పుత్రుడూ, అయిన హనుమంతునకు సాటి ఎవరున్నారు? అహో! రామభద్రా! మనపావని విద్యాభ్యాసకాలం రాగానే దినకరుని గురువుగా వరించి ఉదయాస్తమయ పర్వతాల

వరకు వెన్నంటి వదనం వద్ద చెవిపేర్చి వ్యాకరణం సూత్రం, వృత్తి, వాటికి భాష్యం, అర్థం, పదం, మహార్థం, అన్యశాస్త్ర పాండిత్యం, ఛందం చక్కగా అభ్యసించాడు. ఇటువంటి కీర్తనీయ చరిత్రకల మారుతి కేవల కపిమాత్రుడే? అన్ని విద్యల్లో అమరగురువంతవాడు. నవ వ్యాకరణవేత్త. భవనీయాను కంపచే భవిష్యద్బ్రహ్మకాదగినవాడు. జగత్తులముంచ పెరిగిన సాగరుడైనా, అన్ని లోకాలదహించ విజృంభించిన అగ్నియైనా, ప్రళయకాలంలో రేగిన వైవస్వతుడైనా వాయుజుని ఎదుట ఏమీకాదు. కోదండరామా! మన హనుమంతుని అంతవారుకాకున్నా, ఆహవంలో నీకు బాసటగా నిల్చిన సుగ్రీవ మైందద్వివిద కేశరంభనల సుషేణ గవయ గవాక్ష తారాంగదులు దేవాంశలతో జనియించారు. రఘువంశనందనా! నీవు కోరిన హనుమజ్జనన రహస్యం అంతా వినిపించాను. ఇంత అద్భుతావహం, ఇంత శక్తిమంతం, ఇంత మనోనంద ప్రదం ఐన గాథ ఇంకొకటిలేదు" అని వివరించి ముగించగానే సదస్సు విజమాకిలినమైంది. అందరి హృదయాలు ప్రఫుల్లమైనై. అందరి నేత్రాలు ఆనందాశ్రులతో నిండినై. అందరిలో హనుమమూర్తి ప్రతిఫలించింది. అందరు భక్తిపారవశ్యంతో

"మనోజవం మారుతతుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామ దూతం శిరసానమామి.

ఆంజనేయమతి పాటలాననం, కాంచనాద్రికమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం, భావయామి పవమాన నన్దనమ్
గోష్పదీకృత వారాశిం, మశకీకృత రాక్షసాం
రామాయణ మహామాలారత్నం, వన్దే-నిలాత్మజమ్.

అంజనానన్దనం వీరం జానకీ శోకనాశనం
కపీశమక్ష హన్తారం వన్దే లంకాభయఙ్కరమ్."

అని గళమెత్తి స్తుతించారు. హనుమగాథ వింటున్న సీతారామచంద్రుల స్థితి వర్ణించ వాక్కులే లేవు. వారి బాహ్యాభ్యంతర నేత్రాలు హనుమ శైశవం

నుంచి తమ వద్దకు వచ్చే వరకు జరిగిన పరిణామక్రమాన్ని దర్శించి పరవశ మైనై. ఆ ఆనందకోలాహలం ఆగిపోగానే లోపాముద్ర ప్రాణేశుడు రాముని వంక వీక్షించాడు.

## అగస్త్యాదులు రామాజ్ఞ కొని స్వాశ్రమాలకు పోవుట

"రామభద్రా! అడిగిన అన్ని విషయాలు తెలిసినంతమేర వినిపించాను. నీవూ, దేవీ, సోదరులూ, మంత్రి బంధుపరివారజనం పౌరులు విన్నారు. ఇక మాకు అనుమతి ఇస్తే మా ఆశ్రమాలకు మరలిపోతాం" అని విన్నవించాడు. "మహర్షిశ్రేష్ఠా! నీ రాకచే నేనేకాక నా వంశమే తరించింది. నేనర్చించే దేవతలు, నా తాతలు, తండ్రి తుష్టిపొందారు. నా వారంతా శాశ్వతానందాన్ని సాధించారు. మీకు నా వలన కాదగిన దేముంది? సంకల్పమాత్రంచేత సర్వం ప్రసాదించగల మహా తపస్వులు. నేను మీ వాడనుగా భావించి నే చేసే విన్నపం మన్నించండి. ఏనాడైనా మీరాక వాంఛించితే నిరాదరించక దర్శనం ఇచ్చి అనుగ్రహించండి. అరణ్యవాసం ముగించి వచ్చి అవనీ భారం వహించి కొద్దికాలమే ఐంది. పౌర జానపదులను స్వీయ ధర్మాచరణమందు తడబాటు లేకుండా యథావిధిగా చేసేట్లు చేయాలె. ఆ కార్యం ముగియగానే యజ్ఞం చేయదలిచాను. అధ్వరం పూర్తి అయ్యేవరకు అజస్రం ఇక్కడే వుండాలె. సవన కార్యం మీ చేతులమీద నిర్విఘ్నంగా సలపాలె. విధూత కల్మషులైన మిమ్మల్ని హితమతితో ఆశ్రయించి కృతులు నిర్వహించి పితరుల అనుగ్రహ పాత్రుణ్ణి కావలెను. ఆ వరం నాకు అనుగ్రహించండి" అని రాముడు ముకుళితకరా రవిందుడై అర్థించాడు. మౌనులందరు హర్షంతో అంగీకారం తెలిపి స్వాశ్రమాలకు వెళ్ళిపోయారు. ఆనాటికి సభ చాలించి క్రతువిషయిక చింతాభరిత స్వాంతుడై సింహాసనంనుంచి లేచాడు. మందేహారి మందకరుడైనాడు. మర్కట రాక్షసులను, సభాసీనులైనవారిని ఆవాసాలకు వెళ్ళగా అనుమతించి, దేవిని అంతఃపురానికి పంపి, తమ్ములతో కూడి మాతృమూర్తి గృహం ప్రవేశించాడు. సోదరులు తమ మందిరాలకు సాయం సమయవిధులు ముగించటానికి వెళ్లారు.రాముడు అనుష్ఠానంపూర్తికాగానే ఆరగించి, అంతిపురి

చేరి హాయిగా విశ్రమించాడు. పట్టాభిషేక ప్రథమ దివసం ఈ విధంగా చెల్లింది. రాత్రి వేగింది. మధురమంజుల మనోహర గళాలెత్తి "కౌసల్యానంద వర్ధనా! కరుణాకరథీ! దాశరథీ! మేలుకో. నీవు నిద్రిస్తే నిఖిల లోకాలు నిద్రిస్తై. సత్యపరాక్రమా! రఘురామా! నీవు విక్రమంలో విష్ణువవు. రూపంలో అశ్వనీ కుమారులంతవాడవు. బుద్ధిలో బృహస్పతివి, పరమేష్ఠి తుల్యుడవు. క్షమలో కాశ్యపికి సమం అవుతావు. తేజంలో దినమణివి. జవంలో పవనుడు నీకుసాటి. గాంభీర్యంలో సాగరుడు సముడు. అప్రకంప్యతలో స్థాణుడవు. సౌమ్యంలో చంద్రుడవు. భూతభవిష్య ద్వర్తమానాల్లో మేదినీ పతులు నీ సరియైనవారు లేరు. అతి దుర్ధర్షుడవూ, క్షితి జనహితకరణ వృత్తి చెలగేవాడవూ కావటంచేత, కీర్తి, లక్ష్మి నిన్నాశ్రయించి వున్నై. లక్ష్మి, ధర్మం, సత్యం నిరంతరం నీయందే ప్రతిష్ఠితం" అని వందిమాగధులు సుందరంగా గానం చేశారు. సూతకాంత స్తుతులువిని, పాలకడలిలో ఫణిరాజ శయ్యపై నుంచి లేచిన నారాయణునివలె ధవళకాంతుల విరజిమ్మే మణిమయ శయ్యపై నుంచి రాముడు లేచాడు. లేవగానే పరిచారకులు ప్రాంజలులై బంగారు భృంగారకాల్లో పరిశుద్ధ జలం అందీయగా శుచియై, అగ్నిహోత్ర గృహం ప్రవేశించి గార్హపత్యాగ్నిని యజించి, మూలపురుషుడైన ఇక్ష్వాకు నిర్మించిన దేవతా మందిరంచొచ్చి, దేవపితృ సేధాలు ముగించి, ధరణీసురులు ఆశీర్వదించగా అర్చించి, బాహ్య మందిరానికి వచ్చాడు. అప్పటికే వేచివున్న వసిష్ఠాది మహర్షులు, మంత్రులు, వేత్రహస్తులు వెన్నంటిరాగా, ప్రజలు ప్రశంసా వాక్యాలు పలుకగా, సభాప్రవేశం చేశాడు. నానా దేశాధీశులు రామ చంద్రుని సమీపంగా సమాసీనులైనారు. వేద్యత్రయిలాగా భరత లక్ష్మణ శత్రుఘ్నులు దక్షిణ భుజంవైపు దగ్గరగా కూర్చున్నారు. సచివ సేనానులు వారి పీఠాలపై ఉపవిష్టులయ్యారు. సుగ్రీవుని అనుసరించి మైంద ద్వివిదాంగద జాంబవంతాదులు మహా వానర నాయకులు ఇరవై మంది ప్రభువు ముందు వరుసలో సచివచతుష్కంతో విభీషణుని కూడి ఉపస్థితులయ్యారు. వేద వేదాంగ పారగులైన విప్రులు ఒక వంక, మహర్షిగణం మరోవంక, పట్టాభిషేక దర్శనార్థం వచ్చిన నిర్జరులు ఇంకోవంక సుఖాసీనులయ్యారు. పేకోలగం మధ్యలో రాజించే ఇంద్రునివలె మహాసభా ప్రాంగణంలో ధర్మ

సత్య ప్రతిరూపమైన ఐక్ష్వాక సింహాసనంపై దేవితో ఆసీనుడైనాడు. పౌరాణికులు ఉచితరీతి మనోహర గాథలు పఠించి తప్పుకున్నారు. హాస్యరస చక్రవర్తులు విచిత్ర ధారణంతో వచ్చి వింత వింత సంభాషణలతో కడుపులుబ్బ నవ్వించి అపసరించారు.

## శ్రీరాముడు జనకాదిరాజుల స్వదేశాలకు పంపుట

అనంతరం రాచకార్యాలు పరిశీలించి, పౌరుల విన్నపాలు ఆలించి, విషమమైన అభియోగాలు ఊహించి ధర్మ నిర్ణయం ప్రభువు ఎలాచేయాలో చర్చించాడు. కాలోచితంగా సమావేశం ముగించి అందరినీ గృహాల కంపి తన తల్లి మందిరం తాను చేరాడు. ఆపై పూర్వాచారం ప్రకారం అన్ని పూర్తి చేశాడు. ఈ విధంగా దిన దినం జగతీపాలనాన్ని, ఆత్మీయధర్మాన్ని అర్హ పద్ధతిలో సాగిస్తూ, జనపద రాష్ట్ర దేశ జనసమ్మతంగా ప్రభు ధర్మాన్ని పాలించాడు. ఒకనాటి కొలువులో పూజ్యుడూ, రాజర్షీ, మామా, అయిన మైథిలునికాంచి, లేచి నమస్కరించి, "జనక చక్రవర్తీ! నీవే మాకు రక్ష. నీ అపారభక్తి జ్ఞానవైరాగ్యతత్త్వ ముక్తి ప్రపూర్ణమైన పరిశుద్ధ సంకల్ప బలమే పంక్తిముఖుని నేను పరాజితుణ్ణి చేయటానికి శక్తినిచ్చింది మేమంతా నీకృపచే రక్షణీయులం. ఇక్ష్వాకు విదేహభూపతుల బాంధవం లోకసమ్మదం, యశఃకారణం. నన్ను గ్రహింప వచ్చి బహుకాలమైంది. మీరులేక ప్రభుత్వం పౌరజనావన క్రియలు సమర్థవంతంగా సాగవు. నేను నాకంటే, నా సతీ సోదర మాతృమూర్తులకంటే ధర్మాన్నీ, ప్రజనూ ప్రేమిస్తాను, గౌరవిస్తాను. అవసరమైతే ఆత్మనే అర్పిస్తాను. ఎవరెంత కాలంవున్నా, తరగని సంపద తాతముత్తాతలు తరతరాలుగాఇచ్చారు. భరించలేకకాదు, బంధుప్రీతి తెలియక కాదు "సర్వస్యగాత్రస్య శిరః ప్రధానం" అన్నట్లు ప్రభువు సత్యధర్మ శీలాది సద్గుణాలకు ఆలవాలంగా వుండి పాలనం చేయాలని నాతలంపు. అన్ని మహనీయ లక్షణాలు ఆవాసం చేయగా, మానవ పతులు పొందని మహర్షిపదాన్ని పొందిన మీరు నాపై ప్రీతిచే స్వరాష్ట్రీయుల మరచిపోతున్నారని గుర్తు చేస్తున్నానే కాని అపార్థ కల్పన కిందు అవకాశమే లేదు. మీవెంట నాతమ్ముడు తగిన పారితోషికాలు కొనివస్తాడు. మీ అల్లుడాడిన పల్కులు అవజ్ఞతచేత కాదని భావించి ప్రీతిపూర్వకంగా మా దంపతులను, మా ఏలుబడిలోని వారం

దర్శి ఆశీర్వదించవలసిందిగా అర్థిస్తున్నాను" అని రాముడన్నాడు. అల్లుడు పల్కినపలుకులు విన్న జనకుడు సానందుడై, "రామచంద్రా! నీవిధేయతకు, స్వధర్మనిష్ఠకు ఎంతో తృప్తిపడ్డాను. ఈఅవకాశంకోసమే ఇన్నాళ్ళు వున్నాను. అవసరం గుర్తించక చేసే సహాయంకానీ, అడగకుండా చెప్పే హితంకానీవ్యర్థం అవుతై. నేను చెప్పదలచుకున్న మాటకిప్పుడు సమయంవచ్చింది. ప్రభువుకాని, యజమానికాని, అధికారికాని, పుండి చేయించే పనుల్లో నిగూఢంగా దండనభయం వుంటుంది. ఉన్నా లేకున్నా తమ ధర్మాన్ని తప్పకుండా పౌరులు ఆచరించటం ఐచ్ఛికంగావుండే బహుకాలం జాతిలో బ్రదుకుభద్రత కల్గిస్తుంది. రాజైనవాడు ఈ పరమరహస్యాన్ని పాటిస్తే యుగయుగాలుగా ఆ రాజు ప్రవర్తింపచేసిన సంఘవ్యవస్థ నడవడిక ప్రజలపై చెరగని ముద్ర వేస్తుంది. మనం శాశ్వతంకాము. మనం లోకానికి మంచి ఇస్తే, లోకం మనకు కీర్తి ఇస్తుంది. ఆ కీర్తి వున్నంతకాలం మనం ఇచ్చిన మంచి తరతరాలుగా జాతిని దిద్దితీర్చుతుంది. ఈ ధర్మసూక్ష్మం ఎందరికో తెలియదు. కొద్దిమందికి తెలిసినా నిప్పులబాటపై నడకవంటి దీనిని ఆచరించలేరు. ఈ విలక్షణ రహస్యం అర్థంచేసుకుని, ఆచరించి ఆచరణలోకి తెచ్చే సర్వలక్షణాలు నీలో వున్నై. నీకే ఈ కీర్తి దక్కుతుంది అందుకే నీకు ఉపదేశించాను. నీ రాజదండ గ్రహణంకోసమే, నీ ప్రత్యుత్థాన ప్రసంగం కోసమే ఇంతకాలం నిరీక్షించాను. నేను వచ్చిన కార్యంముగిసింది. నీకీర్తి సూర్యచంద్రాదులు వున్నంతకాలం నిలుస్తుంది. అమ్మా! సీతా! ఆడపిడ్డకు అనుకూలపతి లభించటమే అసమ. నా పూర్వపుణ్య విశేషంవల్ల నలుగురికీ అటువంటి భర్తలు లభించారు. దీర్ఘసుమంగళివై, సుపుత్రవతివై పతి నామంతో నీనామంచేరి సంసార సంతరణం కలిగించుగాక! రామా! నేను పోయివస్తాను. శుభం భూయాత్" అని ముగించాడు. తర్వాతరాముడు కేకయరాజుతో "పూజ్యుడా! నా నిమిత్తంవచ్చి పెక్కునాళ్ళైంది. రాష్ట్రంలో వృద్ధుడైన తండ్రి నీకోసం మొగమంతా కన్నులుగా చూస్తుంటాడు. మీరెప్పుడు ప్రయాణం సంకల్పిస్తారో ఆనాడే నారెండో తమ్ముడు సౌమిత్రి సర్వమర్యాదలతో మిమ్మల్ని పురిచేర్చివస్తాడు" అని మనవిచేశాడు. "రామా! నీ గుణాలకంటే రత్నాలు

విలువ ఎక్కువని భావించి ఇస్తావా? నాకు కావలసిన రత్నాలు మీ నలుగురు సోదరులే" అని సెలవుతీసుకున్నాడు.

## రావణయుద్ధంలో తోడవచ్చిన రాజుల రాముడు సత్కరించుట

ఆనాటికి సభసమాప్తమయింది. మరునాడు నిండు పేరోలగంలో రాముడు కాశీనగరాధీశుడు, ఆత్మమిత్రుడు అయిన ప్రతర్దనునిచూచి "మిత్రమా! నీయంతవాడు నా తమ్ముని మాట పాటించి చతురంగబలంతో వచ్చినందుకు ధన్యవాదాలు. నీ సైన్యానికి మేం రుణపడ్డాం. తోరణయుతమై, సుప్రాకారావృతమై, క్రమమై నీ పాలనలో వారణాసి వర్థిల్లుతున్నదికదా? మమ్మల్ని మరువక మా అల్పసత్కారాలంది వెళ్ళి వస్తావు కదా?" అని సింహాసనం దిగి వచ్చి బిగ్గ కౌగిలించుకున్నాడు. తదుపరి భరతుని ఆజ్ఞచే వచ్చిన మూడు వందలమంది రాజులనుచూచి, గద్దెదిగి నిల్చి "పరహితచింతాసక్తులైన భూపతులారా! మీరంతా స్వీయ తేజంచేతనే సుర క్షితులు. నిరంతర ధర్మనిష్ఠులు. నిత్య సత్యవచస్కులు, ప్రశస్తబాహుబల శౌర్యధుర్యులు. మీ అనుభావం చేతనే లోకకంటకుడైన రావణుని నేను సబాంధవంగా సంహరించాను. ఆ కార్యానికి ధర్మం తప్పక పాలిస్తున్న మీరే కారణం. నేను నిమిత్తం.నా భార్య సీత అడవిలో అపహృతయైనదన్న వార్త విని నా తమ్ముడు యుద్ధార్థం కబురు పెట్టగానే ససైన్యంగా, సపరివారంగా వచ్చి శత్రువెవరో తెలియక ఎంతోకాలం ఇక్కడ వున్నారు. భగవదను గ్రహంవల్ల శత్రు విజయం సాధించి క్షేమంగా చేరాను. ఇక మీరంతా స్వదే శాలకు వెళ్ళి రాజ్య రక్షణ, పౌర రక్షణ, ధర్మ రక్షణ నిర్వహించండి. మీ ప్రజలకు మీ రాకతో ఆనందం కలిగించండి. ఇప్పటివలెనే మాపట్ల సుహృ ద్భావం వుంచండి" అని అనేకామూల్యాభరణాలను, రత్నాలను కానుకలుగా ఇచ్చి గౌరవించాడు. పరిగ్రహణానంతరం ప్రభువులంతా ముదశ్రు లు నేత్రాలు నిండగా అంజలించి "రామప్రభూ! రాజులం మేంకాదయ్యా!ఆ శబ్దా నికి అధికారివి నీ వొక్కడివే. మమ్మల్ని పెద్దగా ప్రస్తుతించటం నీ సహజ గుణమే కాని మేం చేసిన ఘనకార్యం ఏముంది? స్వదేశంలోకంటే సుఖంగా

రాజభోగాలు అనుభవించాం. మా అదృష్టదేవత అనుకూలించి నీవంటి చల్లని ప్రభువును క్షేమంగా అడవులనుంచి రప్పించింది. పట్టభద్రునిగా చేసింది. దుష్ట రాక్షస సంహారం చేయించింది. అపహృతమైన సీతామాతను నీకు అర్పించింది. విజయలక్ష్మీ శోభితుడవై, స్రమాట్టువైన నిన్ను కన్నులార కాంచే భాగ్యం కలగచేసింది. మాకు పుణ్యం, అభీష్టం, ప్రీతి వేరే ఏమున్నై? నీవు బహుకాలం ఈవిధంగా రాజ్యపాలనం చేయటమే మాకు కావలిసింది. ఎంత ప్రశంసకైనా అర్హుడవు నీవు కాని మేం కాము. మమ్మల్ని ఎందుకు మెచ్చుకుంటున్నావు? నీకది నైజం. నీలాగా మేం పల్కలేం. మేం రాగాది వికారగుణ దూషితులం. నీ తృప్తికి ఈ బహుమతులు గ్రహించాం.మాసర్వం నీకోసం అర్పిస్తాం. మా కోరిక ఒకటి వుంది. మేం నీపట్ల హృదయాలను అంకితం చేశాము. నీవు మాపట్ల నీ హృదయంలో స్థానం కల్పించు. అదే మా కోరిక" అని రుద్ధకంఠంతో ప్రార్థించారు. రాముడు హర్ష వివశుడై "సుహృద్వరులారా! దాశరథులు గుణగ్రహణులనీ, కృతజ్ఞులనీ, సత్యసంధులనీ మీకు తెలుసుకదా? రాముడందుకు భిన్నుడు ఎన్నడూ కాడు. మీ అభీష్టానుసారం నేనేకాదు. నా సోదరులూ,నా బాంధవులు నడుచుకుంటారు" అని సెలవిచ్చాడు. నానా దేశరాజులు రాముని కీర్తిస్తూ స్వస్థానాలకు పోయారు.

## సకలరాజులు స్వరాష్ట్రాలకు పోవుట

భరతుని ఆజ్ఞచే అయోధ్యకు వచ్చిన అవనీపతులు తమ తమ ధ్వజినీ చయంతో, కరితురగ రథాదులతో అనేకాక్షౌహిణులు అవని ఆకంపించగా తోడ్కొని స్వదేశాలకు బయలు దేరారు. నగర ప్రాకారం దాటి సరయూనది సమీపించి వేర్వేరు దారులలో విడిపోయేముందు ఒకరితో ఒకరు "మిత్రులారా! భరతుడు మనల్ని యుద్ధానికి పిలిచాడుకదా? అదంతా వ్యర్థమైపోయింది. వచ్చామేకాని, రామ రావణ సంగ్రామంలో మనం పోరాడనేలేదు. తుదకు చూడనైనాలేదు. మన రామలక్ష్మణులే ఆకార్యం చక్కపెట్టారు. వారి సాయంతో సాగరందాటి లంక ప్రవేశించి ప్రత్యర్థుల ప్రాణాలు బలిగొనే అవకాశమే లేకుండాపోయింది. ఐనా ఇంతదూరం వచ్చినందుకు, ఇంతకాలం వున్నందుకు విజయరాఘవుల దర్శనం చేసుకున్నాం. ఎన్నో సత్కారాలు పొందాం. మరవలేనంత ఆయన

హృదయ సౌరభం కొనిపోతున్నాం. కాసంత శ్రమైనా లేకుండా అత్తవారింటి విందుభోజనాల్లాగా ఆరగించి, సమృద్ధంగా సత్కృతులుపొంది రామానుగ్రహ పాత్రులమై మరలిపోతున్న మనకంటే ధన్యులెవరు?" అని రాముని కీర్తిస్తూ ధనధాన్య సంచయపూర్ణమైన తమ రాజధానులకు పోయారు. స్యందనవాజి వారణమహార్ఘ మణిసముచయం, చందనలేపన సామగ్రి, స్వర్ణభూషణమౌక్తిక శ్రేణీ, సుందరులైన దాసదాసీ జనం, చిత్రవిచిత్రంగానేసిన కంబళ్లూ, ప్రవాళాలూ, వందలు వేలుగా తమ వెంటవచ్చిన రామసోదరులకు ఉపాయనంగా ఇచ్చి తమ కృతజ్ఞతలు తెలుపుకున్నారు. ప్రభువులిచ్చిన కానుకలుగ్రహించి భరత లక్ష్మణ శత్రుఘ్నులు పురిచేరవచ్చి రామవిభునకు సమర్పించి ఏ దేశాధీశుడు ఏమిచ్చాడో వివరించి చెప్పారు. ఆ సంపద అంతారామచంద్రుడు హస్తస్పర్శతో గ్రహించాడు.

## రాముడు రవిపుత్రాంగద హనుమదాదుల సత్కరించుట

భ్రాతలు తెచ్చి అర్పించిన బహుముఖోపదలనుంచి అనుపమానమూ, అనర్ఘమూ అయిన మేలిసొమ్ములు సుగ్రీవునకూ, విభీషణునకూ, వానర రాక్షసవీరులకూ తగినవిధంగా ఇచ్చి సత్కరించాడు. ఆ భూషణాలను అంతా ముందు శిరస్సుపైనుంచుకుని అనంతరం అలంకరించుకున్నారు. అంగదుని పిల్చి, సింహపీఠిదిగి ఆలింగనంచేసుకుని, హనుమసమీపానికి నడచివచ్చి గ్రుచ్చి కౌగిలించుకుని "మిత్రమా! సుగ్రీవా! ఈ అంగదుడు నీకుసుతుడు. ఈ హనుమ నీకు స్నేహితుడూ, సచివుడూ. వీరిద్దరూ నీ అనుబంధంచేత నాకాప్తులైనారు. వీరిని గౌరవించటం సామాన్యమైన విషయంకాదు. ఐనా నా ఆత్మలోకూర్చి నేనిచ్చే అల్పసత్కారం అందుకుని ఆనందించాలని కోరుతున్నాను" అని తన మేనిపైనున్న సర్వాభరణాలుతీసి ఈశ్వరుడు సర్వం భక్తులకిచ్చి దిగంబరుడయినట్లు స్వహస్తాలతో వారిని అలంకరించాడు. అమోఘంగా జరిగిన ఆ సంఘటన అందరి నేత్రాల్లో మెరపు మెరిసినట్లయింది. హనుమదంగదులు వినయ భారంతో, చిరుసిగ్గుతో శిరంవంచి రామపాదాలకు నమస్కరించారు. సభవారు హర్షధ్వానాలూ,

కరతాళ ధ్వానాలూ చేసి తమ ఆనందం వెల్లడించారు. ఆ పిమ్మట నల నీల పనస కేసరి గంధమాధన కుముద మైంద ద్వివిద దరీముఖ దధిముఖ సన్నాద జాంబవంతాది మహా కపిశ్రేష్ఠుల, వినుతవీర్యుల, విక్రమ శీలుర, పరివిహిత కార్యాచరణసక్తుల విలోకించి తీయని పలుకులతో "కపి నాథులారా! మీరు నాకు కేవలం మిత్రులు పూజ్యులు మాత్రమేకాదు. నా సోదరులూ, నా తనువూ, నా హృదయమంతటివారు. నాకోసం ఘోర రణంలో ప్రాణార్పణం చేశారు. నా సుకృత కర్మల ఫలితంగా మహేంద్రుడిచే పునర్జీవితులై, బ్రతికినంతకాలం నాకు శోకం లేకుండా చేశారు. మీరే లేకపోతే నాకు జయమూ లేదు. జానకీ లేదు. రాజ్యం లేదు. సోదరులు లేరు. చివరకు నేనూ లేను. ఇటువంటి మీకు ఏమిచ్చి తృప్తిపరచేది? ఏం ప్రతికృతిచేశానని తృప్తి పడేది? ఈ మన బాంధవ్యం కలలో కన్నట్టి భోగానుభవాలుగానే నిల్చిపోయింది. అయినా నాకొక్కటే తృప్తి. నా సహాయం కోరని సర్వ సమర్థులు మీరు. ఆ విధంగానే వుండాలని నా వాంఛ. మీకు కష్టం వస్తేనే కదా నేను తోడు పడాలి? ఆ కోరిక నాకుండటం పరమ నీచ స్వార్థం. మనం ఇప్పటి లాగే వుందాం. పరస్పరం ఆదరించుకుందాం. ఆనందం పొందుదాం. ఇంత మహా సౌభాగ్యానికి అధిపతియైన మిత్రుడు సుగ్రీవునిదే భాగ్యం. ఇప్పటి నా చేత మన పూర్వులు ఏర్పరచిన మర్యాద మాత్రమే. మిమ్మల్ని గౌరవిస్తున్నానంటే నన్ను నేనే గౌరవించుకోవటమే. నా అంతర్దృష్టిలో మీ నా భేదం లేదు. ఈ అల్ప పారితోషికాలంది ఆనందించాలని అభ్యర్థిస్తున్నాను" అని రాముడనగానే ఆ మహావీరులు బిలబిలమంటూ ఒక్కసారిగా "రామప్రభూ! అపచారం. అపచారం. మేం అంతటివాళ్ళం కాము. నీ విజయానికి నీవే కారణం. మేం నిమిత్తం. సర్వగుణ సంపన్నుడవైన నీ వెక్కడ? చంచలబుద్ధిగల వానరులం మేమెక్కడ? మాచే కొన్ని గొప్ప కార్యాలు జరిగినవంటే నీ నామ ప్రభావమే. నీ అనుగ్రహమే. గత కాలంలో సంగ్రామంలో పోరి చచ్చిన వాళ్ళు వీర స్వర్గం పొందారు కాని, మేం పునర్జీవితులమైనాం. అందుకు ఎవరు కారణం? నీవూ, నీ అపార వాత్సల్యమే కదా? మానవ వానర తారతమ్యం, ప్రభువూ, పరివారం అన్న అంతరం లేకుండా అభేద బుద్ధితో దర్శించటం ఒక్క భగవంతునికే చెల్లింది. రూపాంతరంలో నీకే చెల్లింది. నీవు మాకిచ్చేది

అల్పం అన్నావు. అది శాహ్యానికి నిజమే కాని, మా ప్రాణాలిచ్చావే? అవి అల్పమా? అనల్పమా? నీవు వున్నంతకాలం మేం వుండేట్లూ, మాలో నీ మూర్తి నిల్చి వుండేట్లూ, నీ మహా ప్రస్థానంలో మేమంతావుండేట్లూ అనుగ్రహించు. అంతకంటె నిన్నర్థించేకోరిక మాకింకేంలేదు" అని హర్షావరోధగాద్గద గళంతో రామ పాదారవిందాలపై పడ్డారు. ఆ సమయంలో వాళ్ళు వానరులో, దేవతలో, మహాభక్తశిఖామణులో అర్థంకాక సభవారంతా తన్మయత్వంలో మునిగారు. రాముడు అనురాగంకట్టలు తెగి పారగా ఒక్కొక్కరిని తనివితీర తన బాహువుల్లో బంధించి కరిగిపోయాడు. యథోచిత సత్కారాలు సమర్పించాడు. ఈ విధంగా రాముడు అందరినీ ఆనందపరిచాడు. వానర రాక్షసులు తేనెలూ ఫలాలు మాంసం ఆరగిస్తూ ఆ గమాసం అంతా గడిపారు. వనచర నిశాచర సోదరపరివార బంధువులతో వినోదిస్తూ, పాలనం సాగిస్తూండగా శిశిరం గడిచింది. చైత్రమాసంలో పట్టాభిషేకం పొంది ఫాల్గుణ మాసం వరకు అంతులేని ఆనందం మిత్రులతో అనుభవించిన రాముడు మిత్రులందరు కలసి వినోదిస్తున్న సమయంలో హఠాత్తుగా ఒక్కసారి లేచి నిల్చున్నాడు. కారణం తెలియక అందరూ కళ్ళప్పగించారు.

## రాముడు సుగ్రీవాదుల కిష్కింధకు పంపుట

"మిత్రమా! సుగ్రీవా! చెప్పలేక చెప్పుతున్నాను. అన్యథా భావించకు నీవికసురాసుర దుష్ప్రవేశమైన కిష్కింధా నిలయానికి సపరివారంగా వెళ్ళక తప్పదు. నీవిశ్లేషబాధ సహించక నాకూ తప్పదు. మన శరీరాలు రెండైనా ఆత్మ ఒక్కటే. వత్సరకాలం అరాజకంగా వున్న నగరాన్ని మంత్రియుక్తుడవై యథాస్థితికి సముద్ధరించు. శాత్రవశేషం లెకుండా చెయ్యి. అంగదుణ్ణి నీ అన్నవలె, నాకు మారుగా నితాంతాయత ప్రీతితో చూడు. మా హనుమను ఎలా చూడాలో నాకంటే నీకే ఎక్కువగా తెలుసు. నలనీలమైంద ద్వివిద గంధమాదన శతవలి గజగవాక్షగవయ ఋషభజాంబవంతుల, మామ సుషేణున్ని ప్రాణాధికంగా పాలించు. వీరంతా నీ ఆజ్ఞతో నాకై ప్రాణాలు పణంగాపెట్టి త్యాగమూర్తులకు ఆదర్శమయ్యారు. వీరి ఋణం ఈ జన్మకు తీర్చలేను. మీ అందరికి నా హృదయపూర్వకంగా వీడుకోలు చెపుతున్నాను.

## శ్రీరాముడు విభీషణుని లంకకు పంపుట

పూజ్యుడా! సుహృన్మణీ! ఎంతకాలం కలసివున్నా ఎప్పుడో ఒక ప్పుడు విడిపోయేవారమేకదా? ఉన్నకొలది కాలంలోనే ఉచితమూ, స్థిరమూ, యశస్కరమూ, ప్రజానందకారకమూ అయిన కార్యాలు చేయాలి. నీకై నీవారెంతో ఆతురతతో ఎదురుచూస్తుంటారు. భయంకర యుద్ధ కారణంగా పాడైపోయిన లంకానగరం మళ్ళీ మామూలు స్థితికి కొనిరా. నీ ప్రభుత నీ పెద్దన్న ధనేశుడు మెచ్చుకుంటాడు. చేయూతగా వుంటాడు. రాక్షసలోకం నీ పాలనలో అపార్థరహిత రక్షోలోకం అవుతుంది. ఏ రాజు అవినీతి పరుడు కాక, సామదానాలు రెండే ప్రధానంగాచేసి, బుద్ధిమంతుడై, వేదధర్మాన్ని విడువక పాలిస్తాడో ఆరాజు పాలించే రాజ్యంలోనే కాక ఆతడు అడుగుపెట్టిన చోట సిరిసంపదలు స్థిరంగావుంటై. మహాభక్తుడవు. సాధువర్తనుడవు. సమ దృష్టి కలవాడివి. నీకు విశేషించి హితబోధ పాటకు మించిన రాగం అవు తుంది. నీకు నేను చెప్పవలసింది ఒక్కటే వాక్యం. రామ రవిపుత్రుల విస్మరించ వద్దని. నీవు జన్మచేతనే సాత్త్వికుడవు. కర్మచేత సర్వసద్గుణ సంపత్తి సాధించావు. నిన్ను విశేషించి ప్రస్తుతించటం నీకిష్టంకాదని తెలుసు. గుణకీర్తనం ఎవడు చేయడో వాడు రసహీనమైన రాగం. గాలిలేని తోలుతిత్తి" అని అనుమతి యిచ్చాడు.

## శ్రీరాముడు హనుమకు వరాలిచ్చుట

అందరూ హర్షాశ్రువులు రాలుస్తూ కరతాళధ్వనులు చేశారు. హనుమ రామచంద్రుని మాటలు విని ఏమి అనుభూతిపొందాడో ఆయనకే తెలియాలి. మెల్లగా లేచి మోకాళ్ళను నేల కానించి రెంకుచేతులు ముకుళిత కమలాలుచేసి, "రామప్రభూ! నీ దివ్యమంగళ విగ్రహాన్ని చూస్తూ, నీ వాగమృతం గ్రోలుతూ తన్మయత్వం పొందివున్నాను. నా మనోభావాలు సరిగా నీకు వివరించలేకపోవచ్చు. సర్వజ్ఞుడవు నీవు సరిగా గ్రహించి అనుగ్రహించ గలవు. దేహానికి ప్రధానమైంది జీవుడు. తర్వాత ప్రధానేంద్రియం మనస్సు. అది ఎల్లప్పుడు చంచలం. అందులో మా జాతికి అతి చంచలం. నిరోధించే శక్తి నాకులేదు. అది సర్వకాల సర్వావస్థల్లో నీలో లీనమైయుండుగాక. అన

వరతం నీపై భక్తి చెలువారు గాక. నా మనస్సు అన్యధావ్యభిచరించకుండు గాక. నీ దివ్యగాథ ఈ విశాల విశ్వంలో ఎందాక నిలిచి స్తుతించబడుతుందో అందాక నా దేహంలో ప్రాణాలు నిలుచు గాక. అప్సరలు నీ చరిత్రఎప్పుడూ పాడుతుంటారు. అది వింటూ కలిగే ఉత్కంఠను నేను అనిలుడు మేఘాలను తోలినట్లు పాలద్రోలుదునుగాక. ఇదే నీ సేవకుడు నిన్ను యాచించే కోరిక. దాన్ని ప్రసాదించు" అని హనుమ అర్థిస్తుంటే రాముడు ఆనందం పట్టలేక సింహాసనం దిగివచ్చి గట్టిగా కౌగలించుకుని అనురాగం అవధులు మీరగా "పావనీ! నీవు కోరినట్లే జరుగగలదు. సంతృప్తిపొందు. నా గాథ మేదిని కలదాక నీవు కీర్తి, చిరాయువు లభింతుగాక. నీతోకూడి నా కీర్తి అంతకాలం ఉంటుంది. అవసరమే రాదు. వస్తే నా ప్రాణాలే నీవు చేసిన ఒక్కొక్క ఉపకారానికి పణం పెట్టుతాను. కాని నీకు ఆ దుస్థితి ఎన్నటికీ రాకుండు గాక" అని చంద్రాభం, అనుపమ వైడూర్యతరళం, అత్మగ్రీవం అయిన హారం తీసి హనుమ కంఠంలో వేశాడు. ప్రాలేయ బింబాన్ని (చంద్రుణ్ణి) మేరువు మౌళిని ధరించినట్లు ఆ మాలావిభూషితుడై పవన సుతుడు ప్రభతో ప్రకాశించాడు. ఆ దృశ్యం తిలకించిన అగచరులు "రామా! రామా!" అంటూ లేచి లేచి భజనలు చేస్తూ ఎక్కడివారక్కడ సాష్టాంగపడ్డారు. సుగ్రీవుడూ, విభీషణుడూ రాముని విడిచి పోలేక బాలకులవలె రోదించారు. "ఈ మేర్గు సమధీరుణ్ణి, ఈ వినయ సంపన్నుని, ఈ సర్వ సుగుణాలవాలుని ఈ విశ్వం భర, తేజంతో తాను వెలిగేందుకు చిరకాలం పతిగా స్వీకరించుగాక" అని అంటూ పోలేక పోలేక పోయారు. వృషాట నిశాటవరులు కుడ్యంపై గీచిన బొమ్మలవలె స్మృతిలేకుండా వెంట నడిచారు. వారు రామచంద్రుని వదలి వెళ్ళుతుంటే దేహి దేహాన్ని పాసిన తెరవు తోచింది. రాముని అయోధ్యా ప్రవేశంనుంచి నేటివరకు సంవత్సరకాలం కలసి అన్యోన్య ప్రాణంగా వున్న వారు పోతుంటే ఆప్తబంధువులు విడిచిపోయేవేళ గృహస్థులు పొందే బాధను అయోధ్యావాసులు అనుభవించారు.

## ధనేశుడు పుష్పకాన్ని దాశరథి వద్దకు పంపుట

జన సముద్రంగావున్న అయోధ్య వచ్చిన వారు వెళ్ళిపోవటంతో కొంత తెరిపి ఇచ్చింది.అపరాహ్ణం కావచ్చింది. సభ ముగించపోతున్నరాముడు

ధ్వని విని తలెత్తి చూచాను. పుష్పకం!! అందులోనుంచి "రామచంద్రా! నావంక చూడు. నన్ను గుర్తించే వుంటావు. నేను రావణుడు సంచరించే పుష్పక విమానాన్ని. ఆనాడు నీ ఆజ్ఞతో కుబేరుని సేవించపోయాను. ఆయన నీ చేతకు సంప్రీతుడైనాడు. నీతో ఆయన చెప్పమన్న మాటలు చెపుతున్నాను. "రామా! నీవు లోకకంటకుడైన దానవేంద్రుని సబాంధవంగా సమరంలో చంపి విశ్వశాంతి కలిగించావు. అందుకు నేనెంతో ఆనందించాను. ఆ కారణాన్ని పురస్కరించుకుని ఏదో ఘనకార్యంగా భావించి పుష్పక విమానాన్ని నీవద్దకు తిరిగి పంపలేదు. నన్ను నిర్జించి నా తమ్ముడు దీన్ని గ్రహించాడు. అతని నీవు నిర్జించావు. అందుచే ఇది నీ సొత్తు. నీవు మహానుభావుడవు కనుక మళ్ళీ నాకు పంపావు. అయినా దీనిపై నాకు స్వత్వం లేదు. నేను దేవజాతికి చెందినవాణ్ని. ధర్మప్రకారం సంచరించాలె. అదికాక ఈ విమానంతో ఇప్పుడు నాకు పని లేదు. నీవు భూలోకం అంతా తిరిగి ధర్మస్థాపన చేయవలసిన వాడవు. నీకు ఎంతో అవసరం. అందుకని నీ వద్దకే పంపుతున్నాను" అని. నేను ఆత్మ ప్రభావంతో అగోచరంగా వుంటాను. నీ ఆజ్ఞ ఏమిటో సెలవిస్తే ఆవిధంగా చేస్తాను" అని చెప్పింది. "ఓ అపూర్వ విమాన రాజమా! నీ వాక్కులు విన్నాను. యక్షేశుని సందేశం విన్నాను. ఆయన ధర్మగుణాన్ని శ్లాఘిస్తున్నాను నీకు స్వాగతం ఇస్తున్నాను. నేనిక్కడ చేసే అర్చనలన్నీ నీవు అక్కడ వుండే గ్రహించి అనుగ్రహించు" మని పల్కి వేదోక్తంగా పూలతోనూ, తేనెలతోనూ, లాజలతోనూ పూజించాడు. పిమ్మట "ఓ వ్యోమయానమా! నీవు నాయందు చూపిన గౌరవాభిమానాలకు ధన్యవాదాలు చేస్తున్నాను. నేను అవసరం అనుకున్నవేళ నీ రాకను కోరుతాను. అప్పుడు వచ్చి నా కార్యం నెరవేర్చు. అంతవరకు నీవు ఆకాశపథంలో స్వేచ్ఛగా సంచరించు. నాకూ ఇప్పుడు అవసరం లేదు. నేను భూపర్యటనం చేసి ధర్మ సంస్థాపన చేయవలసిన బృహత్కార్యం మా తాతతండ్రులు నాకు మిగల్చలేదు. భారత వర్షం సుభిక్షంగా వుంది. శాంతి సౌభాగ్యాలతో తులతూగుతూ వుంది. నిన్ను ధనేశుడు తిరిగి పంపినందుకు అభినందిస్తూ, నా మాటను మన్నించిన నిన్ను ప్రశంసిస్తూ వీడ్కోలు చెపుతున్నాను" అని రాముడనగానే విమానం అదృశ్యమైంది.

## భరతుడు రామునకు ప్రజల సుస్థితి తెలుపుట

అపూర్వ శక్తిమంతమైన విమానం అంతర్హితం కాగానే భరతుడు లేచి అన్నకు నమస్కరించాడు. "అగ్రజా! దాశరథిగా రూపొందిన దేవుడవే నీవు. నీవు పట్టాభిషిక్తుడవైన ఒక నెలలోనే అయోధ్యానగరం అంతా మారిపోయింది. ప్రజలంతా వీత రోగులైనారు. సిరిసంపదలు క్రమకుమించి చేకూరుతున్నై. పౌరులంతా అమానుష శక్తిగలవారివలే నిర్భయంగా మాట్లాడుతున్నారు. పూర్వవార్ధకంచేత జీర్ణమైన శరీరం కల వృద్ధులు సయితం మరణభీతి లేకుండా మసలుతున్నారు. సంసారిణులు ప్రసూతి సమయంలో కలిగే బాధలు లేకుండా సుఖంగా నీళ్ళాడుతున్నారు. యువకులు జవసత్త్వాలతో నిండి వున్నారు. రాష్ట్రి గ్రామ జనపదాలు, పల్లెలు అకాలమృత్యుభయంగానీ, అన్నోదకావాస భీతిగానీ లేని ప్రజలతో నిండివున్నై. వారివదనాలెప్పుడు వికసితమల్లికా ప్రసూనాలవలె స్వచ్ఛంగా, ఆకర్షణీయంగావున్నై. వానలుకాలానుకూలంగా వర్షించిసస్యాన్నీ, ఓషధులనూ సమృద్ధంగా లభించునట్లు చేస్తున్నై. వాయువు ఎల్లవేళలా సుఖదాయంగావీస్తున్నై. ఎక్కడవిన్నా "రాముడే ప్రభువు. మారాజ్యం రామరాజ్యం. మా రామయ్య, తండ్రి వలె కలకాలం మమ్మల్ని పాలించాలి. మేమంతా సుఖించాలి" అన్నమాటలే వినిపిస్తున్నై. ఇంత అల్పకాలంలో ఇంత జనరంజకంగా ఏలుబడిదిద్ది తీర్చినవారు మన పూర్వుల్లో కూడా అరుదేమో" అని తాను స్వయంగా జనకుని పంపి వచ్చేటప్పుడు కన్నవిన్న విషయం అన్నకు చెప్పాడు. అందుకు "రాముడు భరతునకు అన్నకావటమే కారణం. ఇప్పుడు నీవు చెప్పిందంతా నీపాలనలోనే కలిగింది. అయితే అప్పుడుదీక్షలో వుండటంచేత, ప్రజలుమాక్షేమంతెలియక బాధలో వుండటంచేత నీవు గుర్తించలేదు. అప్పటికీ ఇప్పటికీ వచ్చిన భేదం ఒక్కటే. మేం క్షేమంగా తిరిగి వచ్చామన్న సంతోషం ప్రజల వదనాల్లో ప్రస్ఫుటం కావటం" అని చెప్పి ఆనాటికి సభ చాలించాడు.

## శ్రీరాముడు సీతతో అశోకవనంలో విహరించుట

క్రమక్రమంగా రామచంద్రునకు కార్యభారం తగ్గింది. ఇతర దేశ ప్రభువులు వెళ్ళిపోయారు. మిత్రులు తమ తమ నెలవులు చేరుకున్నారు. మంత్రులు మంత్రాంగం తీర్చగా, తమ్ములు పర్యవేక్షణ చేయగా పాలన సాఫీగా సాగిపోతూంది. రాను రాను రాముడు చేయవలసిన కార్యం దిన దినం

మర్యాద తప్పక సభకు రావటం మిగిలింది. అభియోగాలు లేవు. కరువు
కాటకాలులేవు. అసంతృప్తి లేదు. ఆశ్రమ ధర్మాలకు విచ్ఛిత్తిలేదు. సామంత
రాజులు, స్వతంత్ర ప్రభువులు అయోధ్యాసింహాసనాన్ని అతిక్రమించటం
చేయటంలేదు. అది వసంతం. సమస్తవికసిత కుసుమసౌరభ సమా
క్రాంత దిగంతం. ప్రవర్థిత మనోజభావ శోభావంతం. సీతారామ విలాస
వినోదక్రీడా విశ్రాంతి మంతం. మందారపు నాగచందనమాతమహాక
పనసకాలేయకపారిజాత చంపక దాడిమజంబూ ప్రియంగునీపార్జున సప్త
పర్ణాతిముక్తతుంగక కదళికా నాగకదంబాది వృక్షాలు సర్వధా ఫలపుష్ప
సమాతతాలైనై. శిల్పికల్పిత జలయంత్రాలు నీరు చిమ్ముతున్నై.
మత్తహిందోళరాగమానితాలూ, భృంగరాజవన
ప్రియకేకీ మరాళాది వివిధ హృద్యపక్షి మనోజ్ఞాలూ, సువర్ణహేతిమేచకాం
జననిభనగమేదురాలూ, బహుళవర్ణ సూనరంజిత కృత్రిమకాసారాలూ,
మంజుల మాణిక్యమయ సోపాన స్ఫటికశిలా వితర్దికలూ, సారసమరాళ బకాది
విహంగకుల మిథున సల్లాపిత మధుర నినదముఖరిత సమీప ప్రదేశాలూ,
అనేక రూపాలుకల ప్రాకారాలూ, విశాలంగా పరచిన నునుచాప రాళ్లూ,
వైడూర్య మణిసన్నిభాలైన పచ్చికబయళ్లూ, ఆకాశంపై వెలిగే చుక్కల్లాగా
రాళ్ళపై రాలిన పూలూ, కలిగి నందనమో, బ్రహ్మమందిరమో, చైత్ర
రథమో అన్నట్లు చెలువుమీరి, కుసుమాసనాలు, పూపొదరిండ్లతో కులుకులు
ఒలకపోస్తున్న అశోకవనంలోరాముడు సీత కేలుకీలించి ఇంద్రుడుఇంద్రాణితో
వలె ప్రవేశించాడు. ప్రేమతో సీతకు మధుమైరేయాన్ని కాచపాత్రతో
త్రాగించాడు. పనివాళ్ళు కొనితెచ్చిన ఫలాలూ, రుచిరమైన ఆమిష విభే
దాలూ లఘువుగా తాను గ్రహించి సీత కందిచ్చాడు. అనంతరం దంపతుల
ఆనందంకోసం నృత్యగీతాలు ప్రవర్తిల్లినై. అభినయించి పాడిన మనోభిరామ
లైన రామలకు తృప్తిగా బహూకృతులిచ్చాడు. తృప్తిగా వన విహారంచేసి
దయతో పరివారాన్ని పంపి అంతఃపురం అలంకరించాడు. ఈ విధంగా
అమర మిథునం పొందిన ఆనందాన్ని అనుభవిస్తూండగా శిశిరకాలం చెల్లింది.
ఒక శిశిరంకాదు, దశసహస్ర శిశిరాలు ఆ దంపతులు అన్యోన్యానురాగబద్ధులై
ఐహికాముష్మిక కార్యాలుచేస్తూ గడిపారు. "ప్రభువు కేవలం భోగలాలసుడు

కాదనీ, సోమరికాదనీ, ప్రజాహిత చింతనమే పరమార్థంగా భావించేవాడనీ, పౌరులేకాక, జానపదులేకాక, పల్లీయులు, కిరాతులు, ఆటవికులుకూడ తలచేలా క్రమబద్ధంగా, కాలనియమం పాటిస్తూ, దినపూర్వభాగం ధర్మకార్యాలు నడిపి, అపరభాగం అంతిపురిలో సద్గోష్ఠులతో, శాస్త్ర చర్చలతో, కథా శ్రవణంతో గడుపుతుండే, ఉర్వీజాత సీత పూర్వాహ్ణిక కార్యాలూ, సుపర్వార్చనలూ, దానధర్మాలు తీరుస్తూ, ముగురత్తల పూజిస్తూ, పరిచారికలతో పనిగొంటూ, అపరాహ్ణం చిత్రాభరణాంబరయై, వ్యాత్తహరు చేరవచ్చే ఇంద్రాణివలె వచ్చి పతి సేవాభాగ్యం పంచుకొనేది. కోర్కెలు పండే అవకాశాల్లో మానవులు గానీ, మహర్షులు, దేవతలుగానీ గతించిపోతున్న కాలగమనం గమనించరు. ఆ పొంగుతున్న యౌవన దశలో సీతారామ దంపతులు అశోకవనం విహారార్థం ప్రవేశించారు. సీత కేలు శ్రీరాముడు తాల్చి ఇంద్రాణితో వజ్రి నందనంలో విహరించినట్లు కొంతకాలం విహరించారు. అనంతరం కమ్మతావుల వెదజల్లే పొదరింటిలో నిర్మించిన చంద్రకాంత శిలావేదికపై ఆసీనులైనారు. పరిచారికలు మధురమైన మైరేయ పానీయాలు సమకూర్చారు. వాటిని ఉచిత రీతిని సేవించి రాముడు సీతను చూచి చిన్నగా నవ్వాడు. జానకి అర్థంకాక సిగ్గుపడింది. వంచిన మోమును పైకెత్తి "దేవీ! ఎందుకు సిగ్గుపడుతున్నావు? నీలో దిన దినం మార్పు పొందుతున్న శరీర సౌభాగ్యం నాకెంతో ప్రీతి పాత్రంగావుంది. ఆ ప్రీతికి బాహ్యచిహ్నమే ఇప్పటి నానవ్వు"అనిఅన్నాడు. వెంటనే మైథిలి అర్థం చేసుకుంది. రాముని బాహు పంజరంలో తల దాచుకుని "స్వామీ! నీవు మిక్కిలి చతురుడవు. సరసుడవు. నేను అబలను. అమాయకురాలను. నీ సంభాషణలోని నిగూఢార్థాలు బ్రహ్మేంద్రాదులకే తెలియవు. నీ భావాంబర వీథిలో దర్శిస్తున్న సీతలోనా? లేక నీ ముందున్న సీతలోనా నీవు ప్రీతి పడుతున్న లక్షణాలున్నై?" అని అన్నది. "దేవీ! నాకు బాహ్యాభ్యంతరాలు ద్వివిధంగా వుండటం ఎన్నడైనా చూచావా? నిజంగా నీలో మార్పు వచ్చింది. సూక్ష్మంగా చూస్తే సుతలాభ చిహ్నాలు స్పష్టంగా గోచరిస్తున్నై. నా ఊహ నిజమైతే నేనెంత ధన్యుణ్ని" అని రాముడు ఆసక్తితో అడిగాడు. ఆ మాటలకు సీత కన్నుల్లో ఒక మనోహర నూత్న కాంతి తొణికిసలాడింది. పుష్పభారంచేత కొంచెం వంగిన తామరతూడువలె కంఠభాగం కొంచెం వంగి పతివిశాల వక్షంపై ఆనింది. మౌనం అర్ధాంగీకార

మైతే ఆమె ప్రకటించిన విన్యాసం తక్కిన సగం పూర్తి చేసింది. "దేవీ! అనతికాలంలో రఘువంశం సముద్ధరించబోతున్న నీకు నేను మనఃపూర్వకంగా వాగ్దత్తం చేస్తున్నాను. నీవు నిస్సంకోచంగా కోరుకో. అది ఎట్టిదైనా తీరుస్తాను" అని ఎంతో ప్రేమతో బుజ్జగిస్తూ, చెక్కిలి నిమురుతూ, కదలిపోతున్న పెదవుల చుంబించాడు.సీత నను సిగ్గు దొంతర సడలించి"స్వామీ! నీకంటే నాకు కోరదగిన కోరిక ఏముంది? గర్భస్థ శిశు భావిక్షేమం కోసం గంగా తీరంలో వున్న ఆశ్రమ తపస్వులను పూజించి ఒక్కరేయి అక్కడ గడిపి ఆశీర్వాదాలు పొంది వస్తాను" అని కోరింది. "దేవీ! నీకోరిక యోగ్యమైంది. రేపు ఉదయం నీ ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు చేస్తాను" అని సంతోషపరచి రాముడు సతితో నిజమందిరం ప్రవేశించాడు. దరుపరి మధ్యకక్ష్యాంతరంలోకి వచ్చాడు. మంత్రులు ప్రభువు రాకకు వేచి వున్నారు. రాముడు రాగానే లేచి నమస్కరించి అనుమతిపై తమ తమ ఆసనాలపై ఆసీనులైనారు.

## శ్రీరాముడు భద్రుని లోకవార్త లడుగుట

ఉల్లాసంతో, ఉత్సాహంతో అందరి వదనాలు ఆనందలక్ష్మి మందిరాల వలె వెలిగి పోతున్నై. ఆ సమయంలో విచిత్ర వేషధారణలతో, వివిధరూపాలతో హాస్యకారులు రంగస్థల ప్రవేశంచేసి, చేష్టలతో, భాషణలతో సభ్యుల కడుపుబ్బ నవ్వించారు. వారి నటనా చమత్కార భాషణాలకు రాముడు సంతోషించాడు. భరతునివంక చూచాడు. వెంటనే భ ర తు డు విజయకుట కాశ్యప మధుమత్త కాశియ మాగధ భద్రదంత వక్త్రి సురాజపింగళులకు పారితోషికాలు పంచి పెట్టాడు.కథాంతంలో భద్రుణ్ణిమాచి రాముడు "భద్రా! మీరు దేశం నలుమూలల మారువేషాలతో సంచరిస్తూ ప్రజాభిప్రాయంతెలుసుకుంటుంటారుకదా? అక్కడ ప్రజలు సీతాలక్ష్మణ భరత శత్రుఘ్నులను, కైకేయినికూర్చి ఏమనుకుంటున్నారు? ఏ ప్రభువు చా ర ము ఖ ం గా ప్రజానీకంలోని లోటుపాట్లుతెలిసి చక్కగా దిద్ది తీర్చలేడో వాని రాజ్యం వాని వశంలో బహుకాలం నిలువదు. ఎప్పటికప్పుడు ప్రజలను బిడ్డలవిధాన ప్రేమించి పాలించినవాడు రాజశబ్దానికి అర్హుడవుతాడు. కేవలం ప్రజలక్షేమం చూచినంతమాత్రాన ప్రభువుకు మంచిపేరు రాదు. రాజకుటుంబంపట్ల ప్రజల

భావాలెలావుంటాయో గ్రహించి వాటికి అనుకూలంగా ఆ కుటుంబాన్ని సవరించుకోవాలి. అప్పుడే ప్రభువు నిజమైన ప్రభువుగా పేరెన్నిక కాంచుతాడు. అందుకు భిన్నంగా నడిస్తే జననిందకు పాత్రమవుతాడు. కనుక నీ పర్యటనలోని విశేషాలు వివరించు"మని అన్నాడు. భద్రుడు లేచి ప్రాంజలియై, "ప్రభూ! పట్టణంలోనేకాక పల్లెల్లోనూ, జనపదాల్లోనూ, నీ అద్భుత గాథలు అనేకవిధాలుగా చెప్పుకుంటున్నారు బాలకులు రామరావణ యుద్ధం వేషధారణలో ప్రదర్శిస్తుంటే జనులు తండోపతండగా వచ్చి చూచి ఆనందిస్తున్నారు" అనిచెప్పి ఆపేశాడు. రాముడు "భద్రా! నేను నిన్ను అడిగింది నన్నుగూర్చి కాదే? నా తమ్ములకూర్చి, నా పినతల్లినికూర్చి, నాదేవినికూర్చి కదా? ఆ విషయాలను వదలి నా గాథ చెపుతావెందుకు? ఉన్నది వున్నట్టు, విన్నది విన్నట్టు దాచక, మభ్యపెట్టక చెప్పు. ఎంత మంచివాళ్ళయినా మానవులలో దోషాలులేకుండా వుండవు. అవి వున్నవాళ్ళకంటే బయటివాళ్ళకే ఎక్కువ తెలుస్తై. అవి తెలుసుకుని దోషాలు పరిహరించి మేలుకూర్చటానికి అవకాశం ప్రభువులకుంటుంది. నీవు చెప్పేది లోకులాడుకునే విషయంకాని, నీ స్వాభిప్రాయంకాదుకదా? ప్రభువుల మంచిచెడ్డలు మీ మీద ఆధారపడి వున్నై. మీరుచెప్పిన దోషాలు ఎవడు దిద్దుకోడో వాడు ప్రజాదరణకు దూరమై తుదకు పదభ్రష్టుడవుతాడు. భయపడకుండా చెప్పు"మని నిర్దేశించాడు.

## భద్రుడు శ్రీరామునకు సీతావిషయకమైన నిందలు చెప్పుట

భద్రుడు భయంతో లేచి "ప్రభూ! నేనేమీ దాచలేదు. చెప్పిందంతా నిజం. తోటల్లో, పేటల్లో, బాటల్లో, అంగళ్ళలో, శాలల్లో, గృహాల్లో "అహో! రామచంద్రుని పరమాద్భుత శౌర్యం! ఎంత వర్ణించినాతృప్తితీరదు. దేవదానవులకు అసాధ్యమైన సేతువునిర్మించి కపులతో సముద్రం దాటాడు. ససైన్యంగా రావణుని సమరరంగంలో సంహరించాడు. అపార వానర సైన్యాన్ని వశంచేసుకున్నాడు. భల్లూక సంతానాన్ని పాలించాడు. రాక్షస కోటులకు నాయకుడైనాడు. ఎంతపనిచేస్తే ఏం? ఎంతవాడయితేనేం? దు

జాడు కొనిపోయిన తన సతిని మళ్ళీ గ్రహించాడు. ఆదేమీ ఆలోచించ కుండా ఇంటికి తెచ్చాడు. ఛి ఛీ! కొంచెమైనా గర్హించక ఆమెతో కాపురం చేస్తున్నాడు. పాపం! ఏం సౌఖ్యం ఆశించాడో ఆయనకే తెలియాలి. తామసుడూ, కాముకుడూ, దుష్టుడూ అయిన రావణుని ఇంట్లో బహుకాలం చెరపెట్టబడిన సీతను రాముడు రోత అనుకోకుండా తెచ్చుకుని కాపురం చేస్తు న్నాడు. కాములకు కళ్ళుండవన్నమాట అక్షరాల నిజం. రాజానుమతం ధర్మం. రాజు చేసిన పని ప్రజలకు ఆదర్శం. ఇకముందు ఆత్మ సతీజన చర్యలు ఎట్టివైనా సహించి తీరవలసిందే" అని ఎవరికి తోచిన విధంగావారు అన్నిచోట్లా అనుకుంటున్నారు. ప్రభూ! నన్ను క్షమించండి. ఇందులో నా దోషం ఏమీ లేదు" అని అంటూ పాదాలపైన పడ్డాడు. రాముడు లేవతీసి "భద్రా! ఇందులో నీ తప్పేం లేదు. విన్నది చెప్పావు. అది అయినా నేను బలవంతం చేస్తేనే చెప్పావు. నీవు భయంమాని స్వస్థుడవుగా! పూజ్యులారా! విన్నారుకదా భద్రుని వాక్యాలు? మీరు కూడా ఈ అపవాదు విని వుంటారను కుంటాను. దాచకుండా సత్యం చెప్పండి"అని బడబానలం దాగిన పారావారం వలె గంభీరుడై, దైన్య భావం తోచీతోచకుండా వుండేలాగున అడిగాడు. అక్కడి వారందరూ వినత శిరస్కులై "ప్రభూ! భద్రుడు చెప్పిందంతా వాస్తవమే" అని సమాధానం చెప్పారు. విచారభర డోలాందోళిత చిత్తుడై రాముడు సభవారిని వీడ్కొలిపాడు. అప్పటి రాముని హృదయం ఊకలో పడిన అగ్నిమంటలేకుండా దహించి బూడిద చేసినట్లు కనిపించని గాయాలతో నిండిపోయింది.

## శ్రీరాముడు సోదరుల పిలిపించుట

సూక్ష్మగ్రాహులూ, దూరదర్శులూ అయిన మంత్రి పురోహిత బంధుమిత్రులు ప్రళయాన్ని శంకిస్తూ భారంగా బాధతో పోగానే, రాముడు ద్వారపాలకుని పిల్చాడు. "ఓయీ! నీవు భరత లక్ష్మణ శత్రుఘ్నుల ను ఆలస్యం చేయకుండా తీసుకునిరా" అని చెప్పాడు. ఆజ్ఞనందిన కావలివాడు ముందు లక్ష్మణుని గృహంచేరి రామచంద్రుని ఆజ్ఞ తెలిపి ఆయన తేరుపై పోగానే భరత సదనానికి పోయాడు. భటునిచే వార్త విన్న భరతుడు పాద చారియై రామ సన్నిధికి చేరాడు. అనంతరం ద్వారపాలకుడు శత్రుఘ్నుని

దర్శించి వచ్చిన కార్యం వివరించాడు. ఆ క్షణమే అన్న సన్నిధికి ఆతడు కదలి వెళ్ళాడు. తనకు అప్పగించిన కార్యం తీర్చి భటుడు ప్రభువుని దర్శించి సోదరులరాక ఎరిగించాడు. తమ్ములువచ్చిన వార్త విని రాముడు భయంకర సీతాపవాదానల దందహ్యమాన మానసంతో అవాఙ్ముఖుడై "ప్రతీహారీ! వారిని లోపల ప్రవేశ పెట్టు. ఇక ఈ లోకంలో వారే నా ప్రాణ వాయువులు" అనగానే ఆ కార్యం వాడు నెరవేర్చాడు. మూర్తీభవించిన త్రేతాగ్నులవలె సోదరులు ముకుళీకృత హస్త పద్మలై లోన ప్రవేశించి, ఉపరాగ సంకలిత చంద్రుడో, అస్తమయభానుడో అన్నట్లు కాంతి మాసి, కన్నుల్లో నీరు నిండగా, హతశోభమైన అరవిందంవలె వున్న అన్నవదనం తిలకించి, గుండెలు జార, తడి ఆరి నోటమాటరాక చిత్ర ప్రతిమలై చరణాలపై వ్రాలారు. శోకాన్ని మ్రింగుకుంటూ వంగి సోదరుల పైకెత్తాడు. ఆపుకున్నా ఆగని కన్నీరు వారి శిరస్సుల తడిపింది. అందరినీ భారంగా ఆలింగనంచేసుకుని ఆసనాలనుచూపాడు. వారు ఉపవిష్టులుకాగానే "తమ్ములారా! లోకంలో ఏకగర్భజులు ఎందరో వున్నారు. వారిలో యోగ్యులుకూడా వున్నారు. అయినా వారు మీసాటికారు. సహోదర శబ్దం సరిగా మీకే అన్వయిస్తుంది. నా ప్రాణం, మానం మీరు. నా ఐశ్వర్యం, నా సర్వస్వం మీరు. మీచే రక్షింపబడుతున్న రాజ్యానికి నేను నామమాత్రంగా రాజును. ఇది పొగడికకాదు. అత్యుక్తికాదు. అసత్యంకాదు. ఇంతమాత్రమేకాక, మీరు కృతశాస్త్రార్థులు. ధీరులు. మతినిష్ఠితులు. మీకొక విషయం చెప్పబోతున్నా. ఈ కార్యం నాది. నాకై మీరు కాదనకుండా చేయాలి" అని అంటుంచే, సోదరుల ప్రాణాలు స్వస్థానాలను తప్పుతున్నై. "రానోయే కీడు సూచించే ప్రకృతి దుర్నిమిత్తాలవలె అన్న చెప్పే మాటలు వున్నై, ఏం వినరాని కనరాని, కనివిని సహించరానిదేదో అన్న చెప్ప బోతున్నాడు. అందుకే ముందు మన వాగ్బంధనం చేశాడు. భగవంతుడా! అన్నిటికీ నీవేవున్నావు. నీ ఆటలో మేం పావులం" అన్నభావం అక్షరభేదం లేకుండ ఆ సోదరులలో తోచింది. ఆవనతవదనులై, ఉద్వేగమంతులై, అవధానంతో, దుర్దినంవలె, మౌనంతో వున్నారు. రాముడు చెప్పసాగాడు.

# శ్రీరాముడు సోదరులకు లోకాపవాదం తెలుపుట

"అనుజన్ములారా! ఏకాగ్రతతో సావధానులై నే చెప్పేది వినండి. మనపురం మాత్రమేకాదు జానపదులంతా పెద్దపెట్టుగా మీ వదిన శీలాన్ని కూర్చి వినరానివి, కుత్సితమైనవి, నేను నానోట పల్కరానివి ఎన్నో నిందావాక్యాలు ప్రబలినై. గూఢచారులు వార్తలు తెచ్చారు. లోకంలో ప్రసిద్ధికెక్కిన వంశం ఇక్ష్వాకులది. పూర్వ పుణ్యఫలితంగా ఆ వంశంలో పుట్టాను. సీత, పరమపావనుడు, మహాత్ముడు, రాజర్షి జనకుని వంశంలో జన్మించింది. తండ్రియాజ్ఞ పాలించే నిమిత్తం దండకలో సంచరించటం, దైత్యుడు సీతను అపహరించటం, నేను అతని హతమార్చటం మీకు తెలిసిన విషయమే. సీతా పరిగ్రహణ సమయంలో బహుకాలం పరుని ఇంట వాసంచేసిన సతిని స్వీకరించటం భావ్యంకాదని నిగ్రహిస్తే, దానికి ప్రత్యామ్నాయంగా మీ వదిన అగ్నిప్రవేశం చేసింది. అగ్ని, దేవతలు "సీత పతివ్రత. సాధ్వులకు సయితం పూజింప అర్హురాలు. శంకవద్ద"ని చెప్పటం సౌమిత్రి విన్నాడు. స్వయంగా దేవతాపతి జానకిని తెచ్చి నాకప్పగించాడు. ఇంతేకాదు. దోషమెరుగని నా అంతరాత్మకూడ సీత శుచివతి పవిత్రమైనదని చెప్పింది. ఇట్టి బలవత్తర కారణాలెన్నో వుండబట్టే మీ వదినను అయోధ్యకు తెచ్చాను. నేను సందేహిస్తూనే వున్నాను. అందుకే భద్రుణ్ణి నొక్కినొక్కి అడిగాను. వాడు చెప్పలేక చెప్పాడు. మంత్రులు, మిత్రులుకూడా నిజమనే చెప్పారు. అప్పటినుంచీ అపవాదబాధ దుస్సహంగా వుంది. ఎవని అపకీర్తి లోకంలో ఎంతకాలం ప్రజాముఖంగా వినబడుతుంటుందో అంతకాలం వాడు పాపఫలం భుజిస్తూ అధోలోకాల్లో వుంటాడు. దేవతలు కీర్తిని గౌరవిస్తారు. అపకీర్తిని తెగడుతారు. అందుకే బుద్ధిమంతులు బహునంతకాలం మంచికార్యాలు చేస్తుంటారు. పరిశుద్ధ యశస్సంపాదనార్థం మిమ్మల్ని విడిచిపెడతాను. నా ప్రాణాన్నైనా విడుస్తాను. ఇక అపవాద రూపంగా వచ్చిన అకీర్తికోసం సీతను పరిత్యజించటం పెద్ద విషయం ఏమీకాదు. మన వంశం ప్రవర్తిల్లిననాటినుంచి మన పెద్దలెవ్వరు పొందని ఇట్టి అపవాదానికి ఎలా పట్టయితినో మీరే విచారించండి. ఇటువంటి మరణబాధ నేనెన్నడూ పొందలేదు. మానవుడు బుద్ధి

బలంతో ఎంత జాగ్రత్త వహించినా, విధిచెయిదాన్ని గుర్తించలేదు. దైవాను కూలత వున్నంతవరకే మానవుడు ప్రజ్ఞావంతుడు.

## శ్రీరాముడు సీతను వాల్మీకి ఆశ్రమం పొంత విడిచిరమ్మని లక్ష్మణునికి చెప్పుట

తమ్ముడా! సౌమిత్రీ! వేకువజామున సుమంత్రుడు తెచ్చిన రథంపై సీతను కొనిపోయి సర్వజన పదాంతంలో గంగ దాటించి అవతలి ఒడ్డున వాల్మీకి మహర్షి ఆశ్రమ ప్రాంత వనాల్లో తమసానదీ తీరం దాపున నిర్జన ప్రదేశం చూచి అక్కడ ఆమెను దించి వెంటనే తిరిగిరా. నేను చెప్పినట్లు చెయ్యి. ఇది రాజాజ్ఞ. అన్నాతమ్ముల బంధం అనుకోవద్దు. ఇది స్వవిషయం ఇతర మంత్రాంగం ఇందులో ఏమీ అవసరంలేదు. సాహసిస్తే నేను సహించను. నీకు నా చరణాలపై ఆన పెట్టాను. బదులు పలుకవద్దు. ఎవరు ఎదిరించి బదులు పలుకుతారో వారిని పరమ శత్రువులుగా భావిస్తాను. నా పట్ల మీకు ప్రేమాభిమాన గౌరవాలుంటే నే చెప్పినట్లు చేయండి. ప్రతివాక్యం పలకకుండా ఆజ్ఞ చేస్తున్నాను. మీ వదిన గంగాతీరాశ్రమాలకు పంపుమని కోరింది. ఆ కారణంగా ఆమెను రథం ఎక్కించి నిర్దిష్ట ప్రదేశంలో దించి అనంతరం ఆమెను కొనివచ్చిన కారణం తెలుపు. తన శీలంతోపాటు పతి శీలాన్ని కాపాడుమని నా మాటగా చెప్పు" అని సోదరులను నిర్దాక్షిణ్యంగా శాసించి, అశ్రుజలం మార్గావరోధం కల్పించగా అంతఃపురానికిపోయి సర్పం బుసకొట్టినట్లు శ్వాసిస్తూ మూర్ఛిల్లాడు.

## సౌమిత్రి జానకిని ఆశ్రమ దర్శనం అనే నెపంతో కొనిపోవుట

ఆ రాత్రి కాళరాత్రిగా గడిచింది. విషాదచ్ఛాయ లలమిన రాముని మోమువలె తెల్లవారింది. అంతకంటె తెల్లవారిన మొగంతో సౌమిత్రి సుమంత్రుని రథం ఆయత్తం చేసి తొందరగా తెమ్మని కబురుపెట్టాడు. వెంటనే రథంతో ఆయన రానే వచ్చాడు. దేరుతో సౌమిత్రి రామ మందిరానికి వచ్చి

సీతను చూచి "వదినా! నీవేవో వరం కోరితే అన్న అంగీకరించాడట. అది నెరవేర్చమని నాకు ఆజ్ఞ చేశాడు. అంతా సిద్ధం చేసి రథం తెచ్చాను. అధిరోహిస్తే జాహ్నవీ తీర మున్యాశ్రమాలకు నిన్ను తోడ్కొని పోతాను" అని చెప్పాడు. "మరదీ! మీ అన్నది వెన్న వలె ఎంత మృదు హృదయం. నిన్ననే మాటవరసకన్నాను. అప్పుడే ప్రయాణం సిద్ధం చేసి నిన్ను పంపాడా? అయితే ఇప్పుడే వస్తున్నాను. మనంపోయేది ఆశ్రమ వాసుల దర్శనార్థంకదా? వట్టిచేతులతో పోవటం రామపత్నికి ధర్మమందువా? వారికి తగిన వసనాలూ, ఆభరణాలూ, ఇంకా తగిన సామగ్రితో వస్తాను. అంత తొందర ఏంలేదు" అంటూ కావలసినవన్నీ సమకూర్చింది. "మరదీ! ఇవి వారు గ్రహించటానికి యోగ్యమైనవేనా? ఇవి మనవంటి వాళ్ళం ఈయ టానికి అర్హమైనవేనా? ఇంకా ఏమైనా కావలెనా? ఆదేమిటి మరదీ? అవును, కాదు అనైనా అనకుండా బొమ్మలాగా నిలబడ్డావేం?" అని సీత అమాయకు రాలి విధంగా అంది. అప్పటి సౌమిత్రి స్థితి, "అంతర్నష్టం బహిశ్శీతలమ్" అన్నట్లు లోపల వేయిబాకులతో పొడిచినట్లు బాధకలుగుతుండే, బహిర్గతం కాకుండా కాపాడుకోలేక తలవాల్చి ఊరుకున్నాడు. సీత ఎంత సంతోషాన్ని వెలిబుస్తే, లక్ష్మణుడు అంత అదలిపోతున్నాడు. కష్టాలతో కాకలు తీరిన ధృతిమంతుడు కావటంచేత ఎలాగో నిబ్బరించుకున్నాడు ఇంతలో జానకి కాదగినవన్నీ సమకూర్చుకుంది. మెల్లగా రథారోహణంచేసి "పతి అనుజ్ఞ పొంది హయాలను అదలించు"మంది. సౌమిత్రి కూడా రథం ఎక్కాడు.

## సీత అవశకునాలు చూచి విలపించుట

సుమంత్రుడు పగ్గాలు సవరించి చబుకు ఝళిపించాడు. ఆ ధ్వని అవనిజాత హృదయంలో ప్రతిధ్వనించింది అరదం అయోధ్య దాటింది. అవనిజాతకు అన్నీ అవశకునాలే పొడగట్టుతున్నై. అంతకంతకు అధికమవు తున్న దుశ్శకునాలకు సీత భీతి పొందింది. "మరదీ! మనం అయోధ్యదాటగానే విపరీత శకునాలు నాకు తోస్తున్నై. మనస్సు చేయిపెట్టి పిడిని కలచినట్లవు తూంది. మాటి మాటికి కుడికన్ను అదురుతూంది. శరీరం కారణం లేకుండా కంపనం పొందుతూంది. చిత్తస్థిమితంగా లేదు. గుండె తట తట కొట్టుకుం టూంది. ఎట్టి కీడుమూడుతుందో ఎరుగలేకున్నాను. ఆశ్రమాలు చూచే

71, 171

మీరి నీటలు సమర్పించి ఆశీస్సులు పొందుతాను. ఈ ఒక్కరాత్రి ఎల్లో గడుపు. రేపు తిరిగి మీ అన్నను దర్శింపబోదాం. నాకూ ఎందుకో ఆరాటం అధికమవుతూంది. తొందరపడు. వచ్చిన కార్యం ముగించుదాం" అని సీత అన్నది.

## లక్ష్మణుడు రామాజ్ఞ చెప్పలేక ఏడ్చుట

సౌమిత్రి ఎట్టకేలకు ధృతి తెచ్చుకున్నాడు. దుఃఖాశ్రువులు చేతితో త్రోసి వేశాడు. గంగానది ఒడ్డున నావ సిద్ధం చేయించమని చెప్పాడు. నావ రాగానే సీతను ఎక్కించి, తర్వాత తాను ఎక్కి అవతలి ఒడ్డున దిగవలసి నిశ్చయించి, వెంటనే జాహ్నవి తరించాడు. నావ దిగిన వదినను చూడలేక గొల్లున ఏడ్చాడు. ప్రభువూ, అన్నా ఐన రామునిచ్చిన ఆజ్ఞ నెరవేర్చమని ప్రోత్సహిస్తుండే, ఈ ఘోరకార్యం తప్పనిసరి వదినపట్ల చేయవలసి వచ్చిందన్న ధ్యానం శస్త్రం చేస్తూంది. కత్తి నాగలి మధ్యలో పడిన ప్రాణిలాగా గిలగిల కొట్టుకున్నాడు. "ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?" అనే విషయం తేల్చుకోలేక తికమక పడ్డాడు. "వదినా! నీవు నా అన్న పత్నివై వచ్చినప్పటినుంచీ నా తల్లికి సమా ఎన్నడూ భేదంగా నా మనస్సు తలంచలేదు. అట్టి నీపట్ల ఈ కష్టకార్యం చేయుమని నాఅన్న ఆదేశించటం, అది నే చేయటం ఎన్ని జన్మల పాపఫలమో ఊహించలేను. ఇది ఎంత భరింపరాని లోకనింద? ఆ ధ్యానం స్ఫురించగానే శల్యమై, శస్త్రమై సహస్రధా బాధిస్తూంది. ఇందుకే నేను బ్రతికి వున్నానేమో? దైవం నాపట్ల దయతలచి మృత్యువును నాపై ప్రయోగించితే ఎంత బాగుండేది? అన్ని విధాలా దైవోపహతుడ్నే. ఈ కార్యం చేయటానికి ప్రభువునకు ఎందరో పరిచారకులున్నా నేనే దొరికాను కాబోలు. బుద్ధిమంతుడైన నా అన్నకు ఇది ధర్మంగా తోచిందా? చేయబోయేది పాపకార్యమైనా, తల్లీ! నేను పాపబుద్ధి కలవాడ్ని కాను. నా పాపాన్ని క్షమించు. నన్నుపాత్రం చేసుకోవద్దు. నీ పాపాలపై ఆన. నా అన్నపై ఆన" అంటూ మొదలు నరికిన వృక్షంవలె నేలమీదపై వ్రాలాడు. "ఓ మృత్యువా! రావా? నీకు కూడ నేను పనికిమాలినవాడైనానా?" అని కలవరించాడు. పలవరించాడు. రెండు చేతులు జోడించాడు. "క్షమించు తల్లీ! నన్ను క్షమించు"మని ఘోరంగా రోదించాడు. తల మోదుకున్నాడు. "ఛీ! నా బ్రతుకు వ్యర్థం" అనుకుంటు

న్నాడు. ఈ విధంగా కొలిమిలోని మూసలో సలసల కరుగుతున్న అయో మయంవలె కనుపిస్తున్న లక్ష్మణుని బాధ చూచి అర్థంకాక, భయంతో "అయ్యో మరదీ! నీ బాధ నా కర్థం కావటంలేదు. విషయం చెప్పక విలపిస్తున్నావు. ప్రభువునకు కుశలమేనా? నేను నీ అన్నపై ఆన పెడుతున్నాను. జరిగిన దేదో సవిస్తరంగా చెప్పు. నేను అనుమతించుతున్నాను. నా మీద ఆన పెడుతున్నాను" అని సీత అన్నది.

## సౌమిత్రి సీతకు రామాజ్ఞ తెలుపుట

"తల్లీ! చచ్చినవాణ్ణి ఇంకా చంపుతావెందుకు? ఇష్టపడి ఇంత దూరం కొనివచ్చిన క్రూరుడు కారణం చెప్పకుండావుంటాడా? అది చెప్పలేకే కుమిలి పోతున్నాను. ఉన్నది ఉన్నట్టు, అన్నది అన్నట్టు, విన్నది విన్నట్లు చెపు తాను. నాపై నీకు పుత్రవాత్సల్యం వుంటే విషయం విన్న తరువాత ఎట్టి ప్రమాదానికి దిగనని మాట ఇవ్వు. అది అంత భయంకరమైంది. తల్లీ! సావ ధానంగా విను. దారుణ వార్తలు పల్లెల్లోనూ, పట్టణాలలోనూ నిన్ను గూర్చి ప్రజలు అనుకొనటం ప్రభువు పెద్దల సమక్షంలో భద్రుడు చెప్పగా విని తన హృదయ బాధ నాతో చెప్పి అంతఃపురానికి వెళ్ళాడు. అన్న మాటలన్నీ నేను నీతో చెప్పరాదు. నేను కన్నార నీ సౌశీల్యం కాంచాను. నీ పతి దయా రహితుడై నిన్ను పరిత్యజించలేదు. ప్రజల ప్రవాదం భరించలేక నిన్ను పరిత్యజించాడు. అంతమాత్రమే. కాని, వేరే కారణంలేదు. రాజాజ్ఞ మేరకు ఆశ్రమ ప్రాంతాల నిన్ను వదలి వెళ్ళతాను. నీ గర్భధారణ చిహ్నానికిమెచ్చి ఇచ్చినవరం ఒక నెపంగా ఇక్కడ దిగవిడిచి రమ్మన్నాడు. ఈ పరిసరాల్లోనే దశరథమహీపతి సఖుడు, రూపుతాల్చిన చతుర్ముఖుడు, మహా తపస్వి, వాల్మీకి మహర్షి వాసం చేస్తున్నాడు. ఆయన పాదసేవలో కాలం గడుపు. శీలవతివి. నీకింక చెప్పవలసిందేముంది? పతి నామం, పతి ధ్యానం సతులకు సర్వ విఘ్నోపశాంతి కారణం. జలజాసన జ్వలనులు మెచ్చిన నీ పాతివ్రత్యం నీకెల్లప్పుడు రక్షాకవచంగా వుంటుంది. ఏ పీడలు నిన్నాశ్రయించవు. త్వరలో నీకు మనశ్శాంతి లభిస్తుం"దని, దీన వదనంతో సౌమిత్రి అధోముఖుడై అన్నాడు.

## శ్రీరామాజ్ఞ విని సీత విలపించుట

వింటూనే భూజాత ప్రభంజనాహతికి సురిగిన కదళికా వృక్షంవలె కూలిపోయింది. ముహూర్తకాలంలో లబ్ధసంజ్ఞయై, "అన్నా! సౌమిత్రీ! జీవిత మంతా శోకంతో గడుపుమని విధి నా మొగాన వ్రాశాడు. లోకంలోని అన్ని దుఃఖాలు వచ్చి నన్నలుముకొన్నై. చెప్పుకున్న ఫలం ఏముంది? నేను ఘోరాతి ఘోరపాపాలు వెన్కజన్మలో ఎన్నో చేశాను. ఏ పూజ్యసతీ పతులకు ఎడబాటు కల్గించానో? కాకపోతే నిర్నిమిత్తంగా ప్రేమించినపతి, నట్టడవి మధ్యందిన భానుమండల తాపం డసించినట్లువహించే శిక్ష యావజ్జీవితం విధిస్తాడా? నేను దోషినని భావిస్తాడా? పూర్వం లంకలో వత్సరకాలం బాధలనుభవిస్తూ బ్రతికానంటే ఎప్పటికైనా పతిపాదసేవ లభిస్తుందన్న ఆశ వుండటంచేతనే. ఈ నిర్జనారణ్య సీమల్లో ఏకాకిగా ఏ ఆశతో జీవించేది? నా దుఃఖం నాకు ప్రాప్తించిన దండనం ఇతరులతో ఏ మొగం పెట్టుకుని చెప్పుకునేది? నిష్కారణంగా నీ భర్త ఎందుకు పరిత్యజించాడని, మునిపత్నులడిగితే "నాదోషం ఏమీలేదు. నాభర్త కఠోరకర్ము"డని సతీధర్మం మాని నిందారోపణ ఎలా చేసేది? ఈ మాటవిని ఇంతకాలం సీతో బ్రతికి భాషించటం నాభర్త వంశాంకురం నాలో వుంది కనుక. ఇంతకు పూర్వమే ఏ ఒక్క బిడ్డయినావుంటే ఈ గంగామాత కడుపులో చల్లగా కాలం గడిపేదాన్ని. ఇంతవరకు వీరపత్నిగా పేరెన్నికగన్నాను. ఇప్పుడు వీరమాతను కాబోతున్నాను. బ్రహ్మాదిదేవతలచే, వశిష్ఠాది మహర్షులచే పూజితుడైన నాభర్త తేజం వ్యర్థంచేసి, పతికి నిర్దయుడన్న అపవాదు అంటకట్టి శరీరత్యాగం చేయటం సతిగానూ, మాతగానూ నాకు తగదు. పుత్రోదయానంతరం ఆ పని చేసినా తప్పులేదు.

## సీత శ్రీరామునకు చివరి మాటలు చెప్పి పంపుట

విన్నావుకదా మరదీ! నా నిర్ణయం. ఇక ప్రభువు చెప్పిన ప్రకారం నన్ను వదలిపో. దురదృష్టవంతురాలిని. దుఃఖభాగినిని. నావలెనే నీవూ ఆయన కనుసన్నల్లో మెలగి ఆయన కీర్తికి మూలస్తంభంగా నిలుపు. నీకు పుణ్యలోకాలు పాదాలవద్ద పడివుంటై. నా అత్తగార్లకు నమస్కారాలనిచెప్పు.

మీ కోడలు మీ క్షేమం అడిగిందని చెప్పు. నీవు పోగానే నా భర్త చరణాలపై వ్రాలి కుశలం అడిగినట్లు చెప్పు. "ప్రభూ! ఏ పౌరుల మనస్తృప్తి కోసం సహధర్మచారిణినైన నన్ను త్యాగంచేశావో ఆ పౌరుల క్షేమానికే ఆ జన్మాంతం అక్కడ నీవూ, ఇక్కడ నేనూ పాటుపడదాం. జానకి శీలం ఎటువంటిదో నీకు తెలియందికాదు. ఆమె ఎప్పుడూ నీ హితకాంక్షిణి. నీ భక్తురాలు. అపవాద భయం చేత నన్ను పరిత్యక్తనైన అనదను. నాకు పరమగతి నీవే అయినందున నీకు తగ్గిన మర్యాదం పొందటం నా ధర్మంగదా. అందుకే నీ ఆజ్ఞ ఔదలదాల్చాను. పౌరులకోసం భార్యనేకాదు ప్రాణాలిచ్చే ప్రభువు యశస్సు సూర్య చంద్రాదులు నిల్చినంతకాలం నిలుస్తుంది. ఆ విధంగా చేయగల ప్రాజ్ఞడవు నీ వొక్కడవే. నేను దుఃఖంతో శరీరం కృశిస్తున్నందుకుకాక నీకు వచ్చిన అపకీర్తికే ఎక్కువ శోకిస్తున్నాను. ఇకపై ఇట్టి నిందలు రాకుండా ధర్మంతో ప్రజలను పాలించు భార్య కన్నివిధాలా భర్త పరమగతి అయినందున నీ కోరిన ప్రకారం నేను నడుస్తాను. నాపై మమకారంతో మహీపాలుని ధర్మం మరవద్దు" అని నా తుదికోరికగా నా భర్త శ్రవణాల్లో ఏకాంతంగా వినిపించు. ఇక నీవు మరలిపో. నన్ను చూడు. మరదీ! గర్భచిహ్నం కలిగి ఎంత దురవస్థకు పాల్పడ్డానో" అని అన్నది.

## సౌమిత్రి జానకి అనుమతిగొని మరల గంగ దాటుట

ఎడతెగకుండా వచ్చే కన్నీరు కాల్వలు కట్టగా మైథిలి చరణారవిందాలకు కొంచెం దూరంగా శిరస్సుంచి మ్రొక్కి, ఒక్కమాటైనా అనలేక ఆమెచుట్టూ ప్రదక్షిణించి, తలా, గుండెయూ కొట్టుకుంటూ, క్షణకాలం మౌనంగా ధ్యానంచేసి, "తల్లీ! ఏమన్నావు? నిన్ను చూడమన్నావా? ఇంతవరకు నీవెలావుంటావో నాకు తెలియదు. నీ రెండుపాదాలే చూశాను. అంతవరకే నాకు తెలుసు. ఇప్పుడు ఈ నిర్జనాటవిలో, నా అన్న లేకుండా నిన్ను చూస్తానా? లక్ష్మణుడు సుమిత్రమ్మ పెద్దబిడ్డ. ఆపని ఈనాడుకాదు ఏనాడు చేయడు" అని వేగంగా వెనకకు మళ్ళాడు. ఆ సమయంలో అతని హృదయంలో అనేక భావాలు కలగూరగంపగా ఆకృతికొన్నై. "లోకాపవాదం

సీతమ్మ లేకుండా రావలేనా? నా అయ్య ఆమె లేక సామ్రాజ్యసంసారం ఎలాచేశావని కూడా ప్రశ్నించా. ఎవరెవరో సమయంలో ధార్మికులు అపవాదులువేస్తే ఇంత వరకు చేసిన సంసారవిషయం ఎలాపోతుంది? ప్రజాగౌరవం ఎలా ప్రాప్తి స్తుంది? అన్న ఏ ధర్మాన్ని ఆచరించి ఈ కృత్యాన్ని చేశాడో?" అన్న ఆలోచన రాగానే, "లోకధర్మం స్త్రీ శీలం శంకిస్తుందిగాని పురుషుని శీలం గురించి ప్రాధాన్యం ఇవ్వలేదు. పాతివ్రత్యం మగవాళ్ళకుండదు. బహు పత్నీత్వం స్త్రీలకులేదు. బ్రహ్మచర్యత ప్రధానంగా పురుషుడు చెప్పించారా, పెద్ద ప్రధానంగా చెప్పలేదు. అందువలనే అన్ని ధర్మ కర్మకృత్యాలు స్త్రీ శీలంపై ఆధారపడే విధంగా మహాత్ములు రచించారు. పురుషుడు ఎన్నో కర్మలుచేసి సాధించే ఫలితాలు సతి పతిని సేవించి పొందుతుంది. అందుచే ఆమెను పరిత్యజించితే మగవానికి వచ్చిన నింద పోతుంది. పైపెచ్చు కాము కుడు కాకుండా నిగ్రహం కలవాడన్న ఖ్యాతికూడా వచ్చికలుస్తుంది. అందుకే నీ అన్న ఆ పని చేశాడు. అసలామె అగ్నికంటే పరిశుద్ధురాలు ఆసంగతి సంపూర్ణంగా నీ అన్నకు తెలుసు. ఆమె సతీత్వం తెలిసి సంసారం చేశాడు కనుక ధర్మచ్యుతిలేదు. మనస్సులేని శరీర వికృతి బలవంతం కాబట్టి పాపం ఆ శరీరానిదేను. నీ అన్న కేవలం సత్యధర్మ స్వరూపం. ఇది ధర్మమై నప్పటికీ, అగ్నిసాక్షిగా పాణిగ్రహించేటప్పుడు దోషం లేనంతవరకు విడరాద నని ప్రతిజ్ఞచేసి సత్యం తెలిసి కూడ పరిత్యజించిన నీ అన్న బ్రతికినంత కాలం తీరని శోక రూపమైన శిక్ష అనుభవించక తప్పదు. ఆయన లోకనింద పోగొట్టుకుందామనే సీతను విడిచి పెట్టాడు కాని, శీలం శంకించి కాదు. లంకలో జరిగిన అగ్నిపరీక్ష ఇక్కడివారు చూడలేదు. సూక్ష్మదృష్టి లేని లోకులు ఎందుకో కొన్ని నమ్మలేరు. కొన్ని కట్టు కథలంటారు. అదిసామాన్య జన నైజం. ఆమెవంటి ఇల్లాలు ఇక పుట్టదు. జరిగిన పని ధర్మంగానే జరి గింది. నీవు దుఃఖించవద్దు. నీ కర్తవ్యం నిర్వహించావు. ఇందులో నీ దోషం లేదు. నీకు పాపం రాదు" అన్న సమాధానం వెంటనే వచ్చింది. ఆ భావం అంతా ఏకస్త్రీ మూర్తి దేవతగా మారి అంతర్హితమైంది. లక్ష్మణుడు తేరు కున్నాడు. నదీతీరం చేరి నావ ఎక్కి తరించాడు. నదిదాటే పర్యంతం హృదయం స్రవిస్తుండగా, భూమిపై పొరలుతూ ఏడుస్తున్న జానకిని చూస్తూ

విలపిస్తూనే వున్నాడు మూఢుడై రథంలో పడి సాగిపోయాడు. సీత, రథ ధూళి కనుమరుగయ్యేదాకా చూచి చూచి మతిపోయి మహిపై పడ్డది.నిర్జనాటవి ప్రతిధ్వనించేలాగా రోదించింది.

## మునిపుత్రులు సీతవార్త వాల్మీకి మహర్షికి తెలుపుట

పర్ణఫల కుశాదుల నిమిత్తం అడవికి వచ్చిన మునిబాలకులు ఆఏడుపు విన్నారు. సమీపించి చూచారు. వెంటనే పరుగెత్తి వాల్మీకి మహర్షి ఆశ్రమంలో ప్రవేశించారు. పాదాభివందనంచేసి, కంపిత స్వరంతో, "గురుదేవా! మేం అడవిలోకిపోయి గంగ ఒడ్డున ఒక దుఃఖభాగినిని చూచాం. ఆమెఎంత గొప్పవాని ఇల్లాలో? సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి అంటే తప్పు లేదు. ఇంతకు పూర్వం ఈ ప్రాంతాల్లో ఎన్నడు చూడలేదు. దివినుంచి భువికి దిగివచ్చిన దేవకన్యకవలె వుంది. ఆమె ఒంటిగా ఏడిగట్టున నేలపడి ఏడుస్తూంది.ఎందుకు ఏడుస్తున్నదో మాకు తెలియదు. ఆమె శోకం చూడలేక మీ సన్నిధికి పరుగెత్తి వచ్చాం. ఆమె మానవ తరుణిగా మాకు గోచరించ లేదు. దుఃఖానికి అనర్హకాని, దుఃఖిస్తూంది. మన ఆశ్రమానికి బాలా సమీపంగానే వుంది. ఆమెకు దిక్కు లేదు. ఒంటరిది.ఇక ఆమెకు మీరే దిక్కు-కావాలె. ఓదార్చేవారు కాని, రక్షించేవారుకాని లేకపోవటంతో రాళ్ళు కరిగేలాగా రోదిస్తూంది. ఆమె ఆపదబాపి ఆదుకుని రక్షించే మహానుభావుడవు నీవుగాక మరెవ్వరు లేరు. ఆమె ముమ్మాటికి అగ్ని వంటిది. తమవంటి వారి రక్షణకోసం నిరీక్షిస్తూంది. ఆలసించితే ఆమె బ్రదుకుతుందో లేదో త్వరపడండి" అని చెప్పారు. అంతా విన్న మహర్షి జ్ఞానదృష్టితో సర్వం దర్శించాడు. పాదుకోళ్ళు కూడా తొడుగుకోకుండానే పరుగు పరుగున ఆమె పడివున్న చోటికి శిష్యులతో వచ్చాడు. కమండలం జలం పూరించి శిష్యులు తెచ్చారు. కల్లోలం లేని కల్లోలినివలె, మానవాకృతితో వచ్చిన చతుర్ముఖునివలె,దర్శనమాత్ర సకలపాప సంక్షయం చేసే దివ్య తేజస్సుతో భూపుత్రిని చేరవచ్చి సానునయంగా చూచాడు.

# మహర్షి మైథిలిని ఆశ్రమానికి కొనిపోవుట

ఆ మహర్షి ప్రసన్నదృక్కులు ప్రసరించగానే మోయరాని బరువు ఎవరో దించినంతగా జానకి శోకం తీరి తేలికపడింది. "తల్లీ! శోకించకు. ఈ ప్రాంతంలోనే నా ఆశ్రమం వుంది. నాపేరు వాల్మీకి. శిష్యులు చెప్పగా విని వచ్చాను. నీ చరిత్రంతా యోగదృష్టితో తెలుసుకున్నాను. నీవు దశరథుని కోడలవు. శ్రీరాముని ధర్మపత్నివి. జనక రాజర్షి తనయవు. సీతా నామధారిణివి. పతివ్రతల్లో మేల్బంతివి. నీకు స్వాగతం. నీ రాక గూర్చిన నిఖిలం నేను తెలుసుకున్నాను. నాకు సర్వలోకాల్లో జరిగే సంగతులన్నీ విదితమవుతై. నీలో ఏ పాపంలేదు. నీవు నిష్కళంక చారిత్రవు. నీకు ఏం భయం లేదు. ఎంతటి వారికైనా కర్మానుభవం తప్పదు. నిన్ను పరిత్యజించి నీభర్త సుఖంగాలేడు. ఆయన అజ్ఞానజన లోకానికి కళ్ళు తెరిపించే కార్యం చేశాడు. నీ మనస్సులో ఏ విధమైన శంకావద్దు. అంతా సవ్యంగానే జరుగుతుంది. అమ్మా! నామాటనమ్ము. నేను నీకు తండ్రివంటి వాడను. పెద్దవాడను. నీ కేలోపం రాకుండా మా మునిపత్నులు ఆదరణతో చూస్తారు. పతిసేవ లేని లోపం మినహా అన్నీ జాగ్రత్తగా తీరుస్తారు. వారంతా నియత వ్రతలు. ధర్మ సేవాధురంధరలు. కన్నబిడ్డవలె కన్నుల్లో పెట్టుకుని పూజిస్తారు. ఇదిగో అర్ఘ్యం. స్వీకరించి నా వెంటరా!" అని చల్లని వాక్కులు పల్కి ఆమెను ముని ఊరడించాడు. ఆమె పరమాద్భుతమైన మహర్షి తపశ్శక్తికి అచ్చెరువు పొందింది. తనకు సంప్రాప్తించిన కష్టదశను మౌనినాథుడు సకాలంలో దైవప్రీతుడై ఆదుకున్నందుకు సముద్రంలో మునిగిపోయే జీవికి తెప్ప సాయం దొరికినంతగా తృప్తిపడింది. వెంటనే తేరుకునే మునిచరణ సరసీజాలకు ప్రణమిల్లింది. "తండ్రీ! సర్వం తెలిసిన మీకు నేనేం చెప్పేది? నాబ్రతుకిలా బండలైంది. నామరణాంతం వరకు మీ పాదసేవలో ఈ జీవితం గడుపుకుంటాను. నన్ను అనుగ్రహించు. కీడులో మేలన్నట్లు మీ రక్షణ దొరకటం నాభావిజీవితం చరితార్థమవుతుంది. మీవెంట ఆశ్రమానికి వస్తున్నా"నని సీత లేచింది.

# వాల్మీకి సీతను మునిపత్నులకు అప్పగించుట

భ్రాతలతో, జానకితో వాల్మీకి తన ఆశ్రమానికి కొంచెం దవ్వుగా నున్న మునివాటికకు పోయాడు. ఆ మహాత్ముని రాకకు మునిపత్నులు ఎంతో సంతోషం పొందారు. "స్వామీ! మీరిక్కడకు వేంచేయటం మహాభాగ్యమైంది. స్వాగతం మీకు. మా అందరి అభివాదాలు ఆదరంతో స్వీకరించండి. వచ్చిన కార్యం సెలవిస్తే తలతో చేస్తాం. ఈ తల్లి ఎవరు? రూపొందిన దుఃఖదేవతా మూర్తిగా ఉందే?" అని అడిగారు. "తల్లుల్లారా! ఈమె పేరు సీత. దశరథ మహారాజు పెద్దకోడలు. శ్రీరామచంద్రుని ధర్మపత్ని. జనక చక్రవర్తి కూతురు. కలుషరహిత అయినా కూడా కారణాంతరం చేత పతిచేత పరిత్యజించ బడింది. సత్యం పరిపాల్యా. ఈ బిడ్డను అచ్చపు నెయ్యంతో ఆదరించండి. అగ్నిని పవిత్రునిగా చేయగల శీలవతి. ఇది నేనై మిమ్మల్ని కోరుతున్న కోరిక. ఈమె రక్షణచే మనకెంతో పుణ్యం వస్తుంది. ఇప్పటివరకు ఈమె నా బిడ్డ. ఇకపై మీ బిడ్డ. ఈమె గురించి. అవసరమైతే ఆశ్రమానికి కబురుపెడుతుండండి. మీకు శుభంకలుగు గాక" అని ఎంతో ప్రేమాభిమానాలతో ఒకటికి పదిసార్లు నొక్కి నొక్కి చెప్పాడు. మునిసతులు మిక్కిలి ప్రీతితో సీతను చెంత చేర్చుకుని, "తల్లీ! నీ కేలోపం రానీయం. ఇది మీ తండ్రి ఇల్లనుకో. ఏది వచ్చినా మన మంచికే అన్నట్లు, ఇది ఎందుకు వచ్చిందో? మహా భాగుడైన మహర్షి భవిష్యద్దర్శనం కలవాడు. ఆయన నిన్ను ఆదరించినాడంటే శుభం తప్పక కలుగుతుంది" అని ఓదార్చి ఆశ్రమానికి తీసుకునిపోయారు. భ్రాతలతో మహర్షి స్వాశ్రమానికి తరలివెళ్ళారు.

# సౌమిత్రి రామునిగూర్చి సుమంత్రునితో చెప్పి ఏడ్చుట

గంగ దాటిన సౌమిత్రి సుమంత్రుణ్ణి కలుసుకున్నాడు. "మంత్రీ! ఎంత జరగరాని కార్యం జరిగింది? జానకీ వియోగ కారణమైన రామచంద్రుని దుఃఖం చూశావా? లోకసమ్మాన్యురాలైన సతిని విడిచిపెట్టాడు. ఇంతకంటే వేరే బాధ ఈ లోక వాసులకు ఏముంది? భార్యా వియోగ దుఃఖితుడైన రాము

నీ బాధచూడలేక, మరోవిధంగా నిన్ను ఓదార్చే మార్గంలేక తెలుపుతా నన్నాను. ఆయనకు నేను మాట ఇచ్చి ఇప్పుడు నీకు తెలుపుతున్నానంటే దైవచోదితం అని తెలుసుకో. నాకు దీనివల్ల ప్రాప్తించే కీడుకంటే నిన్ను ఓదార్చటంవల్ల వచ్చేమేలే ముఖ్యంగా కనిపించింది నీవుమాత్రం ఏదశలో నైనా ఎవరితోనూ చెప్పకు. అనుభవించవలసిందే. నీకు సర్వం అన్నగారే. ఆయన బాధ పాపటానికైనా అనవద్దు. ఈ పద్ధతి సర్వాత్మనా నీకు సమ్మత మేనా?" అని సుమంత్రుడు ఒకటికి రెండుసార్లు రెట్టించాడు. అందుకు సౌమిత్రి అంగీకరించి విషయం వివరించుమని కోరాడు. సుమంత్రుడు గత గాథ చెప్పమొదలుపెట్టాడు.

## దశరథ దుర్వాసుల సంభాషణ సౌమిత్రికి సుమంత్రుడు చెప్పుట

"సౌమిత్రీ! మేం మహర్షి ఆశ్రమానికి వెళ్ళాం అని చెప్పానుకదా? అప్పుడు వాన నెలలు నాలుగుమాసాలు గడపటానికి ఒక దివ్యతేజస్సంప న్నుడు వచ్చివున్నాడు. ఆయన మహర్షి పక్కన రెండవ దినకరుడులాగా ప్రకాశిస్తూ కూర్చునివున్నాడు. మీ తండ్రి ఉభయులకు నమస్కారాలు చేశాడు. వారు ప్రభువుకు అర్ఘ్యపాద్యఫలాదులిచ్చి సత్కరించారు. ఎన్నో పూర్వగాథలు మధురాతిమధురంగా వినిపించారు. వారు చెప్పే గాథలు ముగిసేసరికి సూర్యుడు అంబరమధ్యస్థుడైనాడు. అప్పుడు మీతండ్రి లేచి విన యంతో "స్వామీ! తాము వినిపించిన కథలు ఎంతో పురాతనమైనవీ,సత్యధర్మ బోధకాలైనవీ, ప్రజాచరణయోగ్యమైనవి అనుటకు సందేహంలేదు. ఇంతవరకు తమ నామధేయం తెలుసుకోలేదు. దయతో సెలవిస్తే విని సంతసిస్తాను" అని ప్రార్థించాడు. అప్పుడు వసిష్ఠమహర్షి "దశరథా! ఈయనదుర్వాసోముని. అత్రిమహర్షి పుత్రుడు. చాతుర్మాస్యాలు ముగించుటకై నా ఆశ్రమానికి వచ్చాడు. మహానుభావుడు. భవిష్యద్దర్శనంలో ప్రథముడు" అనిచెప్పాడు. వెంటనే మీతండ్రి "స్వామీ! నా తెలివితేనితనాన్ని మన్నించండి. మా వంశ కథ చెప్పారు. నా బిడ్డల జననం చెప్పారు. నా వంశం ఎంతకాలంవుంటుంది? రాముని ఆయుఃప్రమాణం ఎంత? ఎంతకాలం రాజ్యం పాలిస్తాడు? మిగిలిన

ముగ్గురు ఏమవుతారు? రామునకు సంతానం కలుగుతుందా? కలిగితే ఎందరు? వారెంతకాలం జీవిస్తారు? గతం చెప్పారు. వర్తమాన భవిష్యత్తులుకూడా దయతో సెలవియ్యండి" అని ప్రార్థించాడు.

## భృగు మహర్షి విష్ణువును శపించుట

"రాజా! నీ వడిగిన విషయాలు వివరిస్తా విను. కృతయుగంలో నిరంతరం దేవదానవులకు భీకర సంగ్రామం జరుగుతుండేది. దేవతలకంటే దానవులేపైచేయిగా వుండేవారు. తర్వాత దేవతలు శక్తిమంతులై దానవుల హతమార్చసాగారు. అసురులదాడికి తట్టుకోలేని అసురులు భయంతో భృగు పత్ని శరణు చొచ్చారు. ఆమె వారికి అభయం ఇచ్చింది.అంతవరకు పొందు తున్న బాధలన్నీ భృగుపత్ని ఇచ్చిన అభయంతో అంతర్హితమై అసురులు సుఖిస్తూ దేవతలను శాసించసాగారు. దివిజులంతా విష్ణువుతో మొరబెట్టుకోగా ఆయన తీవ్ర సుదర్శనధారతో ఆమె శిరస్సు త్రుంచాడు. కారణం లేకుండా తన పత్నిని ఖండించినందుకు భృగువు కోపించి "ఓ అచ్యుతా! శరణాగత రక్షణం చేసి నా భార్యను, అవధ్యను చంపి నాకు తీరరాని శోకం కల్పించావు. నీవు భూమిపై పుట్టి చిరకాలం నావలె దారవియోగం అనుభవిస్తూ జీవించు" మని శపించాడు. వెంటనే పశ్చాత్తాపం పొందాడు. పాపులైన రాక్షసులకు తన సతి రక్షణ కల్పించటం, కోపంతో విషయం తెలియక విష్ణుదేవుని శపించటం తలచి ఆయన పాదాలపైబడి క్షమాభిక్ష కోరాడు. అర్థించిన తాపసిని నిగ్రహిస్తే నరకం పాలవుతాడని, భక్తవత్సలుడూ, దయాసింధువూ అయిన హరి భువన సంప్రియార్థం శాపాన్ని గ్రహించాడు. ఇది అనాది కథ. ఆ శాపాన్ని అనుభవించే నిమిత్తం దుష్టశిక్షణ, శిష్ట రక్షణ సలిపే నిమిత్తం అవసరం వచ్చేవరకు ఆపుకున్నాడు. భృగువుకు క్షమాభిక్ష ఇచ్చాడు.

## దశరథునకు రాముని పుట్టుక చెప్పుట

నీవు సంతానార్థం పుత్రకామేష్టి చేశావు. ఆ యజ్ఞ పాయసంలో హరి శాప ఫలాన్ని అనుభవించేందుకు ప్రవేశించి రాముడుగా పుట్టాడు. కొంత కాలానికి ఆ మహానుభావుడే అయోధ్యకు రాజవుతాడు. పదకొండువేలయేండ్లు పరిపాలిస్తాడు. ఆయన పాలన లోకానికి ఆదర్శవంతమవుతుంది. ఆయన

అనంతరం, ఈ సత్యపరాక్రముడు అనేక యాగాలు, భక్తులు ఎందరో జన్మించి కలియుగాంతంవరకు పరంపరగా ఆయన కీర్తిని ప్రకాశింపచేస్తూ వారు తరిస్తారు. పదకొండు వేలేళ్లు పాలించి స్వర్గలోకంలో ప్రవేశం చేస్తాడు. అశ్వమేధాలు చేస్తాడు. దానధర్మాలతో యాచక సమూహాన్ని సంతృప్తి పరుస్తాడు. ధరణిలో ధర్మం స్థాపిస్తాడు. రామునకు జనకపుత్రి సీత భార్య అవుతుంది. ఆమెకు కవలలు పుడతారు. ఆయన మహాప్రస్థానం చేయబోతూ పెద్దవాళ్లి అయోధ్యకు ప్రభువుని చేస్తాడు. వారి సంతానం పాలనాకాలం సాగుతుంది" అని జరగబోయే సంవిధానం స్పష్టంగా పలికాడు. మహారాజు సంతోషించి మునిని అనేక విధాల అర్చించి అయోధ్యకు వచ్చాడు. ఈ రహస్యం అంతా వెనుకటి నేను విన్నాను. మీ తండ్రి గారిపై ఇంత కాలం దాచాను. ఇప్పుడు నీకు చెప్పాను. ఋషి ధర్మపత్నిని శపించి, సంహరించి పొందిన శాపఫలం. అనుభవించక తప్పదు. ఆయన ధీరుడు. ఆమె వియోగం మానసికంగా అనుభవిస్తూ, ప్రజానురంజకంగా పాలన సాగిస్తాడు. ఇక విచారం మాను. ఎవ్వరం ఏం చేయలేం. ఆమె వాల్మీకి రక్షణలో ఏ బాధ లేకుండా జీవిస్తుంది. మీ అందరి అండలతో రామచంద్రుడు ధర్మరాజ్యం స్థాపిస్తాడు. నీవిక నిబ్బరంగా వుండు"మని సుమంత్రి బోధించాడు.

## లక్ష్మణుడు శ్రీరాముని చూడబోవుట

సుమంత్రుడు చెప్పిన పరమాద్భుత రహస్యగాథ విని సౌమిత్రి శోకం వదిలాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. కర్తవ్యోన్ముఖుడయ్యాడు. వారిద్దరు ఈ విధంగా ప్రసంగించుకుంటూ సాయంకాలానికి కేశి నదిచేరారు. సూర్యాస్తమయం కాగా సంధ్య మిగిలింది. ఆ రాత్రి అంతా అక్కడే గడిపారు. ప్రొద్దు పొడవగానే వేగంగా రథం తోలుమని సుమంత్రుని లక్ష్మణుడు తొందర చేస్తున్నాడు. ప్రయాణ మధ్యంలో సౌమిత్రి "నా అన్నను ఎలా చూస్తాను? ఏమని చెప్తాను? జానకిని అడవిలో దించి వచ్చిన సంగతి తెలిసి "అన్నకు తగిన తమ్ము"డని నిందించే తల్లుల ఎలా సమాధానపరుస్తాను? ఆయనకు మతిలేకపోతే ఆయనకైనా వుండనక్కరలేదా? ఎంత కఠిన కర్ముడు?" అని పౌరులు మాటమంటే విని ఎలా సహించను?" అని అనేక భావాలు హృదయంలో కల్లోలం సృష్టిస్తుండగా మౌనంతో సహించుకున్నాడు. ఇంతలో రథం

రాజమార్గం దాటి రామ మందిర ప్రాంతం చేరింది. అక్కడ రథావతరణం చేసి, సుమంత్రుని పంపి, ఏకాకియై, పాదచారియై, అవనతమనస్కుడై హర్మ్య ప్రవేశం చేశాడు. మధురమందహాస చంద్రికలతో ప్రకాశించే మందిరం నిశ్శబ్దం, నీరవం, నిగూఢ శోకావర్తంగా వుంది. బంగారు పీఠంపై ఏకాంతంగా రాముడొక్కడే ఆసీనుడై వున్నాడు. కొలనుదాసిన కమలంవలె వదనం తేజోహీనంగా వుంది. "పుంసాం మోహన రూపాయ" అనే ఆర్యోక్తి ఆ మూర్తిలో ఆ వేళ అన్వర్థం కాలేదు. తొలకరిలో వడగండ్లుపడినట్లు నేత్రాల నుంచి శోకాశ్రువులు రాలుతున్నై. ఆ గంభీర ముద్రలో చైతన్యం స్ఫుటంగా కనుపించటంలేదు.

## సౌమిత్రి సీత వృత్తాంతం చెప్పి శ్రీరాముని ఓదార్చుట

సౌమిత్రి మెల్లగా ప్రవేశించి చరణకమలాలకు వందనం సలిపాడు. అంజలిబద్ధుడై, ఎంతో శాంతంగా, ఒక్కొక్క మాట ఆచి తూచి "అన్నా! నీ తమ్ముడు రామానుజుడు వచ్చాడు. నీ ఆజ్ఞమేరకు వదినను జాహ్నవి ఆవలి గట్టున మహర్షిఆశ్రమం చేరువలోదించి, నీవు చెప్పిన వాక్యాలుచెప్పి నీ చరణ సేవకు మరలివచ్చాను. నీవు పురుషోత్తముడవు. నరసింహుడవు. సుమతివి. ధృతిమంతుడవు. కాలగతిగుర్తించి శోకంమాను. దైవపౌరుషాల్లో దైవంగొప్ప దని నేను తెలియనికోపంలోవుండగా నీవేచెప్పావు. ఇది దైవనిర్ణయం. దాట రానిది. ధనధాన్యాదులు నిధనాంతాలు. వృద్ధిసుదర్శాలు విలయాంతాలు. జననాలు మరణాంతాలు. సంయోగాలు వియోగాంతాలు. పుత్రమిత్రకళత్ర బాంధవైశ్వర్యాదులపై రక్తి మీవంటి ధీమంతులు చూపరు. వీటన్నిటికి ఎప్పుడో ఒకప్పుడు విప్రయోగం వుండి తీరుతుంది. నీకు చెప్పటానికి నేనే పాటివాణ్ణి? ప్రజలనే కాక నిన్ను నీవు శాసించి దిద్దుకోజాలిన నిగ్రహమూర్తివి. ప్రాకృతునివలె శోకిస్తావెందుకు? వదిన పరిత్యాగం ఆలోచించే నిర్ణయించావు కదా? ఇంకా విచారం పొందడం ధర్మంకాదు. నీ విలా దుఃఖిస్తూ కర్తవ్య విముఖుడవైతే, ఏ అపవాదం పాపుకోటానికి ఎవ్వరూ చేయని సాహసకార్యం

చేశావో, అది ఈ విచారంతో "రాముడు కేవలం కాముకుడు కాబట్టే ఆమెతో ఇంత కాలం కాపురం చేశాడు" అనే శాశ్వత నింద కూడా సంపాదించుకుంటుంది. అశక్తులు చేసే పని అప్రతిహత ధీమంతుడవైన నీవు చేస్తే ఏవిధంగానూ సమర్థనీయం కాదు. "అనిత్యాని శరీరాణి విభవోనైవ శాశ్వతః, నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం ధర్మసంగ్రహం" అని పెద్దల సూక్తులు" అని ఊరడించాడు.

## రాముడు లక్ష్మణునకు నృగు చరిత్ర వినిపించుట

ఈ విధంగా వినమ్రతతో వివరించిన సౌమిత్రి మాటలు రాముడు సావధానుడై విన్నాడు. "తమ్ముడా! నీవు నిజం చెప్పావు. సంతోషించాను. నేను చెప్పినట్లు మారు మాటాడకుండా సీతను విజన ప్రదేశంలో విడిచి వచ్చిన నీ కార్యనిర్వహణ శక్తికి మెచ్చుకున్నాను. శోకాన్ని పరిహరించి ధైర్యాన్ని గ్రహించాను. నీవాక్కులు సమయోచితాలేకాక అమృత స్రవంతులు. నాకు ఎంతో పుష్టితుష్టి కల్గించినై. అక్కరవేళల్లో నీ వంటి మక్కువ, మర్యాదలు కలబంధువు లభించటం నా అదృష్టం. చెప్పవలసింది చక్కగా చెప్పావు. నిక్కం చెప్పాలంటే నీతో సమానుడు ఇంకొకడులేడు. రాజనీతివేరు. పౌరనీతివేరు. నీవు రెండూ తెలిసినవాడవేకాక అనుష్ఠించుతున్నవాడవు. నా మదిలో ఇంకో చింత వుంది. అది నీకు వినిపిస్తాను. ఆ విధంగా నీవు అమలుపరుచు. నాలుగు దినాలుగా సభాకార్యక్రమాలు స్తంభించిపోయినై. కనుక, ప్రకృతులను, కార్యార్థులైన పౌరులను, స్త్రీ పురుషులనూ, కొలువుకూటానికి రమ్మని చాటింపు వేయించు. పురోహితుని పంపి అధికారిక జనాన్ని సకాలంలో దర్బారుకు హాజరు కమ్మని చెప్పించు. ప్రజాహితకార్యాల్లో, పాలనలో ఎవడు ప్రాలుమాలుతాడో, సోమరిగా ప్రవర్తిస్తాడో వాడు నిర్వాత నరకంలో కూలి నిరంతర శోకం పొందుతాడు. ఇప్పటికే క్రమమార్గం తప్పటం జరిగింది. వెంటనే సవరించుకోటం నావిధి. దీనికి ఉదాహరణగా పూర్వగాథ చెపుతా విను. బ్రహ్మణ్యుడూ, సన్నుతాచార్యుడూ, సత్యసంధుడూ అయిన నృగమహారాజు ధరణి పాలిస్తూవుండేవాడు. ఒక పుష్కరకాలంలో స్వర్ణాలంకృతాలైన ధేనువులను దూడలతో కోటిసంఖ్యలో బ్రహ్మణులకు దానం ఇచ్చాడు. ఆ గోవుల్లో, ఒకనిరుపేద,

నిర్యాగ్ని హోత్రుడు, వేదవిదుడు అయిన పాయని ఆవుకలిసింది. ఆ సంగతి రాజెరుగడు. ఉంఛవృత్తిలో బ్రతికే ఆ బాడబుడు క్షుధార్తితో గ్రామాలు సంచరిస్తూ, ఒకరోజున కనఖల గ్రామంలో తన ఆవూ, జీర్ణవత్సాన్ని ఒక భూసురుని ఇంటిముందు చూశాడు. ఎంతోకాలానికి పోయిన ఆవూదూడా కనుపించినందుకు ఆ పాయడు సంతోషించి "శబలా! ఎన్నాళ్ళకుకనుపించావు? నా వెంటరా. మనింటికి పోదాం" అని పిలిచాడు ఆవు స్వరం గుర్తించి దూడతో అతనివెంట నడిచింది ఇది ఆ ఇంటి యజమాని చూచి తగవుకు దిగాడు. "ఇదినాది. చాలాకాలంక్రింద తప్పిపోయింది. దీనికోసం ఎంతో వెతికాను. కనుపించలేదు. ఈనాడు ఇక్కడ చూచాను. పిలిస్తే వచ్చింది. తోలుకునిపోతున్నా. బలవంతంగా తీసుకునిపోవటంపా"దని ఒకడూ, "దీన్ని దానంగా నృగమహారాజిస్తే తెచ్చుకున్నానుకాని, నీ ఆవును దొంగతనంగా తోలుకునిరాలే"దని ఇంకొకడూ ఎడతెగని వాకాటానికి (పోట్లాటకు) దిగారు. చివరకు ఇద్దరుకలిసి మహారాజును చూడవచ్చారు. అక్కడి రాజమందిర రక్షకులు రాజదర్శనానికి పోనీయలేదు. కొలువుకూటంలో చూడవచ్చని సంవత్సర పర్యంతం అక్కడే వుండిపోయారు. అయినా రాజదర్శనంకాలేదు. తుదకు ఇద్దరికీ రాజుపై ఆగ్రహంవచ్చి "రాజా! పౌరుల కష్టసుఖాలు విచారించకుండా అంతఃపురమే సర్వసౌఖ్యసీమగా భావించి మా మొర తిరస్కరించావు. నీవు ప్రభువుగా వుండటం భూమికి భారం. ఇప్పుడు మాకు దర్శనం ఈయకుండా అగోచరుడుగా ఎలావున్నావో, ఆ విధంగానే సర్వ జీవకోటికి కానరాకుండా బిలంలో పెద్ద ఊసరవెల్లివై పడివుండు. నరుడు నారాయణుడనే మునులు ధర్మరక్షణార్థం ద్వాపరంలో జన్మిస్తారు. అందులో నారాయణుడు యదుకులంలో పురుషుడై పుడతాడు. ఆతనివల్ల నీకు విముక్తి కల్గుతుంది. అంతవరకూ నీగతి అంతే" అని శపించారు. ఆగోవునూ, దూడనూ, మరో పాయనకు దానంచేసి స్వస్థానాలు చేరుకున్నారు. ఆ ప్రభువు శాపఫలం అనుభవిస్తూ జీవిస్తున్నాడు. ప్రజల మంచిచెడ్డలు విచారించని ప్రభువులకు ఇట్టిగతే పడుతుందని ఈ కథ చెపుతున్నది. కార్యార్థులుగా వచ్చినవారు కలహిస్తున్నారంటే అందుకు కారణం ప్రభువుదోషం. కనుక కలహాలులేకుండా జనులపాలన చేసే రాజుకు మేలుకాని కీడురాదు. నాకోసం

ఎవరైనా కార్యార్థులై వచ్చారేమో తమ్ముడా! నీవేగి ముందు విచారించు"మని చెప్పాడు. సౌమిత్రి చిత్తం అన్నాడు.

## నృగోపాఖ్యానశేషం

"అన్నా! నేను తెలుసుకునివచ్చాను. ఎవరూ రాలేదని ద్వారపాలకులు చెప్పారు. యమదండ సదృశమైన విప్రుల శాపం ఏ విధంగా ఆయనకు తెలిసింది? తెలిసి ఏంచేశాడు? వివరంగా కథాశేషం వినిపించు"మని సౌమిత్రి అన్ననుకోరాడు. రాముడు "తమ్ముడా! ఆ బ్రాహ్మణులు ఆగ్రహంతో ఎలుగెత్తి అన్న మాటలు అక్కడ వున్న రాజపరిచారకులు విన్నారు. విన్నవెంటనే మహీపతికి మనవి చేశారు. శాప వాక్యాలు విన్న క్షితిపతి మంత్రి హిత బంధు బృందాన్ని రావించి పట్టరానిశోకంతో "పూజ్యులారా! ఘోరశాపానికి గురైనాను. ఆ భూసురులు నారద పర్వతులు. నన్ను శపించి అంతర్ధానమైనారు. ఇక శాపానుభవం నాకు తప్పదు. నా జ్యేష్ఠసుతుని, వసువును పిలిపించండి. రాజ్య క్షేమానికి అతని నభిషేకించండి. నాపై ఆదరంతో పెద్ద భూవివరాన్ని త్రవ్వించండి.అందులో జీవించటానికి పరిపడే పదార్థాలన్నీ వుంచండి. దానిలో పడివుండి వర్షఘ్నంగా, హిమఘ్నంగా, ఆతపఘ్నంగా కాలం గడుపుతాను"అని చెప్పాడు. మంత్రులు శిల్పుల రావించి అనుభవించవలసిన శాప లక్షణం చెప్పారు. అది విన్న శిల్పులు మూడు బిలాలు నిర్మించారు. ఏ కాలానికి ఏది అవసరమో, ఆ విధంగా ఆహార పానీయాలు సమృద్ధంగా వుండేట్లు మేలి ఫలవృక్షాలూ,పుష్పవంతాలైన లతలూ, ఆరోగ్య ప్రసాదన దక్షాలైన ఓషధులూ కల్పించారు. ఆ భూగృహం అర్ధయోజనం పొడవు, అందులో సగం వెడల్పూ కలిగి ఒక దానినుంచి వేరొక దానిలోకి పోయే మార్గాలతో వివరత్రయం పూర్తికావించి ప్రభువుకు తెలిపారు. కుమారుని రావించి "తండ్రీ! నా కోసం విచారించవద్దు. క్షత్రధర్మంతో వేదధర్మాన్నిరక్షిస్తూ ప్రజాపాలనం సలుపు. అపరాధ వేళానికి విపరీత శాపాన్ని విప్రులు ఇచ్చారు. ఇందుకు నీ వాగ్రహంచెందక, నా వలె ప్రమత్తుడవుకాక మెసలుకో. కాగలవి యేవో కలుగుతై. పోతగిన వేవో పోతై. పూర్వజన్మ కర్మ ఫలానుసారం సుఖదుఃఖాలు ప్రాప్తిస్తుంటై.

నీవు మాత్రం నీతిమంతుడవై పెద్దల పేరు నిలుపు"మని హితం చెప్పి బిల ప్రవేశం కావించాడు. ఆనాటినుంచీ భయంకర శాపానుభవం పొందు తున్నాడు.

## శ్రీరాముడు సౌమిత్రికి నిమి కథ చెప్పుట

ఈ విషయాన్ని ధృవీకరించే ఇంకో గాథ చెపుతా. వింటావా?" అని రాముడన్నాడు. "అన్నా! ఆశ్చర్యకరమైన గాథలు ఎన్ని విన్నా నాకు తృప్తి కలుగదు. అందులో నీవు వినిపిస్తుంటే నా కింకా ఉత్సాహం అధిక మవుతూంది. నీవు చెప్పేతీరులో ఎంతో ఆకర్షణ వుంది. అదికాక చెప్పటం వల్ల నీ శోకం మరుగుపడి ప్రకృతావస్థకు నీవు వస్తావు" అని సౌమిత్రి అన్నాడు."మన ఇక్ష్వాకువంశంలో జరిగిందే ఇది. ఇక్ష్వాకుచక్రవర్తి పన్నెండో కుమారుడు నిమి. ఆయన పరమధర్మ నిరతుడు. గౌతమాశ్రమప్రాంతంలో ఇంద్రపురాన్ని మించే వైజయంత మనే నగరాన్నినిర్మించి దీర్ఘ సత్రయాగం నిర్వహించాడు. ఆ క్రతువుకు తండ్రినే ఆహ్వానించాడు. వసిష్ఠమహర్షిని యజ్ఞ కార్యనిర్వహణానికి అర్థించగా, ఆయన "ఇంతకుపూర్వమే ఇంద్రునియాగానికి కార్యకర్తగా వరించబడ్డాను. అది పూర్తికాగానే నీవేత క్రతువు సాంతం చేయి స్తాను. అంతవరకు ఆగు"మని చెప్పాడు. అనంతరం ఇంద్రయాగార్థం వెళ్ళి పోయాడు. ఓర్చుకొనలేని నిమి అత్రిగౌతమాంగిరసుల పిలిచి వారికి కర్తృత్వం అప్పగించాడు. వారి తోడ్పాటుతో హిమవంతం పొంత తాను నిర్మించిన పట్టణానికి దాపుగా అయిదువేల ఏండ్లు జన్నం సాగించాడు. వసిష్ఠుడు అది ముగించి నిమియజ్ఞ వాటికకు వచ్చాడు. గౌతముని ఆధ్వర్య వంలో కడముట్టిన నిమియజ్ఞ క్షేత్రాన్ని చూచాడు. వసిష్ఠునికి ఆగ్రహం వచ్చింది. అంతలో దాన్ని అణచుకుని రాజు రాకకు ముహూర్తకాలం వేచి వున్నాడు. ఆ సమయం పగలు. నిద్రాసమయంకాదు. అయినా దురదృష్ట వంతుడైన నిమివి శ్రాంతి నిమిత్తం నిద్రిస్తున్నాడు. తన రాక తెలిపినవారూ లేరు. తనను పరామర్శించ వచ్చినవారూలేరు. అందువల్ల మళ్ళీ ఆయనకు ఆగ్రహం వచ్చింది. తప్పులకు దండన విధించే ధరణీపతి తప్పుచేస్తే దండించే దెవరు? అల్పం అయినా అపరాధం జరిగింది. "రాజా! వేచివుండ తగినంత కాలం వేచి చూచాను. నీవు రెండుదోషాలు చేశావు. నన్ను ముందుగా అర్థించి

నేను కాదనకుండానే మరొకరిని పిలిపించి నన్ను తిరస్కరించావు. విషయం చెప్ప వచ్చిన నన్ను ఇంట్లో వుండి చూడనైనా రాలేదు. ఈ దోషాలు క్షమార్హాలుకావు. కనుక నీవు అచేతనత్వాన్ని పొందుదువుగాక" అని భయంకర శాపం పెట్టాడు. ఆధ్వని విన్ననిమి ఆతురతతో లేచివచ్చి క్రుద్ధుడై "బహుకాలం శ్రమ చెందిన దేహం తేరుకుంటానికి నిద్రిస్తుంటే నన్ను మరణించుమని శపిస్తావా? నీవూ నావలేనే అచేతనత్వం పొందు. నా శరీరంవలెనే నీశరీరం కాంతి భంగం కాకుండుగాక" అని ప్రతిశాపం పెట్టాడు. దురాగ్రహం ఎంత వున్నతులనైనా ఎలా శిక్షిస్తుందో చూచావా? ఇరువురూ క్షమకోల్పోవటంతో ఎంత దారుణ కార్యం జరిగిందో గ్రహించు. కోపంకంటే మానవునకు విరోధి మరొకడులేడు" అని కథ ఆపివేశాడు.

## రాముడు వసిష్ఠ దేహధారణకథ సౌమిత్రికి చెప్పుట

సౌమిత్రి, అర్ధాంతరంగా కథ అన్న ఆపటంతో ఉత్కంఠ హెచ్చగా ఉక్కిరిబిక్కిరయ్యాడు. "అన్నా! అంతం చేయకుండా ఆపావెందుకు? మన మహర్షి శరీరంతో వున్నాడే? ఎలా దేహం వచ్చింది? ప్రభువేమైనాడు? అది కూడా చెప్పి నా ఆరాటం మాన్పు" మని అడిగాడు." వారు అన్యోన్యం శపించుకోగానే వాయురూపులై మింట సంచరించసాగారు. మహర్షి మరో శరీరాన్ని పొందే ఆకాంక్షతో తండ్రిని దర్శించటానికి సత్యలోకం చేరాడు. వాయురూపంతోనే బ్రహ్మకు అభివాదం పలికి, "తండ్రీ! నిమిశాపంవల్ల నే నచేతనత్వాన్ని పొందాను. శరీరాలు లేకపోతే ఎన్నో వ్యసనాలు చేరుకుంటై. కర్మలకు లోపం వస్తుంది. కనుక నాకు మరో దేహం ప్రసాదించు" మని అడిగాడు. "కుమారా! విచారించకు. మిత్రావరుణుల తేజంలో మిళితమై అయోనిజుడవుగా భూలోకంలో పుట్టు. మహిత తపశ్చర్యంతో నావశమై వుంటావు" అని చేయవలసిన కార్యం చెప్పి పంపాడు. వెంటనే వసిష్ఠుడు వరుణాలయానికి వచ్చాడు. మిత్రుడు వరుణుని సాయంతో రాజ్యపాలనం చేస్తున్నాడు. ఆ స మ య ం లో జ గ దే క సు ం ద రి యై న ఉర్వశి చెలులతో అక్కడకు రావటం జరిగింది. ఆమెను చూచి వరుణుడు తన వలపు తెలిపాడు. ఆమె "నన్ను ముందువాంఛించినవాడు మిత్రుడు. ఆయన కోరిక తీర్చటానికే వచ్చాను. నీవిప్పుడు నన్ను కోరుతున్నావు. మాట ఇచ్చి

తప్పటం పాడిగాదు" అని విన్నవించింది. ఆ మాటలకు వరుణుడు "ఓ సుందరీ! కామం నిగ్రహించుకోలేకుండా వున్నాను. ఈ బంగారు భృంగారువులో వీర్యం నిక్షిప్తంచేస్తాను" అనగా, ఆమె అందుకు అంగీకరించి, "స్వామీ! శరీరసుఖం మిత్రునకు కల్గుతుంది. హృదయం నీపైనే వుంటుంది. అదేకదా అసలుసౌఖ్యం" అని చెప్పింది. అప్పుడే జ్వాలదగ్నిశిఖకు తుల్యమైన తేజాన్ని కుంభంలో విడిచిపెట్టాడు. శాంతుడైనాడు. ఊర్వశి మిత్రుడున్న చోటికిపోయింది. ఆతడు జరిగిన కార్యం దివ్యదృష్టితో దర్శించి, "దుర్మార్గురాలా! నాకు మాటఇచ్చి మధ్యలో మనస్సు మార్చుకుని పరపువృత్తికి తల పడ్డావు. చేయరానిదోషం చేశావు. ఈ దోషఫలితాన్ని భూమిపై మర్త్యునికి పత్నివిగావుండి అనుభవించు. బుధునకు పుత్రుడుగా పుట్టిన పురూరవుడు కాశీరాజ్యం పాలిస్తాడు. ఓసి మతిహీనా! ఆతని సతివై కాలంగడుపు. అంత వరకు దివ్యత్వం నీకు లేకుండాపోతుంది" అని శాపం ఇచ్చాడు. చేసినపనికి సిగ్గుపడుతూ దేవవేశ్య కాశీనగరంచేరి, పురూరవుని ప్రథమ భార్యను వేడుకుని శాపాంతం అయ్యేవరకు రెండవ భార్యగా వుండి దేవలోకం చేరింది. ఆయన పుత్రుడు ఆయువు ఆరాజుకు నహుషుడు జన్మించాడు. ఇంద్రుడు వృత్రునిచంపి బ్రహ్మహత్యాదోషంతో పదవీభ్రష్టుడు కాగానె నూరువేండ్లు స్వర్గం ఇంద్రుడై పాలించాడు" అనిచెప్పాడు.

## వసిష్ఠుడు మైత్రావరుణుడై జన్మించుట

"అన్నా! మహర్షి మహీపతులు శరీరాలుదాల్చటం చెప్పలేదు.మధురాహారం కొసరికొసరి ఇవ్వాలన్నట్లు కథను ఖండఖండంగా విభజించి అపేక్షను ఎక్కువ చేస్తున్నావు. తరువాత జరిగింది కూడా చెప్పి సాంతం చేయు"మని ఉత్సాహపరుస్తున్న సౌమిత్రినిగాంచి నవ్వుకుని రాముడు "తమ్ముడా! వినే వాడి ఉన్ముఖతనుబట్టి చెప్పేవాడు కథ చెప్పాలి. అవకాశం దొరికిందని అదే పనిగా చెప్పుకుంటూ పోరాదు. పై కథ విను. ఆ మహాత్ముల తేజాలు ఘటనిక్షిప్తాలైనవి కదా? అవి కాలక్రమంలో వృద్ధిపొంది మానవాకారాలతో మహర్షులుగా మారినై. మొదట వుంచిన తేజంవరుణునిది కావటంవల్ల అగస్త్యుడు ముందుగా పుట్టి నేను నీ కుమారుణ్ణికానని చెప్పి తపస్సు నిమిత్తం అరణ్యానికి వెళ్ళాడు. తర్వాత కొంతకాలానికి వసిష్ఠుడు ఉభయ తేజోప్తితో

పుట్టాడు. అందుకే ఆయన్ను మైత్రావరుణుడన్నారు. ఆ తేజస్సును ఇక్ష్వాకు డాశ్రయించి తన పురోహితునిగా చేసుకున్నాడు. ఇది వసిష్ఠ మహర్షి తను ధారణవిధం. ఇక నిమి శరీరం పొందిన విధం వివరిస్తా. మహర్షి బ్రహ్మ ణ్యుడేకాక బ్రహ్మమానస పుత్రుడైనందున త్వరలో దేహాన్ని పొందగల్గాడు. నిమి చక్రవర్తి క్షత్రియ ధర్మాచరణుడు అయినందువల్ల కొంతకాలం అధి కంగా పట్టింది.

## దేవతలు నిమికోరిన వరాలిచ్చుట

వసిష్ఠ శాపంతో మరణించిన నిమి శరీరాన్ని ఋషులు సంరక్షిస్తూ గంధ మాల్యాంబరాదులతో చెడకుండ చేశారు. ఆయన చేసిన సుకృతం తక్కువ దేమీ కాదు. పాలనా లోపంలేని ప్రభువు. మహాదాని. వ్రతనిష్ఠుడు. అతని అకాల మరణం అందరినీ ఆందోళనలో ముంచింది. ఆవేశంతో భృగు మహర్షి ప్రత్యగాత్మగా నున్న నిమిని సంబోధించి "రాజా! నీవు పాపరహి తుడవు. నీవు తెలిసి చేసిన దోషం ఏదీ లేదు. నీవు ఏం కోరుతావో నాతో చెప్పు. అది నీకు అనుగ్రహిస్తా"నని అడిగాడు. భృగువు వాంఛ తీరుస్తా ననగానే సురలంతా "రాజా! ఈ శరీరంకాక ఏ శరీరంలోనైనా నీ జీవాన్ని ప్రతిష్ఠించుతాము. మాకు నీవు యజ్ఞ యాగాదిరూపంగా చేసిన హవిస్సు తృప్తి కూర్చింది" అని అన్నారు. వాయురూపంలో ఆ మాటలువిన్న నిమి "పూజ్యులారా! మీకు నాపై కలిగిన అనుగ్రహానికి ధన్యవాదాలర్పిస్తున్నాను. సమస్త భూత దృష్టుల్లో నిలవాలని నా కోరిక. అది తీర్చండి. అంతకన్నా నాకితరమైన కోరికలేమీలే"వని చెప్పాడు. "రాజా! నీవు కోరినట్లే జరుగు తుంది. నీవు వాయురూపంగా అందరినేత్ర పక్ష్మాల్లో నిలువు. ఈ కారణంగా భూతజాలం నేత్రనిమీలనం పొందుతుంది. అలతపోయేందుకు అనేక పర్యా యాలు రెప్పలు మూస్తూతెరుస్తూ ప్రాణికోటి సుఖిస్తుంది" అని వరప్రదానం చేసి సురలు స్వర్గానికి వెళ్ళారు. దేవతలు పోగానే ఋషులంతా నిమిశరీరంలో అరణివేర్చి మథించారు. ఆ మథనంవల్ల కలిగిన బిడ్డకు మిథి అని పేరు పెట్టారు. జనియించటంవల్ల జనకుడైనాడు. విదేహంవేళ వచ్చిన వాడుకనుక వైదేహుడని పేరు వచ్చింది. మిథి చేశారు కనుక ఆ ప్రదేశం మిథిలానగరం అయింది" అని కథావశేషం కావించాడు.

# రాముడు సౌమిత్రికి యయాతి చరిత్ర వినిపించుట

"అన్నా! ఎంత అద్భుత గాథ చెప్పావు? నిమి ప్రభువు క్షత్రియుడూ, బలశౌర్య ధురంధరుడూ, పైగా దీక్షితుడూ కదా? కోపం నిగ్రహించుకోక మహర్షిని ఎందుకు శపించాడో నాకర్థం కాలేదు" అని సౌమిత్రి తనకు కల్గిన శంకను చెప్పాడు. "సోదరా! కోపం అణచుకోటానికి ఎవరికీ సాధ్యం కాదు. అది అనేక ప్రమాదాలకు మూలకందం. నాకు తెలిసినంతలో ప్రమాద శాపాన్ని భరించి, తిరిగి శపించని శాంతమూర్తి యయాతి ఒక్కడే! అందరి రాజుల్లో ఆతడు సత్త్వగుణ పూర్ణుడని పేరొందాడు. ఆ కథ చెపుతా విను. నహుషునకు ప్రియనందనుడుగా యయాతి జన్మించాడు. ఆతనికి సమాన వయోరూప సౌందర్యాదులుకల ఇద్దరు భార్యలున్నారు. పెద్దభార్య శుక్రునికుమార్తె దేవయాని. రెండోభార్య వృషపర్వునికూతురు శర్మిష్ఠదానవి. ఆ ఇద్దరూ సంతానవతులైనారు. బిడ్డలు దర్పధనులు. పూరుడు శర్మిష్ఠ పుత్రుడు. యదువుదేవయాని సుతుడు. చిన్నభార్య పైమక్కువ కావటంచేత పూరుని ముద్దుగా ప్రభువుచూచేవాడు. పెద్దవాడైన యదువు తండ్రిచూపించే పక్షపాతం సహియించలేక పోయాడు. ఒకనాడు తల్లితో తనలోకల్గిన వేదన అంతా వెళ్ళబోసుకున్నాడు. "అమ్మా! నీవు భార్గవ వంశ రత్నానివి. మహారాజ జ్యేష్ఠ పత్నివి. ఈ జరుగుతున్న అవమానం ఇంతవరకు ఎలా సహించావు? ఎందుకీ వ్యర్థ జీవితం? రాజ్యానికి కాదగిన వారసుణ్ణికదా నేను? ఒక అచ్చటా? ముచ్చటా? మన ఇంటికి రావటం బొత్తిగా మానేశాడు. నిన్నూ నన్నూ గడ్డిపోచకంటే హీనంగా చూస్తున్నాడు. ఎప్పుడూ ఆమె ఇంట్లోనే వుంటాడు. ఆమె కొడుకునే ఆదరిస్తాడు. అన్నీ అక్కడే జరుగుతై. మనం ఈ బ్రదుకు బ్రదకటంకంటె చావటం మంచిది. నీవు రానంటే నేను ఏ అగ్నిలోనో పడిచచ్చి పోతాను. ఇక ఈ అవమానం భరించలేను. మనమిద్దరంపోతే రాజుకు పీడ విరగడై పోతుంది.ఆమెతో హాయిగా సుఖిస్తాడు" అని కంటికి మంటికి ఏకధారగా ఏడ్చే కొడుకును దగ్గరకు తీసుకుని "నాయనా!దుఃఖించకు.నీ సంతోషంకోసం ప్రతీకారం చేస్తాను" అని తండ్రిని తలచుకుంది. యథాత్వరతో ఆతడు వచ్చి నిల్చాడు. "అమ్మా! ఎందుకు నా రాక కోరావు?సంసారం సరిగా జరుగుతూందికదా?"అని ప్రశ్నించేయంగా

శుక్రుడు కుశలప్రశ్న చేశాడు. "తండ్రీ! నా దైన్యగాథ ఏమని నీతో చెప్పేది? నా అనుమతి లేకుండానే నా పరిచర్య చేసే శర్మిష్ఠను చిన్నరాణిగా నీ అల్లుడు చేసుకున్నాడు. ఆనాటినుంచీ నా మొగంగానీ, నా కొడుకు మొగంగానీ చూడటమే మానివేశాడు. ఏనాడు ఈ రాజుకిచ్చావో? ఒకనాడైనా వచ్చావా? నా మంచిచెడ్డలు తెలుసుకున్నావా? చచ్చానో, బ్రతికానో విచారించావా? ఇటు మొగుడికీ, అటు నీకూ కాని నేను బ్రతుకుపై రోసి బిడ్డతో ఆత్మహత్యకు సంకల్పించుకున్నాను. కడసారి నిన్ను చూచి మరణించుదామని నిన్ను తలచాను. నా కడుపు మంట వినిపించాను. దీనికి ప్రతీకారం నీవు ఏం చేస్తావో? చెట్టు మొదలు ఎండితే చిగుళ్లూ, ఆకులూ, పూవులూ తమంతతామే ఎండిపోతై. లోకోత్తర శక్తి సంపన్నుడవైన నీకే పంగనామం పెట్టిన రాజుకు నేనెంతా? నా బిడ్డెంత? నా ఇంటికి రాడు. నా బిడ్డను చూడడు. అన్ని ముద్దు ముచ్చట్లూ ఆమె ఇంట్లోనే. దాని మాయలోపడి నాతో ఒకమాటైనా పలుకడు. ఆయన భూభర్త. కనుక భూభర్త పుత్రిని కోరుతాడేకాని నక్షత్రాలు గుణించే వైరిబాపడి కూతురును కోరతాడా?" అని కఠోరంగా పల్కింది.

## యయాతి పూరునకు ముసలితనం ఇచ్చి అతని యౌవనం కొనుట

కూతురు చెప్పిన మాటలకు కావ్యుడు కోప ఘూర్ణిత లోచనుడయ్యాడు. వెంటనే యయాతి వద్దకుపోయి "రాజా! అగ్నిసాక్షిగా గ్రహించిన ఆలిని అన్యాయం చేస్తావా? సకలదానవ లోకగురుడనై, మహాతపస్సంపన్నుడనైన నన్ను అవజ్ఞ చేస్తావా? వంచకుడా! నీ పాక్షిక ప్రవర్తనకు ఇప్పుడే శిక్ష విధిస్తాను. ఏ యౌవన గర్వంతో నా కూతురును నన్ను తృణప్రాయంగా చూచావో అది నీకు లేకుండా పోతుంది. ఆ స్థానంలో వృద్ధత వచ్చి నిన్నాశ్రయిస్తుంది" అని శపించి ఆత్మజను ఓదార్చి అసురగురుడు అదృశ్యుడయ్యాడు. శుక్రుడుపోగానే అవక్రపరాక్రమవంతుడైన యయాతిని వార్ధకంవచ్చి ఆశ్రయించింది. సంతోషంగా గడవవలసిన కాలం జరాక్రాంతంగా గడపలేక రాజు పెద్దవాడైన యదువును పిలి

పించాడు. "నాయనా! యదువూ! మీ తాత ఆగ్రహంతో నన్ను జరాపీడితుడవు కమ్మని శపించాడు. నాకింకా విషయ సుఖాలపై వాంఛ నశించలేదు. ఇంకా కొంతకాలం సుఖించాలని వుంది. నీ యౌవనం నాకిచ్చి నా జర నీవు గ్రహించు"మని అడిగాడు. "ఏమన్నావు జనకా? నీ ముద్దుల పుత్రుడు పూరుడుండగా నేనెందుకు? అన్ని సుఖాలు అతడే అనుభవిస్తున్నాడు. కొంత కాలం ఈ జర కూడా అనుభవించనీ. కన్నతండ్రివై కూడ నన్ను బహిష్కృతుని చేశావు. కట్టుకున్న భర్తవై నా తల్లివి విడిచిపెట్టావు. పెద్ద భార్య అని కాని, రాజ్యానికి వారసుడనికాని ఆలోచించక దానవితో రాత్రింబగళ్ళుగడుపుతున్నావే? ముద్దు ముచ్చట్లకు పనికిరాని యదువు నీ వార్ధకం గ్రహించటానికి పనికివచ్చాడా? నీ కెవడు ప్రేమపాత్రుడో వాడే దీన్ని భరిస్తాడు. ఆట పాటలకూ, ఆనందానికి పూరుడూ, జర కొనటానికి యదువా? ఆహాహా! రాజా! ధర్మం నాలుగు పాదాల నడిపిస్తున్నావన్నమాట. దాయభాగం ప్రభువుగా బాగా పంచావు. నేనెంతమాత్రం ఒప్పుకోను" అని తిరస్కారంతో వెళ్ళిపోయాడు. పూరుణ్ణి పిలిచి యదువును కోరినట్లే రాజు కోరాడు. ఆ పలుకులకు "ఆహా! ఎంత ధన్యుణ్ణి? మహారాజ స్థానంలో వుండి అందరి కోరికలు తీర్చే నీవు నన్ను కోరటం నా సుకృత విశేషంగా భావిస్తాను. కాదంటానికి నాకు నోరెలా వస్తుంది? నీ మనసైనంత కాలం హాయిగా సుఖించు"మని చెప్పాడు. అందుకు ఎంతో ఆనందపడి తన జరను కుమారునకిచ్చి ఆతని యౌవనం గ్రహించి యయాతి బహుకాలం విషయ సుఖాలు అనుభవించి తృప్తుడై చిన్న కొడుకును పిలిపించి "తండ్రీ! పుత్రుడవంటే నీవు. ఇంత కాలం నీ యౌవనాన్ని నేను పొంది వృద్ధ బాధ నీకిచ్చాను. ఇక సంసార సుఖాలపై రోత పుట్టింది. గతించిన యౌవనకాలం అంతా నీకు లభించుగాక. నా జర నేను కైకొంటున్నాను. నీ వయస్సు నీవు తీసుకో. నేను చెప్పినమాట మన్నించినందుకు నీకే రాజ్యాభిషేకం చేస్తాను. నీ యశస్సు చిరకాలం విశ్వంలో వుండేట్లు దీవిస్తున్నాను" అని అప్పటికప్పుడు రాజ్యాభిషేకం చేశాడు. "దుష్టుడా! నేను కోరింది సహించరానిదైనా, నే చేసిన పనులు కష్ట కారణాలైనా, నీవు యోగ్యుడవైతే ఓర్చుకోవాలె. కాని జనకుడని చూడక, సార్వభౌముడని ఆలోచించక నన్ను నిందించావు. తిరస్కరించావు.

నీవు తనుజుడవు కావు. ఒక దనుజుడవు. ఈ మాత్రం సహనంలేని నీవు రాజ్య పాలనకు అర్హుడవెలా అవుతావు? నీ తమ్ముడు పోగొట్టుకున్న దేమిటి? నన్ను తిరస్కరించి నీవు సంపాదించిందేమిటి? రెండింటికి చెడిన రేవడివైనావు. మహా కఠినాత్ములు, క్రూరకర్ములైన యాతుధానుల సంతానంగా పొందు. చంద్రవంశం నీ సంతతితో వృద్ధి పొందదు. పూరుని సంతానం నా వంశాన్ని ఉద్ధరిస్తుంది" అని కఠినంగా శపించి తపస్సుకొరకై ఆశ్రమానికి తరలిపోయాడు. తర్వాత కొంత కాలానికి స్వర్గం చేరాడు. తండ్రి తనపై మోపిన రాజ్యభారం ధర్మంగా మోస్తూ, కాశీ రాజాన్ని ప్రతిష్ఠానపురం రాజధానిగా పెక్కేండ్లు పాలించాడు. యదువు తండ్రి శాపంవల్ల దనుజ సంతానం పొంది, బహిష్కృతుడై, క్రౌంచ పర్వత సమీప దుర్గంలో కాలం గడిపాడు. మించిన క్రోధంతో శుక్రుడు శపించినా యయాతి మరల శపించలేదు. విన్నావా యయాతి శాంతి? మనకు నృగదోషం రాకుండా చూచుకోవలసి వుంటుంది" అని కథ సంపూర్ణం చేశాడు. కుసుంభ వస్త్రావకుంఠిత కోమలాంగివలె ఆకసం సాంధ్యరాగాన్ని ధరించింది.

## చ్యవనాదులు శ్రీరాముని దర్శింప వచ్చుట

కాలగమనం అవ్యాహతంగా గడిచి పోతూంది. ప్రజలలో, బంధువులలో పచ్చి పచ్చిగా వున్న సీతా పరిత్యాగ దుఃఖం మాను పట్టింది. సీతారాములు నిష్కళంక చరిత్రులన్న సత్యం క్రమంగా బలపడింది. అజ్ఞానంతో చేసిన అప్రస్తుత ప్రసంగానికి అన్నవారంతా పశ్చాత్తాపంతో పాప పరిహారం చేసుకున్నారు. సమశీతోష్ణంగల వాసంత రాత్రులు వచ్చాయి. ఒకనాడు ఉదయకాల కృత్యాలు నిర్వర్తించి "ఎవరైనా కార్యార్థులై వచ్చారేమో కాంచు" మని సుమంత్రునితో రాముడన్నాడు. సుమంత్రుడు వెలుపలికి వచ్చిచూచి లోనికి పోయాడు. "ప్రభూ! మహర్షులు వచ్చి ద్వారంవద్ద వేచి వున్నారు. వారంతాచ్యవన మహర్షిని వెంటగొనివచ్చారు. వారిరాక ఏదో పెద్ద కార్యభారం కలదిగా కనుపిస్తూంది. యమునా తీరంనుంచి మీ దర్శనం కోసం వచ్చారట. మీతో అత్యవసరంగా ముచ్చటించవలసి వుందట. సెలవైతే వారిని ప్రవేశ పెడతా"నని సుమంత్రుడు చెప్పాడు. అనుమతినంది వెంట వచ్చిన వార్తాహరుడు వారిని లోనికి కొనివచ్చి వెళ్ళిపోయాడు. వచ్చిన వారందరకూ

ఆతిథ్యం ఇచ్చి ఆసీనుల కావించి నిల్చిన రామునిగాంచి మునులు, "సమస్త తీర్థ పరిపూర్ణ సత్కృతమైన పాత్రాలూ,ఫలాలూ కానుకగాఇచ్చి దీవించారు. అందుకు రామవిభుడు ఆనందించి "మహాత్ములారా! ఏదో కార్యార్థకంగాకాక శతసంఖ్యలో ఇంతదూరం మీరెందుకు వస్తారు? నావల్ల కాదగిన పని ఏదో తెలుపండి. ఈ రాజ్యం, ఈ దేహం, ఈ ఐశ్వర్యం, ఈ జీవితం బ్రహ్మణ్యుల సేవా నిమిత్తం నా పెద్దలచే పరిగ్రహించాను. మీరు సర్వశక్తి సంపన్నులు. మీకు కాని కార్యం ఏదీ వుండదు. మాబోటివారికి అవకాశం కల్పించి అనుగ్రహించటానికే వస్తారు. అగస్త్య మహర్షి మొదలైన వారంతా రాక్షస సంహారం చేయలేకనా నాపై భారం మోపింది? కౌశిక మహర్షి తన యాగాన్ని రక్షించుకోలేకనా నన్ను తీసుకుని వెళ్ళింది? మీరాక నా పూర్వకృత పుణ్య పరిపాకంగా భావిస్తున్నాను. ఆలస్యం లేకుండా ఆజ్ఞాపించండి" అని అంజలించాడు.

## చ్యవన మహర్షి లవణుని వృత్తాంతం రామునితో చెప్పుట

శ్రీరాముని వినయ భాషణాలకు మునులంతా పరమానందభరితులైనారు. "రామచంద్రా! రాజవంశతిలకా! ఈ విధంగా పలకటం నీకే సాధ్యమైంది. మా రాకచూచి రాజులందరూ భయకంపితులై తమ శక్తిలేమిని ప్రదర్శించారే కాని మా వాంఛితం నెరవేరుస్తామని చెప్పలేకపోయారు. మావచ్చిన పని ఏమిటో వినకుండానే అభయదానం ఇచ్చావు. ఈ ధర్మబుద్ధి, ఈ త్యాగనిష్ఠ రఘువులకే చెల్లింది. ఈ ఒక్క మాటలోనే నీకు బ్రహ్మణ్యులపై ఎంత కరుణ వుందో, అభిమానంవుందో తేటతెల్లమైంది. కనుక మా కార్యం నీ చేత నెరవేరినట్లే. ఇక వచ్చిన పని ఎటువంటిదో వినిపిస్తాం. పూర్ణంగా విని మా భయం బాపి శాంతి ప్రసాదించు" అని మునులు చెప్పగా, రాముడు "పూజ్యులారా! మీకా భయం? అది ఎటువంటిది? ఇంద్రియజేతలు. పరమర్షులు. భయమే మిమ్ముల చూచి భయపడుతుండగా మీకు భయం ఎలా వచ్చింది?" అని ఆతురతతో ప్రశ్నించాడు. మునులు కనుసన్నలతో చ్యవనుని వంక చూచారు. అది గుర్తించిన మౌనిభార్గవుడు చ్యవనుడు "ప్రభూ! నేను చెప్ప

బోయే విషయం చాలా ఘోరమైంది. కృతయుగంలో, లోల అనే పేరుగల దైత్య వనితకు మధునామం గలవాడు పెద్దకొడుకు. అతడు విప్రులకు రక్షకుడుగా వుండేవాడు. మహా బలశాలి. పరినిష్ఠితమైన మనస్సుతో దేవతల నారాధించి, వారి దయకు పాత్రుడై, అతులిత తపం గౌరీపతి కూర్చి పెక్కు వత్సరాలు సలిపాడు. అతని తపోనిష్ఠకు ఈశుడు ప్రసన్నుడై మానితమూ, దీప్తిమంతమూ, అప్రతిహతమూ, అమ్యానబలమూగల శూలం, తన శూలం నుంచి పుట్టించి ఇచ్చాడు. ఆ శూలం ఇస్తూ శంకరుడు "దైత్యపతీ! నీవు సర్వ దేవతా ప్రీతిగా తపం చేసినందుకు మెచ్చాను. నీవు కోరినట్లు శూలంఇచ్చాను. నీ వికముందు ఋషీశ్వర సురేశ్వరాది దేవగణాలపై కిన్క వహించి దీన్ని ప్రయోగిస్తే వ్యర్థమవుతుందే కాని సార్థకం కాదు. నీవు యుద్ధంలో శత్రువుపై ప్రయోగిస్తే అతని వధించి తిరిగి నీ చేతిలోకి వస్తుంది" అని నిర్ణయించాడు. అందుకు దైత్యుడు "ఈ మహా సాధనం వంశపారంపర్యంగా నా ఇంట ఉండేట్లు అనుగ్రహించు"మనగా, "అలాజరగదు. నీ అనంతరం నీ కొడుకుకు మాత్రం వుంటుంది. అతని తరువాత మళ్ళీ నా శూలంలో లీనమవుతుంది"అని పల్కి అంతర్హితుడైనాడు. అది పొంది దైత్యుడు గృహానికి వచ్చి సర్వవిధ పూజాదులతో నిత్యం అర్చిస్తూ వుండేవాడు. ఆ శూలాన్ని పూజించే నిమిత్తం పెద్ద మందిరం ప్రత్యేకంగా నిర్మించుకున్నాడు. ఇదిఇలా వుండగా, విశ్రవసు వంశంలో అనలునకు జన్మించిన కుంభీనసి అనే కోమలాంగి సౌందర్యవతిగా పేరెన్నికకెక్కింది. ఆమెను సతిగావరించి, భీకరబలసత్త్వసంపన్నుడైన కుమారుని కన్నాడు. వాడు చిన్నతనంనుంచీ తలిదండ్రులకు గుండెల్లో కుంపటిగా ప్రవర్తించసాగాడు. వాడిచేష్టలకు తండ్రి ఎంతో వ్యథచెందాడు. కోపగించాడు. దూషించాడు. ఎంతచేసినావాడు తన దుష్టచేష్టలు మానలేదు. కన్నమమకారం కలత పెట్టగా విసిగి వూరుకున్నాడు. కొన్నాళ్ళకు మధు మరణించాడు. మరణించే సమయంలో తాను పూజించే శూలమహిమ తెలిపాడు. ఆనాటినుంచీ ఆ క్రూరుడు లోకాన్ని పీడిస్తున్నాడు. అందులో మునులంటే వాడికి పేలపిండి. వాడే మా ప్రాణాపహారి. విన్నావుగా ప్రభూ! మేం వచ్చిన పని? వాడిని చంపి శ్రుతి రక్షకులైన మునుల కాపాడు" అని మొర పెట్టాడు. "స్వామీ! మరేం భయంలేదు. ఇంతకూ వాడిపేరుగాని, వాడుచేసే

దుష్ట కార్యాల విధంగాని చెప్పలేదు" అని ప్రభువు ప్రశ్నించాడు. "నిజమే ప్రభువూ! వాడిపేరు లవణుడు. వాడు మాంసాశనంకంటే మానవాశనమే కోరుతాడు. అందులో తాపసుల మాంసమంటే తగని ప్రీతి. అందుకేవాడు ఆశ్రమాలపై దాడి చేస్తాడు. స్త్రీ పురుష భేదం లేకుండా చంపితింటాడు. అచ్చటి ప్రభువుల నెందరినో ఆశ్రయించాం. వాళ్ళు సహాయపడలేదు సరి కదా ఆ విషయాన్ని విని భరించవేసున్నారు. నీ వా క్క ద వే అభయం ఇచ్చావు. పంక్తి కంఠ సంహారం చేసిన పరమ వీరుడవని విని వచ్చినందుకు ఫలితం పొందాము. వాడి ఆహార విహారాలు అతిరౌద్రాలు. అతని సహజ హారం మనుజవ్యాఘ్ర మృగ ద్విపాదులు. భక్షించే సంఖ్య దినానికి వేలుదాటు తుంది. కాపురం మధువనీ దేశం.

## శత్రుఘ్నుడు లవణుని చంపుటకు పంపుమని రాముని కోరుట

అతడు ఆకలి సమయంలో అడవులకు వస్తాడు. ప్ర ళ య ం లో కాలుడు ప్రాణికోటిని కసిమసంగినట్లు నోరు తెరిచి ఒక్కసారే మ్రింగు తాడు. ఇది మా వచ్చిన పని. మేమిచ్చిన ఇతివృత్తం దుష్టుడైన లవణాసురు నిది. నీ విచ్చినది మాకు అభయం. మేమిచ్చేది నీకు సంగ్రామ విజయ శుభా శీస్సులు" అని చ్యవనుడు చెప్పాడు. రాముడు ఆ వృత్తాంతం విని సర్వ కోణాల్లోనుంచి దర్శించి "మహర్షులారా! ఇక మీకు శత్రుభయం లేదు. మీ కార్యక్రమాలు నిర్విఘ్నంగా సాగుతై. వచ్చిన కార్యం శుభంగా ముగుస్తుంది." అని గంభీరంగా పల్కి లేచి నలువైపులా చూచాడు. "నా తమ్ములైన భరత శత్రుఘ్నుల్లో ఈ కార్యభారం ఎవరు మోస్తారో వారులేచి నావద్దకు రావాలె" అని అన్నాడు. భరతుడు లేచి "అన్నా! ఈ కార్యానికి ఇద్దరెందుకు? చిన్న వాడు శత్రుఘ్నుడు. నేనున్నాగదా నెరవేర్చటానికి నీయాజ్ఞ. సెలవిస్తే నేనా కార్యం చక్కబరుస్తా"నంటూ లేచి సమీపించబోతుంటే శత్రుఘ్నుడు లేచి అన్నను వారించి "పెద్దన్నా! నా మనవి విని నీఇష్టం వచ్చినట్లు నిర్ణ యించు. నా అన్న సౌమిత్రి నిరంతరం నిన్నాశ్రయించి నీపనులు నెరవేర్చి కృతార్థుడైనాడు. ఈ అన్న నీ యాజ్ఞ తలదాల్చి పదునాల్గు సంవత్సరాలు

జటియై, సుఖనిరోధియై అయోధ్య పాలించి అనుగ్రహాన్ని సా ధి ం చా డు. ఇంతవరకు ఏదీలేకుండా కేవలం నీ అపార సోదరభావామృతం పానంచేస్తూ నేను బ్రదుకుతున్నాను. ఈనాడికి నా అదృష్టంకొద్దీ చేరవచ్చిన నీ ఆజ్ఞా పాలనా సుకృతాన్ని నాకు లేకుండా చేయవద్దు. ఈ అన్నయ్యా నీవు వచ్చే వరకూ పొందిన కష్టాలు నేను స్వయంగా చూదాను. నేలపడక. నియత భోజనం. నారవస్త్రాలు. జటాధారణం. పాద సంచారం. కేవల ఫల భక్షణం. ఇప్పుడైనా నీ భుజచ్ఛాయలో విశ్రాంతి పొందనీయి. అయినా, ఈకార్యాన్ని మీయంతవారు చేయవలసిన అవసరం కూడా లేదు. నేను చేస్తాను. నాపేరు అదే కదా? ఈ ఒక్క అవకాశం నీ చిన్నతమ్మునకు ఇవ్వటం ధర్మమూర్తికి నీకు తగిన పని" అని వినయంతో చెప్పాడు.

## రాముడు శత్రుఘ్నుని మధురాపురి పతిగా ఆజ్ఞాపించుట

చిన్నవాడైన శత్రుఘ్నుడు అన్నకు చేసిన విన్నపం అందరినీ హర్షంలో ముంచింది. ఆ మాటల పొంకం, అందులో వున్న బింకం, ఆ వినయం, అందులో వున్న ఆత్మవిశ్వాసం, కారణం చూపిన కోరికా, కోరికలో కొట్టవచ్చినట్లు కనపడే శూరలక్షణం రాముడంతటి గంభీరమూర్తిని, చండశాసనుణ్ణి సమ్మతితో తలవూచేట్లు చేసినై. రాముడు మదమాతంగం వలె నడచి వచ్చాడు. తనివితీర ఆలింగనం చేసుకున్నాడు. ఆ ఆలింగనంలో శాంత సముద్రం, నిక్షిప్త తపోగ్నికుండం సుమిత్రాదేవి దర్శనం కలిగింది. నిర్వచన మహాగ్నికీల, సాకార సతీత్వ ఫలం, నిద్రాయోగ సంస్థాపిత రజనామకీర్తి కౌముదీపూర్ణం, ఐన ఊర్మిళ గోచరించింది. "అహా! శత్రుఘ్నుడు ఇంతవాడా? ఇతనికి తల్లి ఆశీస్సులు, వదిన చల్లని ఆదరణ పెట్టని కోట. ఈతడు ఈ పనికి అన్నివిధాలా అర్హుడు" అని నిర్ణయించుకున్నాడు. "తమ్ముడా! నీవు కోరినట్లే జరుగుతుంది. నీకు శత్రుశమనానికి అనుజ్ఞ ఇచ్చాను. నీకిపుడే మధుపురానికి ప్రభువుగా అభిషేకం చేస్తాను. భరతుడు నా వద్దనే వుంటాడు. శత్రుసంహారానంతరం నూతన నగరం నిర్మించు. అక్కడ ప్రజారాజ్యం స్థాపించు. ఏ ప్రభువు ఎవనిచేత శత్రుక్షయం

చేయించి రాష్ట్రం సంపాదించుతాడో ఆ ప్రభువు అతనికి అది ఈయటం ధర్మం. అలా చేయకపోతే ఆ ప్రభువు నిరయానికి పోతాడు. నీవేమీ బదులు చెప్పకు. చిన్నవాళ్ళు జ్యేష్ఠునకు ఎదురాడరాదు. చెప్పినట్లు చేయటం ధర్మం. ఇది దైవసంకల్పం. తిరస్కరించవద్దు. నేను అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. వసిష్ఠాది మహర్షులు, సుమంత్రాది మంత్రులు నీకు వేదవిధిగా పట్టాభిషేకం నెరవేరుస్తారు" అని చెప్పాడు. శత్రుఘ్ను డెంతో సిగ్గుతో శిరం వంచుకుని ఏమోచెప్ప ఉద్యుక్తుడయ్యాడు.

## పట్టాభిషేకం ఇష్టపడక శత్రుఘ్నుడు పరితపించుట

"అగ్రజా! నన్ను ముందు క్షమించు. ఆపై నా విన్నపం విను. నీవు ప్రేమతో నాకు రాజ్యం కట్టపెడతానన్నావు. నాకంటే పెద్దవారు ఇద్దరు అన్నలున్నారు. వారికిలేని తొందర నాకేం వచ్చిందని ఈ భారంమోప తలుచు కున్నావు? నీవంటి ధర్మనీతిజ్ఞునకు ఈ పని ధర్మంగా తోచటం నా దుర దృష్టం. నీ ఆజ్ఞ దాటను. శత్రు సంహారానికిపోతాను. కార్యం సాధిస్తాను. జ్యేష్ఠుని మాటకు పిన్నలు ఎదురు చెప్పరాదన్న సూక్తి ని నోటనే కాక శ్రుతుల్లో కూడా విన్నాను. తెలిసికూడా విపరీతబుద్ధితో భరతుని కాదని పలికాను. ఇది పెద్దలపట్ల అవజ్ఞతగా భావించక, లోకసామాన్యంగా వారిపట్ల గల గౌరవానికి ప్రతీకగా భావించి పలికానే కాని, ఇంత దారుణపరిణామానికి దారితీస్తుందని, ఇంత క్రూరదండనకు గురికావలసి వస్తుందనీ అనుకోలేదు. నీ అభిమతం తెలుసుకొనక లవణుని నేను చంపుతానంటమే తప్పు. అందులో నా అహంకారం నా శక్తి సామర్థ్య ప్రదర్శనా కాంక్ష ఇమిడి వున్నందున ఈ శిక్ష నాకు శిరోధార్యమే. పెద్దలతోనూ, అందులో ప్రభువులతోనూ వ్యవహరించేటప్పుడు ఎంతో సహనం అవసరం. నేను చిన్నవాడను కావటం చేత, రాజనీతి వదలి బంధుత్వంవల్ల ప్రాప్తించిన చనవుతో స్వతంత్రించి నందుకు పొందవలసిన శిక్షే పొందాను. ఇది నీ ధర్మపాలనకు ఉదాహరణగా నిల్చుగాక. ఈ దండనం చాలు. ఇంకో శిక్షమాత్రం విధించవద్దు. నాకు

రాజ్యం వద్దు. అభిషేకం వద్దు. నీ పాదసేవలో నా అన్నలతో కూడి తరిస్తాను. అధర్మపాపం నాకు రాకుండా అనుగ్రహించు. నీవు దాశరథివే కాక దయాశరథివి. తప్పకుండా నా మాట మన్నిస్తావని ఆకాంక్షిస్తున్నాను" అని చెప్పగా రాముడు సంతసించి లక్ష్మణునివైపు సాభిప్రాయంగా చూచాడు.

## శ్రీరాముడు శత్రుఘ్నుని మధుర కభిషిక్తుని చేయుట

"సౌమిత్రీ! భరతునితో కూడి సచివ సేనానాయక పురోహితమహర్షి పౌర బంధు బృందాన్ని వెంటనే అభిషేక సంభారంతో ఇక్కడ సమావేశ పరుచు" అని ఆజ్ఞ రాము ప్రభువు చేశాడు. వెంటనే సోదరులు తగిన వారిని నియమించి క్షణాలపై అందరినీ రావించారు. విద్యుక్తంగా అందరి సమక్షంలో శత్రుఘ్నుని మధుపురానికి అభిషిక్తుణ్ణి చేసి రాముడు ఆశీర్వదించాడు. సుమిత్రావసిష్ఠాదులు అభిషేకించగా రాముడు భాసించినట్లు, రాముడు అభిషేకిస్తే శత్రుఘ్నుడు భాసించాడు. పౌరులు ఆనందించారు. బ్రాహ్మణులు సంతుష్టిచెందారు. తల్లులు ముగ్గురు పరమానందభరితలైనారు. యమునా తీరవాసులైన మునులు తమ అపకారి లవణాసురుడు ఆ క్షణమే హతుడైనట్లు తమ కష్టాలు గట్టెక్కినట్లు ప్రమోదంపొందారు. భరతుడు పట్టరాని ప్రేమతో కౌగలించుకుని "తమ్ముడా! అన్న ఎంత ధర్మజ్ఞుడో, అంత దయా హృదయుడు. అంత దక్షుడు. ఆయన ఏ పని చేసినా వేలెత్తి ఎవ్వరు విమర్శించే అవకాశం ఇవ్వడు. నేను అన్నయ్యను రాజ్య పరిగ్రహణం చేయుమని కోరే నిమిత్తం వెళ్ళినప్పుడు ఎందరు ఎన్ని విధాల వాదించినా వినక నాకు పాదుకలు ప్రసాదించిన మేధావి అని నీకు తెలుసు. మనకు ధర్మాధర్మాల పేరుతో వ్యక్తిత్వ ప్రదర్శనవద్దు. త్రికరణశుద్ధిగా అన్నగాకాక, ప్రభువుగా, దైవంగా ఆరాధించుదాం. ఆయన ఏంచెపితే అది చేద్దాం. నీవు వ్యతిరేకంగా జరిగిందని కలలోనైనా భావించవద్దు. శరీరం ఏంచేస్తున్నా, మనస్సు అన్న చరణరాజీవ ద్వయంలో లీనంచేయి సర్వశుభాలు తమంత తామే చేకూరుతై" అని చెప్పి ఆనందాశ్రువులు రాల్చాడు. సౌమిత్రి తమ్ముని పట్టాభిషేకం ముగియగానే "ఏమి రామచంద్రుడు? ఏమి నిర్ణయాలు? ఏం సాహసం? ఏం దయ? ఏం నిర్దయ? రవిపుత్రుని స్నేహంగానే కిష్కింధకు రాజును చేస్తానన్నాడు. వాలిని చంపుతానన్నాడు. విభీషణునికి మిత్రులు ప్రతిఘటిస్తూన్నా

లంకా రాజ్యానికి ప్రభువుగా ముందే అభిషేకించాడు. మానవబుద్ధికి అతీతంగా మానవతి అయిన భార్యను పరిత్యజించాడు. నా తమ్ముడు ఎంత వేడుకున్నా వినకుండా శత్రుమర్దనం కాకముందే పట్టంకట్టాడు. ఇంతవరకు విన్నగాథల్లో ఏ ప్రభువుగానీ, ఏ దేవతగానీ ఇలా చేసినట్లు లేదు. ఈ మహామూర్తి నిజంగా కారణజన్ముడు కాకపోతే ఇటువంటి అత్యాశ్చర్యకర కార్యాలుచేయటం సాధ్యమా?" అని భావిస్తుండగా భరతుడు చెప్పిన మాటలు విన్నాడు. ఆ వాక్కులు వేదవాక్కులవలె తిరుగులేనివిగా వున్నై. వెంటనే ఆ బోధ తమ్మునికేకాక తనకూ అన్వయిస్తుందని తలచాడు. తమ్మణ్ణి తాను దీవించాడు. ఇంతలో శత్రుఘ్నుణ్ణి రాముడు తన అంకంలో కూర్చోబెట్టుకున్నాడు.

## రాముడు తమ్మునకు నారాయణాస్త్రం ఇచ్చి లవణుని చంపే మార్గం చెప్పుట

"నాయనా! శత్రుఘ్నా! నీ మాట మన్నించలేదని బాధపడవద్దు. నీ కంటే నీ అన్నలు ఉన్నత స్థానంలోనేవున్నారు. నేను భరతుణ్ణే పంపతలుచుకుంటే "తమ్ముడా! నీవే ఈ కార్యం చేయు"మని చెప్పేవాణ్ణి. నా వుద్దేశం నిన్ను పంపాలనే. అందుకే ఇద్దరిపేర్లు కలిపి అన్నాను. నీకిప్పుడు దివ్యాస్త్రం ఇస్తున్నాను. శత్రువును దీనిచేతనే వధించు. మహార్ణవంలో స్వయంభువు, దేవుడు, అజితుడు, సర్వ సురవర్గానికి అదృశ్యుడై వటపత్రంపై శయనించి వున్న సమయంలో మధుకైటభాసుర మథనంకోసం ఉగ్రరుషతో దీన్ని సృజించాడు. సర్వ రాక్షస సంహారం, లోకసృష్టి ఈ శరశక్తి చేతనే జరిగింది. మధుకైటభ సంహారమే జీవుల సుఖానికి కారణంగా పరివర్తింపచేసింది. దీని మహిమ విన్నావు కదా? బలవంతుడైన పంక్తిముఖునిపై కూడ ఈ అస్త్రం ప్రయోగించలేదు. జగత్సంక్షోభం సంభవిస్తుందనే తలంపుతోనే విరమించాను. ఇప్పుడు దాని అవసరం వచ్చింది. వాడు షున్నివారణార్థం, ఈశ్వరదత్త శూలాన్ని పూజామందిరంలో వుంచి స్వస్థానం వదలి అరణ్యాలకు పోతాడు. శత్రువు ఎవరైనా వచ్చి పోరికి పిలిస్తే శూలం తీసుకుని తల పడతాడు. ఇది అతని దినచర్య. నీవు వాడు గ్రాసార్థం శూల రహితంగా

బయటకెళ్ళినవేళ గుర్తించి యుద్ధానికి పిలువు. ఇప్పుడే వస్తానని పురంలోకి ప్రవేశిస్తాడు. అప్పుడు వాడిని సింహద్వారం ముందే ఎదిరించి సంహరించు. వేరే మార్గంతో వాడిని వధించటం జరగని పని. ఈశ్వరదత్త శూలం దురతిక్రమం. అది వాని చేతిలో పడకముందే సంహరించాలి. అప్పటికి ఇతర ఆయుధాలతో చావడు. అందుకే నారాయణాస్త్రం ఇచ్చింది. ఇది ఆ దుష్టుణ్ణి చంపే ఉపాయం. ఏమరకు. నీవు మాతంగ శతాన్ని, రెండు వేల రథాలను, నాలుగువేల గుర్రాలను, నానా పదార్థాలను, నట నర్తకావళినీ, నియుత హేమాన్ని, వ్యాపారులను నీతో తీసుకునిపో. హిత సంభాషణలతో వారిని సంతోషపెట్టు. సాహసులకు సంప్రదాన రూపంగా తృప్తికూర్చు. ఆ విధంగా చేస్తే రణంలో తమ సర్వశక్తులు ధారపోసి ప్రభువు విజయానికి తోడ్పడతాయి. వారికి తలిదండ్రులు కానీ, భార్యలుకానీ, హితులుకానీ, స్వీయ పదార్థాలుకానీ ఉండవు. కనుక అన్నీ నీ ఆదరంలోఉన్నట్లే భావించాలె. ముందుగా సైన్యాన్ని పంపించు. అది గంగదాటి నీ కోసం నిరీక్షిస్తుంటుంది. గ్రీష్మం గడిచేదాకా అక్కడే వుండేట్లు కట్టడిచేయి. నీవు కేవల శరచాపధారివై, పరులు గురుతింపకుండా ప్రయాణం సాగించు. నీ రాకకానీ, నీ సైన్యం రాకకానీ ఆ దుష్టుడు తెలుసుకోరాదు. ఏమాత్రం వాడికి అనుమానంకల్గినా కేల శూలం లేకుండా బయట తిరగడు. ఈ పూజ్యులు వహాధినితో కలిసి ముందుగా ప్రయాణిస్తారు. గంగ చేరేదాకా నీవు బయలుదేరవద్దు. వారు జాహ్నవి దాటగానే నీవు ఒంటరిగా బయలుదేరి వెళ్ళు. వర్షఋతువు వచ్చేవరకు తొందరపడవద్దు. వానకాలంలో శత్రువులు యుద్ధానికి రారని శూలం లేకుండానే ఆహారం కోసం నిర్భయంగా తిరుగుతుంటాడు. నీ వాక్కడవే ద్వారంవద్ద నిరోధించి వధించు. సేనను ఉపయోగించవద్దు."

## శత్రుఘ్నుడు సేనలను ముందు పంపి తర్వాత తాను పోవుట

అని వ్యూహరచనచేసి రాముడు తమ్మునకుబోధించాడు. శత్రుఘ్నుడు అన్న వాక్యాలను శ్రద్ధగా విన్నాడు. "అక్షరశః నీఆనతి పాలిస్తా"నన్నాడు. సేనానుల రావించాడు. "మన సేనలు గంగానది వరకు శ్రమలేకుండా ఎలా

ప్రయాణించాలో మీకు తెలుసు. వెంటనే మీమీ దళాలను గూర్చుకుని యోగ్య ప్రదేశాల్లో పాళెము దిగుతూ, దారిలో ప్రజాపీడనం లేకుండా చూస్తూ పయనించండి. కాలం తెలిసి గంగ దాటండి. నేను తర్వాత వచ్చి మిమ్మల కలుస్తాను" అని వారిని పంపివేశాడు. అన్నలకు అభివాదాలుచేసి, వసిష్ఠాది మహర్షుల చరణ రజోలేశం శిరంపైన ధరించాడు. మాతృదేవులు ముగ్గురకు ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. అందరు ప్రేమ పూర్వ కాశీ స్సులు కురియగా సెలవంది తన మందిరానికి నడిచాడు. ఆ నాటికి రాముడు కొలువు చాలించాడు. చ్యవనాది మునిశతం విడిది ప్రవేశించింది. లిప్తలు ఘడియలుగా, ఘడియలు దినంగా, దినాలు వారాలుగా, వారాలు నెలలుగా, కాలగమనం సాగింది. మాసద్వయం నిండింది. శత్రుఘ్నుని ఆనతి నందిన సేనాపతులు స్వీయ వరూధినుల కూర్చుకుని, చ్యవనాది మహర్షులతో పయనించి కతిపయ దినాలకు గంగా నదీ తటాన్ని చేరుకున్నారు. ఒకనాటి శుభ సమయంలో శత్రుఘ్నుడు ఒంటరిగా శరచాపహస్తుడై రెండు రాత్రులు మార్గ మధ్యంలో గడిపి వాల్మీకి ఆశ్రమ ప్రాంతానికి చేరుకున్నాడు. దినకరు డస్తంగతుడయ్యాడు.

## శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమంలోకి పోవుట

శత్రుఘ్నుడు ఎక్కుపెట్టిన నారి ధనువున సడలించాడు. వల్లెవాటుగా వేసిన దుకూలం నడుముకు బిగించాడు. ప్రశాంత భారంతో ఆశ్రమప్రవేశం చేశాడు. మూర్తీభవించిన తపోరాసి వలె ఆసనస్థుడై సాయం సమయ విధులు నిర్వర్తిస్తున్న మహర్షి పాదాలకు దూరంనుంచే అవనతశిరస్కుడై నమస్కరించాడు. "మహానుభావా! నేను శ్రీరామచంద్రుని కనిష్ఠ సోదరుణ్ణి. పేరు శత్రుఘ్నుడు. అన్న ఆజ్ఞ నెరవేర్చే నిమిత్తంపోతున్నాను. సూర్యాస్తమయ మైంది. ఈ రాత్రికి తమ ఆశ్రమంలో తలదాచుకుంటాను. అనుమతి ఈయ వలసిందిగా అర్థిస్తున్నాను" అని విన్నవించాడు. ఆ మాటలు విని మహర్షి చిరునవ్వుతో లేచి "నాయనా! దాశరథీ! ఈ ప్రదేశం ఎవరిదనుకున్నావు? రాఘవులకు స్వీయ మందిరం. రాకరాక వచ్చావు. నాయనా! ఇదిగో పాద్యం. అర్ఘ్యం. ఆసనం" అని అతిథి మర్యాదలు ముగించి మధుర ఫలాలు తనివి తీర భుజింపచేశాడు. పవిత్ర గంగాజలం త్రాగనిచ్చాడు. ఫలహారానంతరం

సౌమిత్రి "మహాత్మా! మీ ఆశ్రమ సమీప ప్రదేశంలో యాగంచేసిన గురుతులు కానవచ్చినై. ఆ క్రతువు పేరేమిటి? ఏ పూజ్యుడు చేశాడు?" అని అడిగాడు. వాల్మీకి చెప్పసాగాడు.

## వాల్మీకి శత్రుఘ్నునకు సౌదాసుని చరిత్ర చెప్పుట

"దాశరథీ! ఎవరోకాదు. మీ పూర్వుడే. పేరు సౌదాసు. తండ్రి సుదాసుడు. ఆయన అయోధ్య పాలిస్తుండగా సౌదాసు తరచుగా వేటకువెళ్ళే వాడు. ఆ మహారణ్యంలో రాక్షసులిద్దరుచేరి మృగకోటిని పులుల రూపాలతో వెంటపడి భక్షించేవాళ్ళు. క్రమంగా కొంత కాలానికి అడవి నిర్మృగమైంది. ఈ మోసం యువరాజు గ్రహించి ఒకనాటివేటలో వంచనా వ్యాఘ్రరూపంలో వున్న రాక్షసుని క్రూరనారాచ పాతంతో కూల్చాడు. తోడివాడు మరణించ గానే మిగిలిన దైత్యుడు శోకంతో "రాజా! తప్పులేకుండా నా మిత్రుని చంపావు. దీనికి బదులుచేసి పగతీర్చుకుంటాను" అని చెపుతూనే అదృశ్యు డయ్యాడు. కొంతకాలం గడిచింది. సుదాసుడు స్వర్గం చేరాడు. వీరసహుడనే నామాంతరంకల సౌదాసుడు రాజ్యానికి వచ్చాడు. ఆతడు అశ్వమేధయాగం సంకల్పించగా వసిష్ఠమహర్షి నిర్వర్తిస్తున్నాడు. యజ్ఞం పరిసమాప్తి అయిన రోజున పూర్వవైరం మరచిపోని మాంసాశనుడు వసిష్ఠ రూపంతో సౌదాసుని చేరవచ్చి, "రాజా! నాకు మాంసంతో కూడిన భోజనంపెట్టించు"మనికోరాడు. మోసం తెలియని ఆ ప్రభువు వంటవానినిపిలిపించి మహర్షికి సామిషభోజనం ఏర్పాటు చేయమని కట్టడిచేశాడు. సూదకారుడు తొందరగా ఆ కార్యంలో నిమగ్నుడయ్యాడు. అసురుడు అవకాశం దొరికిందే తడవుగా జానసీడు రూపంతో మాంసాశనానికి బదులు మానవామిష భోజనం తెచ్చి, "ఎంతో నేర్పుతో రుచిగా వండాను. మీ గురుదేవుడు మెచ్చుకుంటాడు" అని రాజు ముందర పీఠంపై పెట్టాడు. సౌదాసు పత్నీయుతుడై పరమర్షికి కుడువ పెట్టాడు. జరిగిన వంచన గురుతించలేదు.

భక్తి శ్రద్ధలతో ముందుంచిన భోజనాన్ని తిలకించి మహర్షి "రాజా! నాకు భోజనంగా ఏంపెట్టావో అదే నీకు భోజనం అవుతుంది" అని మనుజ పతిని శపించాడు. అయోధ్యాపతి ఆగ్రహంతో కమండువుజలం చేతిలో పోసు

కుని ప్రతిశాపం ఇవ్వబోతుంటే సహధర్మచారిణి మదయంతి అడ్డుపడి, "ప్రాణేశా! భగవంతుడైన మన గురుదేవుని శపిస్తావా? ఆయన అనుగ్రహం చేతనే కదా యజ్ఞం నిర్విఘ్నంగా నెరవేరింది. మన దురదృష్టంవల్ల ఈ శాంత మూర్తికి ఆగ్రహం వచ్చింది. మనం సహించటం ధర్మం" అని వుపదేశిం చింది. భార్య పలుకులు విని ప్రభువు చేతిలోని జలం తన పాదాలపై వది లాడు. తీవ్రకోపంతో శాపార్థం గ్రహించిన జలంగాడటంచేత రెండు పాదాలు కమిలిపోయినవి. నాటినుంచి ఆయన కల్మాషపాదుడని వ్యవహరించబడ్డాడు. శాంతించిన సౌదాసు గురు చరణాలపై వ్రాలి "స్వామీ! నేను ఏ పాపం ఎరుగను. సూదకారునకు మీ కోరిక తెలిపాను. అతను అమరించి తెచ్చిన ఆశనమే మీ ముందుంచాను. ఇంతకంటే నే చేసిన దోషంలే"దని మొరపెట్టు కున్నాడు. దురాగ్రహంతగ్గిన మహర్షి దివ్యదృష్టితో సర్వం తెలుసుకున్నాడు. "రాజా! పొరపాటేజరిగింది. నీకు కారణరహితంగానే శాపంఇచ్చాను. ఈ విధ మైన భోజనంతెచ్చినవాడు నీమీద పగసాధిస్తానన్న రాక్షసుడు. జరిగినదానికి చింతించినలాభంలేదు. నా శాపం తిరుగులేంది. అయినా నీ శాంతానికి, నీ సతి సౌశీల్యానికి సంతోషించాను. అందువే పన్నెండేండ్లు శాపఫలం అనుభవించు. ఆనంతరం పూర్వస్థితి మళ్ళీ వస్తుంది. కమిలిపోయిన పాదాలు యథాతథ స్థితిని పొందుతై. గతాన్ని మరచిపో" అని శాపవిముక్తి ప్రసాదించాడు. ఆ శాపావసానం వరకు అడవులలో ద్రిమ్మరి అనంతరం పట్టణంచేరి ప్రజారంజ కంగా పాలనంచేసి స్వర్గస్థుడయ్యాడు. ఆయన అప్పుడు అశ్వమేధయాగం చేసిన క్షేత్రం అది" అని గత వృత్తాంతం వినిపించాడు. సౌమిత్రి విశ్రాంతికై పర్ణశాలచేరాడు.

## సీతాదేవి పుత్రుల గాంచుట

తమ పూర్వులెంతటి విజ్ఞానవంతులో, ఎంతటి కార్యశూరులో, ఎంతటి విచక్షణాసహితులో, ఎంతటి క్షమాగుణవాసులో, ఎంతటి వేదవిహిత కర్మా చరణధురీణులో ప్రొద్దుపోయేవరకు శత్రుఘ్నుడు మననం చేస్తూ శయనిం చాడు. ఈయన విమానమువతి ఆశ్రమంలో నిద్రించాడో ఆరాత్రే సర్వగ్రహ యోగకారణ లగ్నంలో భూజాత కవలల ప్రసవించింది. ఆమె ప్రసవించగానే రక్షణలో నిమగ్నులై యున్న తపస్విసులు మహర్షివద్దకు వచ్చి "రామపత్ని

కవలల కన్నది. గ్రహభూతదోషం శోకకుండా బాలచంద్రాభులైన బాలకుల కాపాడండి" అని చెప్పారు. వెంటనే వారితో పురుటిల్లుగొచ్చి భూతనాశన మంత్రాలు పఠించి మంత్రితమైన కుశలతో కూర్చచేసి మొదళ్ళతో ఒక శిశువును, కొసలతో మరోశిశువును మార్జనం చేయమని ఋషిపత్నులకు ఆదేశించాడు. వాల్మీకి ఆదేశానుసారం సంయమి వృద్ధకాంతలు బిడ్డలకు మార్జనం చేశారు. ఆకారణంచేత కుశుడనీ, లవుడనీ నామకరణంచేసి కుశలవులని జంట నామంతో ప్రసిద్ధులవుతారని దీవించాడు. నిద్రాసక్తుడైన శత్రుఘ్నుడు ఆ సందడికి మెలకువ కని వారి సంభాషణలన్నీ విన్నాడు. "అహో! మా తల్లి జానకమ్మ సుఖంగా ప్రసవించింది. మా అన్న వంశం సూర్యచంద్రుల అపహసించే సుతద్వయంతో వృద్ధిపొందుతుంది. ఎంత చల్లనిమాట? ఎంత సంతోషమైన విషయం? నా ఈ రాక ఇప్పుడు నిజంగా ధన్యమైంది. ఆమె పరమపతివ్రత కావటంచేతనే మహాత్ముడైన వాల్మీకి మహర్షి రక్షణఇచ్చాడు. మునిపత్నులంతా ప్రేమతో పురుడుపోశారు. మహర్షి కనుసన్నల్లో కుమారులు దినదిన ప్రవర్ధమానులవుతారు" అని లోలోపల ఆనందించాడు. ఆ సంతోష సమయంలోనే శ్రావణరజని నిష్క్రమించింది. పూర్వాహ్నిక కార్యాలు సర్వం నెరవేర్చి మార్గమధ్యంలో శర్వరీసప్తకంగడిపి, అఖర్వజవంతో సుపర్వసదృశులైన ముని నికాయాన్ని చేరాడు.

ఆ రాత్రి చ్యవనాశ్రమంలో ఆతిథ్యం స్వీకరించాడు. ఆయన ఎన్నో వింతగాథలు చెప్పాడు. వింటున్న సౌమిత్రి "మునిశ్రేష్ఠా! మీరు చెప్పిన కథలు కర్ణపేయం గావించినై. గిరిజాధవ దత్తమైన శూలంతో ఏఏవీరుల సమయించాడు? లవణునికున్న సహజబలం, శూలానికున్న బలం వివరంగా చెప్పండి" అని వినయంగా కోరాడు. భార్గవుడు "దాశరథీ! అతనిచే హతులైన రాజులగాథలెన్నని చెప్పేది? నీవు వినదగ్గ కథ ఒకటి వుంది. అది మీ ఇక్ష్వాకువంశానికి చెందింది. పూర్వం యువనాశ్వనందనుడు ఉగ్రతేజుడు, మాంధాత అన్న పేరుతో మహీపాలనం ప్రజారంజకంగా చేశాడు. దేవతా ప్రీతిగా ఎన్నో క్రతువులు నిర్వహించాడు. దాతృత్వంలో అభినవ కల్పవృక్షం అనిపించుకున్నాడు. ధరుణీచక్రమంతా తన ఆజ్ఞలో నిల్పాడు. స్వర్గలోక జిగీషతో నాకం చేరాడు. ఈయన రాకకు ముదమంది

ఇంద్రుడు అర్ధాసనం యిచ్చి గౌరవించాడు. అమరులంతా పాదాక్రాంతులై నారు. "వచ్చిన కార్యం ఏమిటి?" అని వాసవుడు ప్రశ్నించగా, "నిన్ను నిర్జింపవచ్చా"నని ప్రత్యుత్తర మిచ్చాడు. మహీపతి కలుషవాంఛకు కటకట పడి "రాజా! నీయాజ్ఞ మర్త్యలోకంలోనే చెల్లుబడి కాలేదే? ఇంకా స్వర్గంపై ఆధిపత్యంకోరి చతురంగబల సమేతంగా దండయాత్రకై వచ్చావా? భూలోకంలో అప్రతిహతంగా నీ శాసనం చెల్లించుకుని, తరువాత నాపై దాడికిరా. నీవు మహాధ్వరాలుచేసి మాకు ప్రీతికలిగించావన్న గౌరవంతో నాతో సమానంగా అర్ధాసనంఇచ్చాను.అంతతోతృప్తిపడక నీ భుజకండూతినినాశతారంతో తీర్చుకొన వాంఛిస్తున్నావా?" అని మహేంద్రుడు నర్మగర్భంగా అన్నాడు. క్షితిపతి ఆ పలుకులకు సిగ్గు పడ్డాడు. "మహేంద్రా! భూలోకంలో నా శాసనం ఎక్కడ చెల్లటం లేదో నీవు చెప్పగలవా?" అని అడిగాడు. "రాజా! ఇంతమాత్రం కూడ తెలియనివాడవు నన్నే నిర్జింప వచ్చావా? నే చెపుతా విను. మధువనంలో లవణుడనే పలలాశనుడు వున్నాడు. ఆతడు సంచరించే ప్రదేశంలో నీ శాసనం చెల్లుతున్నదేమో చెప్పు"మని అన్నాడు. ఆ మాట విని మాంధాత సిగ్గు పడ్డాడు.

"పాకశాసనా! ఇంతవరకు నాకీ విషయం తెలియదు. ఆ కార్యం పూర్తి కావించి మళ్ళీ వస్తాను" అని అవాఙ్ముఖుడై వీడుకోలంది భూలోకానికి తిరిగి వచ్చాడు. మంత్రులతో సమాలోచన సలిపి దూతను పంపాడు. వాడు మధువనంచేరి లవణాసురుని దర్శించి దూతకున్న అధికారం మరచి నోటికి వచ్చినట్లు కారుకూతలు కూశాడు. దానితో ఆతనికి ఆగ్రహంవచ్చి ఒక్క పిడికిలి పోటుతో ప్రాణాలూడ్చి కడుపునిండా దూతశవాన్ని భక్షించాడు. ఎంతకాలం గడిచినా దూతరాకపోవటంతో మాంధాత సర్వసన్నద్ధ సైన్యంతో శాత్రవ వీటికి దండయాత్ర సాగించాడు. తనపై యుద్ధానికి మహీపతివస్తున్న సంగతి తెలిసి లవణుడు శూలంగొని సమరానికి సంసిద్ధమయ్యాడు. ఇరువురు ఘోరంగా పోరాడారు. మాంధాత ప్రయోగించే మార్గణవహ్నికి అసురుడు ఆగలేక శూలాన్ని "బలయుక్తంగా రాజును బలిగొని రమ్మ"ని కోరి విసరి వేశాడు. అసురప్రయుక్తశూలం నృపతితో సకలసైన్యాన్ని నిర్దహించి తిరిగి వాడిచేతికి వచ్చి చేరింది. శూలం అంటే అయోమయ నిర్మితమయిన ఆకారం

మాత్రమే కలదివాడు. పరమశివుని పరిపూర్ణశక్తితో నిర్మాణమైంది. అదివాని చేతవున్న సమయంలో శంకరుడే నిలువలేడు. శూలశక్తి విన్నావుకదా? ఇక అంతటిశూలాన్ని ధరించి భరించగల దర్పం వాడికుంది. తెల్లవారగానే శూలం ఆలయంలో వదలి ఆహారనిమిత్తం అడవికి పోతాడు. మధ్యాహ్నానికి తిరిగి వస్తాడు. నీచేత సమరంలో చస్తాడు. అందుకే నిశాశేషం వరకు నీకు నిద్ర రాకుండా గాథలు చెప్పాను. తూరుపు తెల్లవారుతూంది. ఆహ్నికాలు త్వరగా పూర్తికావించు."

అని అంటూండగానే పక్షుల కిలకిలారావం ప్రాభాతమంగళతూర్యారావాలైంది. సౌమిత్రి చ్యవనుని అనుజ్ఞపొంది నిత్యవిధితీర్చి గంగతరించాడు. దైత్యుడు ఆమిషసంపాదనార్థం పురం నిర్గమించాడు.వాడిపోకడ ప్రచ్ఛన్నంగా వుండి సౌమిత్రి గమనించాడు. శరశరాసనహస్తుడై ద్వారంముందుకు వచ్చి శత్రువు రాకను నిరీక్షిస్తూ నిల్చున్నాడు. అహస్కరుడు ఆకాశమధ్యం చేరాడు. బయటికిపోయిన క్రూరదానవుడు మృగకోటిని వధించి ఆ కళేబరాలను గుదులు గుదులుగాకూర్చి మోసుకుని భారంతో ద్వారం చేరవచ్చాడు. ఒంటరిగా ధనుఃపాణియై నిల్చిన శత్రుఘ్నుని చూచి "ఎవడవురా నీవు? ఏం కోరి ఇందువచ్చావు? పిట్టలకొట్టే విల్లంబుల పట్టుకున్నావెందుకు? దానితో ఏం సాధించతలిచావు? తరుగుపడ్డ ఆహారం నీతో పూర్తయింది. నాకు శ్రమ లేకుండా నీవే ఆశనంగా వచ్చావు" అని బిగ్గరగా నవ్వాడు. వాడు నవ్వుతుంటే శత్రుఘ్నునికి శరీరంనిండా తేళ్లూ జెర్రులూ పాకినట్లయింది. కినుక హెచ్చింది. దేహం సెగలు పొగలు క్రక్కింది. ఉష్ణబిందువులు కన్నులవెంట కారినై. "ఓరీ! దుర్మార్గుడా! నీతో యుద్ధం చేయవచ్చాను. నీ మిడిసిపాటు నేటితో నీకుచేస్తాను. నీకు రానున్న చావు గుర్తించక నవ్వుతున్నావా?వచ్చినవాడెవడో ఎరుగక ప్రేలుతున్నావా? జగత్కంటకుడైన రావణుని సబాంధవంగా చంపిన రామచంద్రుని కనిష్ఠ సోదరుణ్ణి. శత్రుఘ్నుణ్ణి. జనరక్షాదక్షుణ్ణి. నిత్య శత్రుఘ్నుణ్ణి. దాశరథిని. నీతో ద్వంద్వయుద్ధానికి వచ్చా. నీచావు నిజం" అని కోపంతో అన్నాడు. వాడు మహాగ్రహంతో "కూళా! ఏం ప్రేలుతున్నావు? నా చావు నిజమా? నీవా చంపేది? నీచావు సంగతి చూచుకో. ఆ రావణుడు నా తల్లి తోడబుట్టువు. ఎందరెందరివో పూర్వులనూ,

నవీనులనూ రాజులన్న వాళ్ళను కాలరాచాను. మిగిలిన వాళ్ళపై నాకు దృష్టే లేదు. అందుచే శాంతుడనై స్వస్థానంలోనే వుంటున్నాను. నా మామ సకుటుంబంగా చచ్చాడని తెలిసినా, ప్రతీకారం మానుకున్నా. నేను ఆగ్రహిస్తే రావణునితోనే రాముడూ సబాంధవంగా పోయేవాడు. ఉపేక్షించినందుకా నామీదికి యుద్ధానికి వచ్చావు? నేను లోనికేగి వస్తాను. అంతవరకు ఆగు. ఆలస్యం లేకుండ ఆ యు ధ ం తో ఇప్పుడే వస్తాను" అని ముందుకు సాగాడు. "ఆగు. క్రూరుడా! ఆగు. నేను జీవించి వుండగా నీవు లోనికి పోలేవు. శూలం తెచ్చుకోలేవు. పగతుడు యాదృచ్ఛికంగా అగపడితే వదిలే మూర్ఖుడెవడున్నాడు? అందులో లోకాలకు కంటకుడవైన నీవు కనుపిస్తే విడిచి పెట్టటం ఎలా జరుగుతుందను కున్నావు? నీకు అవకాశం ఇవ్వను" అని నిర్దాక్షిణ్యంగా తిరస్కరించి నిరో ధించాడు.

## లవణ శత్రుఘ్నుల యుద్ధం

"ఏమి! నాకు దారి ఇవ్వవా? ఆయుధంతో వచ్చిన వాడితో ఆయుధం తోనే పోరాడాలె. నా ఆయుధం నేను తెచ్చుకుంటానంటే నిరోధించే నీవేపాటి నీతిమంతుడివి? శౌర్యవంతుడివి?" అని ద్వారంవై పు న డి చా డు. "దై త్యా ధమా! నీరాక్షసబుద్ధి పో ని వ్వా వు కా వు. నీకూ నీతికీ ఎంత దూరం? మా పూర్వుడు మాంధాత దూతను పంపితే చంపి తిన్నావు. అది నీ రాజనీతిలో ధర్మం కావోలు. ఈశ్వరుడిచ్చిన శూలాన్ని నీతండ్రి పూజించి ఆరాధించాడు కాని, సాత్త్వికులైన రాజులపై ప్రయోగించలేదు. విప్రులనూ, మునులనూ, పౌరులనూ పట్టి వధించి తినలేదు. ఇవన్నీ నీవు చేశావు. ఇంకా చేస్తూనే వున్నావు. ఇది అంతా రాజనీతి క్రిందకువస్తే నేను నిరాయుధునితో పోరటం కూడా అందులోకే వస్తుంది. పిట్టలు కొట్టే విల్లంబులు నిన్నేం చేస్తై? ఎందుకు భయం? నీ అవహేళనలో భాగంకదా నా ఆయుధం? నీవు సమరం చేసినా చేయకపోయినా నిన్ను చంపటం తథ్యం. శ క్తి వుంటే కాచుకో" అని గట్టిగా చెప్పాడు. ఆ మాటలు అగ్నిలో పోసిన ఆ జ్య ం లా గా అసురుని రెచ్చ గొట్టినై. అట్టహాసం చేశాడు. పాణిలోపాణి చేర్చి నలిపాడు. పటపటమనేట్లు పండ్లు కొరికాడు. "రారా బ్రదుకుపై భ్రాంతిలేని నరాధమా! రా. అంగుష్ఠ

మాత్ర దేహంగల మానవులపై, మాకు అశనమైన మానవులపై శూలంకూడా ఎందుకు? నా బాహువులే చాలు" అని హుంకరించాడు. "ఈ అహంకారం ఎంతోసేపు నిలవెట్టుకోలేవు. పూర్వం నీవు గెల్చిన రాజుల జాబితాలో నన్ను చేర్చుకున్నావు కాబోలు. అలా భావించితే అది నీ అజ్ఞానానికి గుర్తు. నా అన్న రామచంద్రునిచే హతుడై పడిన రావణుని అమరులు తిలకించినట్లు, నాచే పడిన నీ కాయాన్ని బ్రాహ్మణులు, తాపసులు చూస్తారు చూచి ఆనందిస్తారు. నవీనవగ్రామారణ్య ప్రాంతాలవారు సుఖించుదురుగాక. నా హస్తముక్త మార్గణ సమూహాలు వజ్రతుల్య తేజోమయాలు, సదృశ దివాకర ప్రభలు.భాస్కరదీప్తులుపద్మంలో ప్రవేశించినట్లు దుర్దామజవంతో నీహృదయ స్థానంలో ప్రవేశించి రక్తం గ్రోలి తృప్తి చెందుగాక. అంగుష్ఠమాత్రుడనో, త్రివిక్రముడనో ఇప్పుడే చూచెదవుగాక" అని నిందాగర్భ భాషణాలు శత్రుఘ్నుడు పలుకుతుండే చేయిచాచి లవణుడు సమీపంలో వున్న వృక్షాన్ని పీకి విసరివేశాడు. వచ్చే వృక్షాన్ని శతధా ఛిన్నంగా సౌమిత్రి శాతశరాలతో నరికాడు. అంతతో ఆగక అసురుడు వసుధారుహ వర్షం కురిపించాడు. ఆ వచ్చి పడుతున్న చెట్లనన్నీ పుంఖాను పుంఖశరజాలంతో చెండుతుండే ఒక వృక్షంతో సౌమిత్రి శిరంపై మోదాడు. ఆ దెబ్బకు శత్రుఘ్నుడు సంధులు సడలగా కదిమిచెడి పుడమిపై పడ్డాడు. లవణుని ప్రహరణంతో సౌమిత్రి మూర్ఛమునగా పైనుంచి చూస్తున్న వేల్పులు, క్రిందవుండి చూస్తున్న మౌనులు భయంతో హాహాకారాలు చేశారు. శత్రునిరోధం తొలగినా లవణుడు శూలం కోసం పోక విధిప్రేరితుడై తెచ్చిన మృగాలను తింటూ పగవానిపాటు చూస్తూ నిలుచున్నాడు. అంతలో సౌమిత్రి తేరుకున్నాడు.

మూర్ఛతేరి సౌమిత్రి ధనుష్టంకారం చేశాడు. ఇతరాయుధాలచే వీడిని చంపటం సాధ్యం కాదని తలచాడు. శంబాననం, శతకోటివేగం, శాతకుంభ శైల మందరధర సన్నికాశం, నతపర్వం, ఉగ్రం, అనాహతం, శోణితచందన శోభితం,జానుపత్రం,దానవభంజనం,ప్రలయకాలానలాభం,అయిన నారాయణా స్త్రాన్ని తూణీరం నుంచి గ్రహించాడు. సర్వభూతకోటి సంభ్రమించింది. కిన్నరగంధర్వ చారణవిద్యాధరాది దేవతా సమూహం, మునులతో, అప్సరో

వనితలతో సత్య లోకంచేరిజలజాసనుణ్ణి దర్శించి "మహానుభావా! ఈ అకాల ప్రళయం ఏమిటి? ఎందుకు వచ్చింది? విశ్వతేజస్సు క్షీణిస్తూంది. మనస్సులు కల్లోలం పొందుతున్నై" అని గగ్గోలు పెట్టారు. "దేవతలారా! మీ భయ హేతువు చెపుతావినండి. శత్రువధార్థం సుమిత్రానందనుడు సర్వాస్త్ర శిరో మకుటమైన నారాయణాస్త్రం గుణంలో కూర్చాడు. ఆ తేజస్సు అప్రతిహతం కాబట్టి మనమతులు, తేజస్సులు ప్తమవుతున్నై. ఆ యస్త్రం సనాతనుడైన ఆదిదేవునిచే సృజింప పడింది. పూర్వం మధుకైటభులను దునుమంగా నారాయణుడు ఆత్మతేజోంశగా నిర్మించాడు. ఆ అస్త్రరహస్యం ఆయన కొక్కడికే తెలుసు. ఆయనకు బాహ్యతేజం అదే. జగత్ప్రళయం ఏమీ జరగదు. శత్రుఘ్నునిచే శత్రుసంహారం జరుగుతుంది. రణక్షేత్రానికి మీరు పోయి రాక్షసవధ కన్నులారాకాంచి ఆనందించండి" అని చెప్పాడు. దేవతలంతా కలహక్షేత్రానికి వియద్వీథిని చేరారు. సౌమిత్రి కార్ముకంలో శరం కూర్చి లవణుని యుద్ధానికి ప్రేరేచాడు. వాడు శత్రుశక్తిని లెక్కగొనక అర్భాటం చేస్తూ భూరుహాలను విసురుతూ, కొండలాగా నడచి సౌమిత్రిని చేరవస్తుంటే, ఆకర్ణాంతం గుణంలాగి వక్షః ప్రదేశం లక్ష్యంగా అనుసంధించాడు. అంబర తలం నిజతేజంతో నిండిస్తూ వచ్చి లోకద్వేషి గుండెల్లో చొచ్చి ప్రవచ్చి, అధోలోకం చేరి శత్రుఘ్నుని తూణిలో వచ్చి చేరింది. సురలు ఆనంద కోలాహలం చేశారు. లవణుడు శరనిర్భిన్న వక్షస్స్థలుడై వజ్రహతమహాశైలంవలె నేలపైపడ్డాడు. అతని ప్రాణవాయువులు యమలోకం చేరగానే హలివత్త్రశూలం పూజామందిరం నుంచి అదృశ్యమై అంబికాపతి కరంలో లీనమైంది. భరకరుడు ఇరులు తోలినట్లు ఒక్కశరంతో దాశరథి ముల్లోకాల్లో గూడుకట్టుకున్న భయాన్ని పటాపంచలు చేశాడు. మధుపుత్రుడు మరణించగానే మౌనులూ, వేల్పులూ, పన్నగులూ ఆనందాతిరేకంతో కొంతకాలం వుండిపోయారు.

అగ్ని పురోగములై అమరులు ఇంద్రునితో కూడి ఆహవ ప్రదేశానికి వచ్చారు. "రామానుజా! మా అదృష్టంవల్ల మధునందనుడు నీచే మరణించాడు. అరచేతుల్లో ప్రాణాలుంచుకుని మర్త్యులేకాక మేమూ బ్రతుకుతున్నాం. ఈ నాటికి మా బాధ మటుమాయమైంది. లోకకల్యాణకారకమైన కార్యంచేసిన

నిన్ను చూచి, అభినందించి వరాలు ఇవ్వవచ్చాం. మా రాక వృథాగా ఎన్నడు పోదు. పోగూడదు కూడ. నీ కోరిక ఏమిటో తెలిపితే తప్పక తీరుస్తాం" అని అన్నారు. సౌమిత్రి అందరకూ నమస్కారాలువేసి "మహాత్ములారా! మీ ప్రశంసలన్నీ నా అన్నకు చెందుతై. ఆయన రచించిన వ్యూహం, ఆయన ఇచ్చిన మహాశరం ఈ విజయానికి కారణం. ఇందులో నే చేసింది అత్యల్పం" అని వినయంగా దేవతలకు విన్నవించాడు. "మీకై మీరుఆశీర్వదిస్తూ అనుగ్రహించుతుంటే నేను కాదనలేను. ఈ మధువనం ఇంతవరకు నరకలోకంగావుంది. ఇక్కడ మహానగర నిర్మాణం చేయుమని అన్నగారి ఆజ్ఞ. అది మానవ యత్నంతో ఎంత సాధ్యమో తెలియదు. అందువల్ల మీ కృపాకటాక్షవీక్షణాలతో ఆ నగరం నిర్మాణం అయ్యేలాగా అనుగ్రహించండి. ఈ వార్త విని నా అన్న ఎంతో సంతోషిస్తాడు"అని కోరాడు. ఆ కోరిక విని మహేంద్రుడు "దాశరథీ! చిన్నవాడవైనా నీ వినయానికి, నీ కర్తవ్య నిర్వహణదక్షతకూ, నీ అన్నపైగల భక్తివిశ్వాసాలకు నేను తృప్తిచెందాను. నేటినుంచి మధువనం మధురానగరంగా మారుతుంది. ఇది దేవ నిర్మితమైన శూరసేన నామంతో ప్రసిద్ధికెక్కుతుంది" అని వరమిచ్చి అమరులలోఅంతర్హితుడైనాడు. దేవతలు మునులు చనగానే ఆ ప్రదేశం మహానగరంగా మార్పుచెందింది. సౌమిత్రి దూరంగా వుంచిన సైన్యాన్నీ, దానితో వచ్చిన వర్తక కర్షక సంతానాన్నీ పురంలోకి పిలిపించాడు. తగిన చోటుల్లో అందరినీ విడిదిచేయించాడు.

శ్రావణమాసంలో ప్రారంభమైన మధురానగర నిర్మాణం శుక్లపక్షపాకరుని చందంగా క్రమపరిణామంతో ద్వాదశ వసంతాలు గడిచేటప్పటికి రెండవ స్వర్గంగా తయారయింది. శక్తిమంతమైన సామ్రాజ్యానికి రాజధాని ఎలా వుంటుందో ఆ విధంగా అన్ని ముఖాల అభివృద్ధి చెందింది. భయరహితులై పౌరులు, ప్రజా సందోహం నూత్నజీవితం ప్రారంభించటం జరిగింది. కారు కాపన పాహారి వర్షం కురిశాడు. పైరు పచ్చలు నిస్సార భూములు సారవంతం కాగానే కనులపండుగగా కానిపించినై. అక్కడి మానవులు ఆరోగ్య సౌభాగ్యాలతో అలరారారు. సుందర మందిరాలెన్నో సృష్టించబడినై. తీర్చిదిద్దిన మార్గాలల్లో అంగడి వీథులు రంగారినై. వాణిజ్య సంపద బహుళమైంది. పూర్వం లవణుడు కల్పించిన మహామందిరం, వన్నెచిన్నెలతో

నూత్నశోభ సంతరించుకుంది. అర్ధచంద్రాకారంగా యమునా తీరభాగంలో పట్టణం ఎంతో చూడముచ్చట గొల్పసాగింది. వాహ్యాళియోగ్యాలైన సుందరా రామాలు పురంచుట్టూ పురీ సుందరీ మేఖలవలె చూపర హృదయం చూర కొంటున్నై. ఆదేశ పౌష్కల్యానికి ఆనందించిన వైశ్యాళి అన్యదేశాలనుంచి వలసవచ్చి కుటుంబాలతో స్థిరపడింది. అన్న ఆజ్ఞాపించినమేరకు ఆ ప్రదేశాన్ని సస్యశ్యామలంగా, సర్వాంగ సుందరంగా, సర్వలక్షణ లక్షితంగా, రాజధాను లకు ఆదర్శప్రాయంగా, చతుర్వర్ణ పౌరజన నిరంతర స్వీయకార్యాచరణ సంపాదిత ధర్మమందిరంగా మధురాపురాన్ని పన్నెండేళ్ళ పాలనలో శత్రు ఘ్నుడు తీర్చిదిద్దాడు. ఒక్కసారి ఆ పరిసర ప్రాంతాలనూ, నగరాన్నీ కలయ తిరిగివచ్చి తృప్తిగా నిట్టూర్చాడు. అగ్రజచరణ సరోజాలు హృదయ పీఠంలో సాక్షాత్కరించటంతో ఇక అక్కడ నిలువలేకపోయాడు. రాజధానిని మంత్రుల వశంచేసి, మితజన పరివృతుడై దినమేకరాత్రంగా ప్రయాణం సాగించాడు.

రథశతం, దానికితగిన పరివారం వెంటరాగా ఏడెనిమిది మజిలీలుచేసి వాల్మీకి ఆశ్రమానికి సౌమిత్రి చేరాడు. ఆయనకు పాదాభివందనం ఆచ రించాడు. ఆయన ఇచ్చిన అర్ఘ్యపాద్యాతిథ్యాలు స్వీకరించాడు. ఆయన విని పించిన అనేక కథలు విన్నాడు. ఆ మాటలమధ్యలో లవణ వధ వృత్తాంతం రాగా, మహర్షి, "రామానుజా! కష్టకర్మని లవణాసురుని చంపి జగత్తుకు మేలు చేకూర్చావు. దాశరథి రావణుని వధించి మూడు లోకాలకు మోదం కూర్చినట్లు నీవు చేసిన కార్యం మాకు సంతృప్తి కల్గించింది. ఆయన ఎంతో యతనంచేసి సాధించినపని, నీవు యత్నం లేకుండాచేసి ఎంతో కీర్తి గడిం చావు. ఈ సంగతి వాసవుడు నాకు చెప్పాడు. భూతకోటికి ప్రియంకూర్చిన నీ సాహసం నాకు అధికాధిక గౌరవకారణమైంది. మాబోటి తాపసులకు విశ్వ శ్రేయస్సుకై తమ మనోధనాలు త్యాగంచేసేవారిని అభినందించటం, ఆశీర్వ దించటం కాకవేరే కోరికలేముంటై?" అని ప్రియమార సుమిత్రాసూనుని దగ్గర చేర్చి మూర్ధఘ్రాణం చేశాడు. అతనితోవచ్చిన పరివారాన్ని యథో చితంగా ఆతిథ్యమిచ్చి సత్కరించాడు. వారు కనివిని ఎరుగని ఆ విందుకు సంతోషభరిత స్వాంతులైనారు. రాత్రి వచ్చింది.

# శత్రుఘ్నుడు శ్రీరామాయణం వినుట

మహర్షి ఇచ్చిన ఆతిథ్యం మరవలేక మనసుల్లో సౌమిత్రితోపాటు వచ్చిన వారంతా మరీ మరీ తలపోయసాగారు. ఆ సమయంలో ఆశ్రమం నుంచి తంత్రీలయ సమన్వితం, తాలాన్వితం, సంగీతమాధుర్య సంకలితం, సంస్కృతం, సలక్షణసౌందర్యధామం, త్రిస్థానకరణ సందీపితం, పూర్వ కృతం, అయి శ్రీరామచరిత్ర యథావృత్త సరణిలో పూర్వంనుంచి కడవరకు గానం చేయబడుతూంది. సౌమిత్రి పీతచేష్టుడై విన్నాడు. కనులు చెమ్మ గిల్లినై. నిట్టూర్పులునిగిడిస్తూ అపుడు ఆ కథ ప్రవర్తించుతుండగా దర్శించిన రీతి బాధపడ్డాడు. ఇతని స్థితి ఈవిధంగా ఉండే, ఈయనతో వచ్చిన జనులు అబ్బురం, దైన్యంపొంది, తలలువాల్చి వారిలోవారు "ఇట్టిచిత్రం ఎక్కడైనా వుందా? ఇది కలకాదు కదా? మనం ఇప్పుడెక్కడున్నాం? లోగడ కథలుగా విన్న వృత్తాంతం ఆశ్రమంలో కళ్ళకు కట్టినట్లు కనుపించింది. ఆ గానం ఎవరు చేశారు? అది సంగీతమా? సమ్మోహనాస్త్రమా?" అని భావించి విషయ నిర్ణయం చేసుకోలేక శత్రుఘ్నుని సమీపించి "ప్రభూ! మనం ఆశ్రమంలో కదా వున్నాం? అయితే ఆకారం కనుపించకుండా గానరూపంగా రామాయణం వినిపించేదెవరు? అది ఇప్పుడు జరుగుతుండే చూస్తున్నట్లు భ్రాంతిపొందటం ఏమిటి? మా మనస్సుల కందటంలేదు. మహర్షుల వారిని అడిగి తెలుసు కుంటావా?" అని అడిగారు. "పూజ్యులారా! మీరు పొందిన స్థితి నేనూ పొందాను. ఈ మహర్షి ఆశ్రమంలో ఇట్టి విచిత్రాలు ఎన్నో జరుగుతుంటై. అవకాశం వచ్చినప్పుడు అనుభవించాలె కాని కారణాన్ని కూర్చి కలతపడటం కానీ, ప్రశ్నించటంకానీ ఎవరికీ తగదు" అని వారిని పంపి, మునీశ్వరునకు మ్రొక్కి సెలవంది తనకిచ్చిన నిలయం చేరాడు.

పరంతపుడు పడుకున్నాడే కాని నిద్రపట్టలేదు. ఇంకా ఆ గానం, ఆ కథా విశేషం వినిపిస్తూ కనుపిస్తూనే వుంది. భువనమోహనమైన ఆ పాటలూ, ముద్దులు మూటగట్టే ఆ మాటలూ అపూర్వం కావటంతో శత్రుఘ్నుడు శయ నించక వాటిలో లీనమైనాడు. గానం ఆగింది. ఖగకుల కిలకిలారావంరేగింది. నిద్రలేని సౌమిత్రి బడలికచెందకుండా కల్యవిధి ముగించి మునిదేవునిదర్శించి మ్రొక్కి "మహాత్మా! రామదర్శనంకోసం మనస్సు తొందరిస్తూంది.అనుమతి

ఇస్తే అయోధ్యా నగరానికి అరుగుతా"నని తెలిపాడు. మహర్షి సౌమిత్రిని ఆలింగనంచేసి, "నాయనా! పోయిరా. నీకు శుభం కలుగుగాక" అని అంగీకారం తెలిపాడు. అతి వేగంగా అరదాన్ని నడిపిస్తూ అత్యల్పకాలంలోనే అయోధ్యచేరాడు. ఆ రాత్రి వేగించాడు. మరునాటి వుదయం మంత్రి జన మధ్యస్థుడై బంగారు సింహాసనంపై ఆసీనుడై విషయాలు చర్చిస్తున్న రాకా సుధాకరాననుడైన రామచంద్రుణ్ణిదర్శించి మోకరిల్లి చరణస్పర్శగా నమస్కరించాడు. "మహాప్రభూ! పలిసవాని ఆనతిగొని ఈ సేవకుడు మీ ఇచ్చిన మాట దక్కించాడు. చ్యవనాది మహర్షులేకాక, పౌరులేకాక, నిలింపులుసైతం ఆనందించేలాగా లవణాసురవధ జరిగింది. నీ సంకల్పానుసారం మహానగరం నిర్మించబడింది. దాదాపు ఎటుచూచినా దశయోజనాలవరకు పంటభూములు, పల్లెలు, గ్రామాలు, తోటలు, మంచినీటిబావులు, దొడ్లు, కోటలు, పేటలు విస్తరించి జనసంకులంగా, శాంతిసౌభాగ్యాలు విరజిమ్ముతూ రాష్ట్రం విస్తరించింది. ఇతర దేశవాసులెందరో వచ్చి స్థిరపడ్డారు. దేవతలు ఆ నగరానికి, ఆ రాష్ట్రానికి ముద్దుగా మథురాపురమనీ, శూరసేన అనీ నామకరణంచేశారు. మునులు శాంతమతులై, స్వకర్మానుష్ఠానపరులై జనప్రియంగా క్రతువులు చేస్తున్నారు. నేను పన్నెండేండ్లు మీ పాదసేవకు దూరమైనాను. ఇక ఈ వియోగం భరించలేను. నీ కరుణకు పాత్రమైనవానిని ఆ పురికి ఏలికగాపంపి నన్ను పూర్వంవలె స్వీకరించు. సర్వకాల సర్వావస్థల్లో నీవేకనుపిస్తావు. ఏవో అవ్యక్త మధురవాక్కులు వినిపిస్తావు. ఈ విప్రయోగం ఇకపై విధించకు"మని అన్నతోచెప్పి అంగలార్చాడు.

ఇంకా ఇలా అన్నాడు. "తల్లినిబాసిన వత్సంలాగా నీ పరోక్షంలో ఎంత దుఃఖం అనుభవించానో? అన్నా! ఏంచేసినా, ఏంచూచినా, నా మనో దర్పణంలో నీవే వున్నావు. అనాథునివలె తపిస్తూ జీవించలేను. నీకృపాపూర్ణ హృదయంలో ఈ సేవకునికి లేశమాత్రం చోటొసంగు." "తమ్ముడా! విచార పడకు. నీవంటి సోదరుణ్ణివదలి ఏ అన్న వుండగలడు? ఈ రాముడు అంత నిర్దయుడుకాడు. మనం క్షత్రియులం. అందులో సూర్యవంశ సంజాతులం. ఐక్ష్వాకులం. దాశరథులం. బంధుప్రేమ ఎంతవున్నా ధర్మాచరణం మనకు

ప్రథమకర్తవ్యం. నీవుదైనపురుషునకు శత్రునిబర్హణం, ధర్మపాలనంతప్పని సరి. ప్రజలను ప్రేమించినంతగా ఐనవారిని మనపూర్వులు ప్రేమించలేదన్న సంగతి నీకు తెలియనిదికాదు. మనశరీరాలు దూరంగావున్నా ఆత్మలు కలిసేవుంటై. నీవంటి స్థితప్రజ్ఞుడు బాహ్యబంధాలకోసం ప్రాకులాడతగదు. అందుకు నాజీవితం ఆదర్శంగా తీసుకో. నీకు అన్నల అండదండలు వుండనే వుంటై. వారందినాలు నీకు స్వేచ్ఛగా మాతో కలిసివుండేట్లు అనుమతిస్తున్నాను. అప్పుడప్పుడు రావచ్చు. చూడవచ్చు. వారాంతంలో నీకు కావగిన వస్తుసముదాయంతో, పరివారంతో బయలుదేరి మధురాపురంచేరు. నీకుశలం వార్తాహరులచే అప్పుడపుడు తెలుపు. మేంకూడా ఆలాగే పంపుతుంటాం"అని రాముడు తమ్ముణ్ణి అనునయించాడు. అన్నకు మారుమాటచెప్పలేని సౌమిత్రి కన్నీళ్ళతో కాళ్ళకడిగి బిగ్గరగా సంతాపించాడు. అన్నలు మూగురు సముదాయించి సద్దిచెప్పారు. సప్తరాత్రాలునిండగా శత్రుఘ్నుడు అన్నలు సాగనంపగా, తల్లులు దీవించగా తరలిపోయాడు. రాముడు తృప్తుడైనాడు.

## విప్రుడు మృతబాలకుని రాముని వాకిట పడవైచి రోదించుట

కాలం గడుస్తూంది. అనుజులతోగూడి రాముడు ధర్మం తప్పకుండా ప్రజారంజకంగా పాలనంచేస్తున్నాడు. ఒకనాడు అనుజన్ములతోనూ, ఆత్మీయులతోనూ, సుఖోపవిష్టుడై, అప్పటి కాలావసరవిషయాలు తన మందిరంలో చర్చిస్తున్నాడు. ఆ సమయంలో ఒక జనపదంనుంచి విప్రుడు మృతబాలుని భుజంపై వేసుకుని రాజవీథిగమించి, రాముని ప్రాసాదంచేరి సింహద్వారం ముందు బాలకుని దించి పై గుడ్డపరచి దానిపై పడుకోబెట్టాడు. కన్నీరు కాల్వలుకట్టగా ఏడుస్తూ, "నాతండ్రీ! నీకప్పుడే నూరేండ్లునిండాయా? నేనీ జన్మలో ఏపాపం చేయలేదే? పూర్వజన్మలో ఏపాపం చేశానో? నీవంటి బంగారుతండ్రి, లేకలేక కలిగిన నా వంశాంకురం, నాకు లేకుండాపోయాడు. నా దుష్కర్మ ఎంత బలీయమైంది? పెద్దలు జీవించివుండగా పిన్నలు మరణించటం ఇంతవరకు లేదే? పధ్నాల్గేడుల బాలకుడెక్కడ? అకాలమృత్యువువాతపడటం ఎక్కడ? నిన్ను పోగొట్టుకుని నీతల్లీ నేనూ బ్రదికిబట్టగలమా?

నేనుగాని, సీతల్లిగాని, అన్యాయం ఎరగమే? అబద్ధాలాడమే! కర్మభ్రష్టులం కాలేదే? ఏప్రాణికీ హింస తలపెట్టలేదే? నాకు తెలియని ఏంపాపం చేశానని నన్నువదలిపోయావు? నాతండ్రీ! నీవు నాకు పైతృకవిధులు నిర్వర్తించుతావని గంపెడంత ఆశతోవుంటే నీకే నేను దహనక్రియలు నెరవేర్చే దుర్యోగం నాకు సంప్రాప్తమైందికదా? ఇంతవరకు ఇక్ష్వాకుల పాలనంలో అకాలమరణాలు, అపమృత్యుభయాలు కన్నవికాని విన్నవికానిలేవు! రామరాజ్యంలో ఇవి జరిగిఉంటే రాజు చేయకూడని కార్యం ఏదోచేసివుండాలె. ఆపాపఫలం నా కడుపుచిచ్చుకు కారణమైవుండాలె" అని కడుపూ, నోరూకొట్టుకుంటూ ఏడ్వసాగాడు. ఆగోలవింటున్న ద్వారపాలకులు ప్రభువుకుపోయి విన్నవించారు. వెంటనే రాముడు లేచివచ్చి ఆ విప్రుణ్ని ఓదార్చి "నీవు నానుంచి ఆశించివచ్చినకార్యం ఏమిటో చెపితే అది నీకు తృప్తిగా పూర్తిచేస్తానని మాట ఇస్తున్నాను. శోకంమాని వివరించు"మని అడిగాడు. బ్రాహ్మణుడు తీవ్రకోపంతో "ప్రభూ! ఈ రాజ్యంలోనే కాదు ఏ రాజ్యంలోకూడా అకాలమరణాలనేవి ఇంతవరకూ జరగలేదు. నీపాలనలోకూడా ఇప్పటిదాకా ఏవీ జరగలేదు. మేమంతా శాంతిసుఖాలతో బ్రదుకుతున్నాం. మా నడవడిలో దోషాలులేకుండానే నాఒక్కగాని ఒక్కకొడుకు నిష్కారణంగామరణించాడు. అందుకు రెండే కారణాలున్నై. రాజైనా పాపంచేసివుండాలె. లేక ఎక్కడైనా అవి జరిగితే ఉదాసీనంగా ఉపేక్షించుడైనా జరగాలె. ఈబాలుని మృతికి నీవే కారణం. నీవు నాబిడ్డను మళ్ళీ బ్రదికించాలె. ఇది నీ ధర్మం. కాదంటే నా బిడ్డడితోపాటు నేనూ నాభార్యా ఆత్మహత్య చేసుకుని ఇక్కడ ఇప్పుడే మరణిస్తాం. నీవూ, తమ్ములూ దీర్ఘాయుష్మంతులై కలకాలం వర్ధిల్లండి. ఇప్పటివరకు దుఃఖం ఎరుగని దంపతులం నీ పాపఫలంవల్ల కొడుకును పోగొట్టుకుని కుందవలసివచ్చింది. బాలురమరణంతో ప్రారంభమైన అధర్మం ఇంకా ఎంతవరకు పోతుందో? క్రమంగా వంశక్షయం జరిగి చివరకు రాజ్యం శ్మశానంగా మిగిలినా మిగలవచ్చు. రాజులుచేసే పాపం ఒక్కరాజులతోనే పోదు. పౌరులకు భరించరానిబాధలు తెచ్చిపెడుతుంది. ఎప్పుడు రాజులు అధర్మ సంచారులవుతారో అప్పుడే అకాలమృత్యువు పిలవకుండానే దయచేస్తుంది. తనఏలుబడిలో ఎక్కడ అనుచిత కార్యాలు జరిగినా శిక్షించక ప్రభువు ప్రమత్తుడు

కారాదు. అధర్మాన్ని శాసించటానికి, ధర్మాన్ని స్థాపించటానికికాకపోతే ప్రభువులెందుకు? ఈ మహాభోగాలూ, ఐశ్వర్యం ఎందుకు? పౌరుల రహస్యాలు బట్టబయలుచేసే నీగూఢచారివర్గం నీకిటువంటి సంఘటనలు చెప్పకపోతే నీవే స్వయంగా ఏదో దోషం చేసివుంటావు. అందుకే నా పుత్రుడు చచ్చాడు. ఇది పౌరుడుగా నీపైతెచ్చిన అభియోగం. విచారించి శిక్షిస్తావో, భక్షిస్తావో, రక్షిస్తావో నీవేతేల్చుకో"మని చెపుతూ మృతబాలుని కళేబరాన్ని రాముని పాదాలపైవుంచాడు.

రాముడు మృతబాలుడునిచూచీ, విప్రవాక్యాలునినీ నిర్ఘాంతపడి నిల్చాడు. సీతపైచేసిన నిందారోపణలకంటే, తనకాముకత్వంపై సలిపిన వ్యాఖ్యానాలకంటే ఈ అభియోగం దారుణాతిదారుణంగా వుంది. మౌనంగా తనలోతాను తర్కించుకున్నాడు. ఏదోషం తాను చేసినట్లు కన్పించలేదు. "అయితే ఈ బాలునిమృతికి కారణం ఏమిటి? ఈ భూసురుడు చెప్పిన కారణాలకు, అకాలమరణాలకూ ఎట్టి సంబంధంవుందో తెలియదు. ఇది నాపాలనకేకాక నా ప్రవర్తనకుకూడ అభిశాపరూపమైన అభియోగం. విచారించి తీరాలె" అని నిర్ణయించి "భూసురోత్తమా! శాంతించు. నీ అభియోగం అంగీకరించాను. నీ సమక్షంలోనే విచారణ జరుపుతాను. అంతవరకు ఆగ్రహముక్తుడవుకమ్ము. నీ పుత్రుడు తప్పక బ్రతుకుతాడు. ఇతరమైన దోషాలు హేతువైతే వారిని శిక్షించి ధర్మంనిలుపుతాను. లేక నాదోషమైతే నాకు నేనే శిక్ష విధించుకుని ధర్మోద్ధరణచేస్తాను. ఎలాగైనా నా అన్నమాట నిల్పుకుంటాను. నీ కొడుకును బ్రతికిస్తాను" అనిచెప్పి ఆసనంచూపించి, మృతబాలునిదేహాన్ని చెడకుండా తగిన సంస్కారంచేయించి భద్రపరచి సోదరుల వంకచూచి "తమ్ములారా! పౌరమంత్రి సేనానులనూ, వసిష్ఠవామదేవాది మహర్షులనూ త్వరితంగా కొలువునకు పిలిపించండి" అనిఆజ్ఞచేశాడు. వెంటనే భరతలక్ష్మణులు అందరిని సమావేశపరిచారు. అందరూ ఆసీనులు కాగానే రాముడు లేచి సభకు నమస్కరించి "మహాత్ములారా! అసమయంలో మిమ్మల్ని ఆహ్వానించినందుకు క్షమించండి. దీనికి పెద్దకారణం వుంది. ఈ మృతబాలుడు ఈ విప్రుని పుత్రుడు. "తాను జీవించివుండగా తనకొడుకు మరణించటం రాజుచేసిన పాపంచేతగానీ, ఎక్కడయినా జరిగిన పాపకార్యా

లను శిక్షించక ఉపేక్షించటంవల్లగానీ, జరిగింది" అని కారణం చూపి నాపై అభియోగంమోపాడు. నేను బాలుని బ్రతికించి ఇస్తానని బాసచేశాను. ఇందులో ధర్మాధర్మాలు సభవారు విచారించి దోషనిర్ణయంచేసి కర్తవ్యం నాకు ఆదేశించండి" అని చెప్పాడు. సభకుగానీ, సచివులకుగానీ అభియోగం ఛేదించటం సాధ్యంకాలేదు. అంతా కాత్యాయన మార్కండేయ మౌద్గల్య గౌతమ జాబాలి కాశ్యప వాసుదేవ నారదాదులవంకచూశారు. అది గమనించిన దేవమౌని నారదుడు లేచి "రామచంద్రా! ఈ విప్రుడుచేసిన అభియోగం ధర్మబద్ధకంగానేవుంది. ఇలా జరగటం ఈ యుగధర్మంకాదు. నీవు ధర్మ ప్రభువు. నీపాపంచేత ఈబాలుడు మరణించలేదు. ఇందుకు కారణం నేను చెపుతాను. విని ప్రతిక్రియ ఎలాచేయాలో నీవే నిర్ణయించి నీమాట నిలుపుకో. కృతయుగంలో బ్రాహ్మణులుమాత్రమే తపంచేసేవారు. బ్రాహ్మణేతరులలో తపస్విలెవ్వరులేరు. ఆ కారణంచేత బ్రహ్మసృష్టి అంతా అజ్ఞానరహితంగా ధర్మసహితంగా వుండేది. దీర్ఘదర్శనం, అమృతత్వం అందరికీ వుండేది. తర్వాత త్రేత వచ్చింది. మానవసమూహం ఆత్మజ్ఞానం కంటే మిక్కిలి వపుష్మంతంగామారింది. క్షత్రియులు బ్రాహ్మణులవలె తపం ప్రారంభించారు. దానితో సహజశక్తికంటే వీర్యవంతులైనారేకాని కృతయుగంలోవున్న క్షత్రియులకంటే తక్కువగానేవున్నారు. త్రేతలో బ్రాహ్మణక్షత్రియులు సమశక్తిమంతులుగా ప్రకాశించారు. వీరిలో ఎచ్చుతొచ్చులు ఎంచిచెప్పటంకష్టం. కృతంలో చతుర్వర్ణ ధర్మాలు మహాత్ములు లోకరక్షణార్థం, వ్యవహారసౌలభ్యం నిమిత్తం, పరస్పర సహకారసంబంధం నిమిత్తం ఏర్పరచారు. అప్పటివారు యథాతథంగా ఆ ధర్మాలుపాటించారు. త్రేతాయుగం ప్రవేశించటంతో క్షత్రియులు దేహపుష్టి, దేహశక్తికలవారై బ్రాహ్మణులతో పనేముందని స్వతంత్రులై తపస్సుచేయటంచేత బ్రహ్మజ్ఞానం కొంచవడ్డది. ఆ హేతువుచే ఒకపాదం ధర్మం నశించింది. బ్రాహ్మణులుకూడ వారి సహాయం కోరుతూ జీవయాత్ర సాగించటం మొదలుపెట్టారు. కనుక అధర్మ ప్రవేశానికి అడ్డం లేకుండా పోయింది. ద్వాపరంలో అన్ని వర్ణాలవారు శరీరక్రాంతి అధికంగా కలవారై తపశ్చర్య వెనుకకు నెట్టారు. దాంతో రెండుపాదాలు ధర్మం

నశించింది. కలియుగంలో వర్ణాశ్రమధర్మాలు పూర్తిగా సంకరమవుతై. సనాతన ధర్మాలు చావ స్తంగా కనుపిస్తై పృథివి నర్వీర్యం అవుతుంది. ఓషధులు ఆకారమాత్రంగా వుండి గుణం కోలుపోతై. మహత్తు పరమనీచుల పాదాలను ఆశ్రయించి వుంటుంది. అందుకే మూడు పాదాలు ధర్మం మరుగు పడుతుంది. మంచి చెడుగానూ, చెడు మంచిగానూ మారుతుంది. కృతయుగంలో తేజోమయ శరీరాలతో, బ్రహ్మజ్ఞానంతో జీవకోటి వుంది కనుక అనృతాన్ని (సేద్యము, లేక వ్యవసాయము) ఆశ్రయించలేదు. కృతంలో నీచంగా చూడబడిన అనృతం (సేద్యం) త్రేతలో జీవులు బ్రదుకుతెరువుకై ఆశ్రయించారు. స్వశక్తివే దేహధారణ చేసే అవకాశం నశించింది. రాజసంతో కూడిన కర్షక వృత్తి ఆలంబనం అయింది. ఈ అనృతాశ్రయంతో (సేద్యంపై ఆధారపడటం చేత. ఇక్కడ అనృత శబ్దం కేవలం వ్యవసాయాన్ని చెప్పేదే కాక ధ్వనిగా అబద్ధం ఆడటం మొదలైందని చెప్పటానికి ఉభయార్థద్యోతకంగా వాడబడింది) ధర్మహాని మొదలైంది. దాంతో దీర్ఘాయువు తగ్గింది. ఆయువు తగ్గుతుంటంతో త్రేతలో శుభాలను కోరి సత్యధర్మాలను పాటించటం జరుగుతూంది. బ్రాహ్మణ క్షత్రియులు మాత్రమే తపం చేస్తున్నారు. వైశ్యశూద్రులు పరిచర్యానిష్ఠులై పరిభవిల్లారు. అందులో శూద్రులు శుశ్రూషపరమధర్మంగా పాటిస్తున్నారు. ద్వాపరం రాగానే రెండు పాదాలతో అధర్మం ప్రవేశిస్తుంది. అప్పుడు అనృతం, (సేద్యం) అధర్మం అభ్యుదయాన్ని పొందుతై. ఎక్కువ కృషి, తక్కువ ఫలం లభిస్తుంది. వైశ్యులు "మేం మాత్రం తక్కువ ఏమిటి?" అని తపం మొదలు పెట్టుతారు. ఈ విధంగా యుగత్రయంలో వర్ణత్రయం తపస్సు చేస్తుంది. ఈ మూడు యుగాల్లో శూద్రుడు తపం చేయటానికి తగడు. నాలవయుగం కలియుగం. అప్పుడు శూద్రులే ప్రకాశంగా తపస్సు చేస్తారు. తక్కిన మూడు వర్ణాల వారు వారి ఆశ్రయంలోనే బ్రదుకుతారు. ఇది విధి నిర్ణయం. యుగధర్మం కలియుగ లక్షణం ద్వాపరంలోనే ప్రవేశిస్తే ఎంత ఘోరమో వూహించు. అది త్రేతలోనే జరిగితే చెప్పేదేముంది? ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే ఈ క్రమం లోకానికి తెలియదు. మహర్షుల్లోనే కొందరికి తెలియదు. ఇక నీకు తెలియటం ఎలా? ఇంత తెలిస్తేకాని ఈ అభియోగంపై నిర్ణయం తీసుకొన

వీలులేదు. అందుచేత చెప్పవలసి వచ్చింది. ఈ బాలుడు అకాలమరణం పాలు కావటానికి ఎక్కడో మూడు నాలుగు వర్ణాల వారిలో ఎవరో తపస్సు నిన్ను కోరి చేస్తున్నాడు. ఆతనిని గుర్తించి శిక్షించటం నీవిధి. ఇంతవరకు హేతువు తెలియక వూరుకున్నావు. అందుచే దోషం లేదు. ఇప్పుడు కారణం తెలిసింది కనుక ఆ దోషి ఎవరో గుర్తించి దండించకపోతే ఆ పాపం ప్రభువు చేసినట్లే అవుతుంది. తపంలో, అధ్యయనంలో, సుకృతకర్మల్లో ఆరవపాలు అవనీపతికి దక్కుతుంది. కాబట్టి మంచిలో పాలుపంచుకున్న మహీపతి చెడులో కూడా భాగం పంచుకోవాలి కదా? నీపాలిత దేశంలో వర్ణాశ్రమ ధర్మ వ్యతిరేకంగా ఎవరో నడుస్తున్నారు. వారిని శిక్షిస్తే ఈ బాలుడు బ్రతుకుతాడు. నీ ప్రతిన నెరవేరుతుంది. విప్రుని శోకం తీరుతుంది. ధర్మం రక్షించబడుతుంది" అని అతి దీర్ఘంగా విషయవివరం చేశాడు.

అమృతం వంటి నారదముని పలుకులువిన్న రాముడు ప్రమోదం పొందాడు. "స్వామీ! విషయం విన్నాను. కర్తవ్యం నిశ్చయించాను. రాజులకు చెవులే కాని కన్నులుండవు. నీవు కృపతో నాకు కన్నులు ప్రసాదించావు. ఇది గూఢచారులు సైతం గుర్తించలేని పరమరహస్యం. అందుచే నాకు తెలియలేదు. నా కర్తవ్యం నేరవేర్చి ఈ పామనకు సంతోషం కలిగిస్తాను. లక్ష్మణా! ఈ విప్రుని సగౌరవంగా పత్నితో ఆరాధించి సత్కరించి నేవచ్చేవరకు సంరక్షించు. జ్యేష్ఠసోదరా! పూర్వోక్తంగా ఈ బాలక మృత దేహాన్ని సంస్కరించి భద్రంగా నీ రక్షణలో వుంచు. సభాసదులారా! విన్నారుకదా వృత్తాంతం? ఇందుకే మిమ్మల్ని ఆహ్వానించాను. ఫలితం సాధించాను. పని పూర్తిచేస్తాను. మహర్షుల ఆశీర్వాదంతో అనుగ్రహింతురు గాక. ఈ నాటికి సభ ముగించుతున్నాను" అని పల్కి వారల పంపివేశాడు. పుష్పకాన్ని ఆహ్వానించాడు. అది దర్శనం ఇచ్చింది. తమ్ములకు రాజ్యం అప్పగించి అన్వేషణార్థం దాన్ని ఆరోహించి ప్రతీచిదిక్కుగా పయనించాడు. అక్కడ పరిశీలించాడు. అటునుంచి ఉదఙ్ముఖం (ఉత్తరదిక్కు)గా పోయి హిమగిరిచేరి శోధించి తూర్పుదిక్కుగానేగి అక్కడకోసి దక్షిణదిక్కుచేరాడు. ఆ ప్రదేశపరిశీలనలో శైవల వర్ణం (పాచిరంగు) వలె వున్న పర్వతం కనుపించింది. దానికి సమీపంలో సరోవరం గోచరించి ఆకర్షించింది. పుష్పకం

క్రిందికిదిగసాగింది. రసాల శాఖకు కాళ్ళు పెనవేసి అథశ్శిరస్కుడై వ్రేలాడుతూ ఘోరంగా తపస్సు చేస్తున్న మూర్తిని చూచాడు. విమానం దిగి చేరవచ్చాడు. "ఓ మహాభాగా! అబ్బురమైన విధంగా తపం చేస్తున్నావు. నిజంగా నీవు ధన్యుడవు. నీ జాతి ఏది? నీ పేరేమి? ఏంకోరి ఈ అభూత తపశ్చర్యకు సాహసించావు? నిన్నుచూస్తే నాకు ఉత్కంఠ మిక్కుటంగా కలిగి ప్రశ్నిస్తున్నాను. నేను సూర్యవంశంలో ఇక్ష్వాకుల వారసుడను. దశరథ పుత్రుడను. రాముడనే పేరుగలవాడను. నాలుగు వర్ణాలలో నీవు ఏ వర్ణానికి చెందినవాడవో దాచక సత్యం చెప్పు" మని ఆదరపూర్వకంగా రాముడు అడిగాడు.

## శ్రీరాముడు శంబుకుని వధించుట

"రామచంద్రా! శూద్రకాంతకు జన్మించాను. పేరు శంబుకుడు దేహంతోనే దేవత్వం పొందాలనీ, సర్వలోకాల జయించాలనీ సంకల్పం చేస్తున్నాను. అనృతమాడవలసిన అవసరంలేదు. నేను శూద్రుణ్ణి. నా కోరిక ఇది. సత్యం చెపుతున్నాను" అని అవనతముఖుడై సమాధానం చెప్పాడు. రాముడు వెంటనే కరవాలందూసి "తపస్వీ! నీకంఠచ్ఛేదం చేయబోతున్నాను. అందుకు కారణం విధివిహిత ధర్మాతిరిక్త కార్యం చేయటం. నేను తాపసులకు దాసుడనే. అయినా ఈ యుగధర్మాన్ని పరిరక్షించటం రాజుగా నాకెంత బలీయమో, పౌరుడుగా దాన్ని పాటించటం నీకంత బలీయం. స్వశరీర స్వర్గప్రాప్తికోరి తపం చేయటం వేరు. సర్వలోక జిగీషతో సలపటంవేరు. జాతిధర్మం పాటించపోవటం వేరు. స్వర్గప్రాప్తి నీ విధి నిర్వహణలోనే సాధించవచ్చు. సర్వలోకజిగీష అధర్మం, అహంకార సంకలితం. సృష్టికర్తకే తెలియని అనిర్వాచ్యశక్తినే అధఃకరించటం. ఈ కోరికతో ఎందరో ఇది వరకు తపస్సు చేశారు. ఆ చేసిన వారందరూ ఆ శక్తిచే ఆహరించబడ్డారు. నీవు విధి నిర్ణయానికి వ్యతిరేకంగా తపం చేస్తున్నావు కనుక నీకు స్వర్గప్రాప్తిలేదు. అన్ని లోకాలకు అధీశ్వరుడుగా వుండాలని చేస్తున్నావు కనుక నీకు పొందతగిన స్థానం లేదు. జాతిచేత, కర్మచేత, వాంఛచేత నీవు దండనార్హుడవు. ఎన్ని దోషాలున్నా నీవు మహాఘోరంగా తపస్సు చేస్తున్నావు. ఆ తపఃఫలం వృథకావటానికి వీలులేదు. అందుచే నిన్ను ఖండించి పరబ్రహ్మ

స్థానానికి మారుపేరైన మోక్షం నీకు కలిగేట్లు పరమేశ్వరుని కోరుతున్నాను" అని చెప్పి కంఠచ్ఛేదం చేశాడు. ఆ క్షణమే ఒక దివ్యతేజం అతని శరీరం నుంచి బహిర్గతమై అనంతజ్యోతిలో లీనమైంది. కమ్మని పూలవాన కురిసింది. మందమలయమారుతం వీచింది. అగ్నిపురోగములై అమరవ్రజం దేవేంద్రు నితో కూడి దివిలోనిల్చి "రామా! సురకార్యం తీర్చావు! రాజధర్మం పాలించావు. అధికారం లేని కర్మను అవిధిగా చేసినందువల్ల స్వర్గప్రాప్తి లేదు. నీచే మరణించటంవల్ల, మరణించే సమయంలో నీ దర్శనంకావటంవల్ల మహర్షుల కందరాని సాయుజ్యం సమకూరింది. లోకాపవాదానికి భార్యనే పరిత్యజింప గల్గిన నీకి తపోధనుణ్ణి శిక్షించటం సాధ్యమైంది. అధర్మం ఆచరిస్తున్నాడని తెలిసినా మేమేం చెయ్యలేకపోయాం. నీ ధర్మబుద్ధికి మెచ్చి వరప్రదానం చేయతలిచాం. కోరుకో"మ్మన్నా. "దేవతలారా! నా మీద మీకు వాత్సల్యం వుంటే నాకు వాచాదోషం రాకుండా విప్రపాలకుని బ్రదికించండి. నా పాప ఫలంగా మరణించాడు. నేను బ్రతికిస్తానని మాట ఇచ్చాను. అంతకంటె అర్థించతగిందేమీ నాకులే"దని రాముడు చెప్పాడు. "రామా! ఈ విషయంలో చింతమాను. సత్యపరాక్రముడవు. సత్యభాషణుడవు. నీకు వాచాదోషం ఎందుకు వస్తుంది? ఏ నిమిషంలో ఈ శూద్రమునిని వధించావో, ఆ ముని తేజం ఏనిమిషంలో అఖండజ్యోతిలో లీనమైందో, ఆ నిమిషంలోనే ఆబాలుడు బ్రదికాడు. తల్లిదండ్రులచేరాడు. ఆ దంపతులేకాక ఈ విషయం విన్నవారంతా నీ అమోఘశక్తిని అభినందించారు."

## శ్రీరాముడు అగస్త్యుని చూడబోవుట

వాసవుడు బాలుడు పునర్జీవితుడైనాడన్న వార్తతెలిపి "రామచంద్రా! మేము అంతా కలిసి అగస్త్యమహర్షిని చూడవోతున్నాం. ఆయన పన్నెండు సంవత్సరాలు జలాలపై పడుకుని బ్రహ్మోపాసన చేశాడు. సిద్ధిపొందాడు. దీక్షముగిసింది. ఆ మహాత్ముని అభినందించే అవసరం వచ్చింది. నీవు కూడా మాతో ఆశ్రమానికి వస్తావా? ఆ దివ్యమూర్తిని దర్శిస్తే నీకు శుభం కలుగుతుంది. నీవు మునుల హృదయంలో వాసం చేసేవాడవేకదా?" అని చెప్పాడు. తలవనితలంపుగా వచ్చిన మంచి అవకాశం సద్వినియోగం చేసుకొన సంకల్పించి రాముడు విమానా రూఢుడై సురలతో మహర్షి తపోవనానికి వెళ్ళాడు.

అరుదెంచిన అతిథులనందరినీ యథావిధి అగస్త్య మహర్షి అర్చించాడు. దేవ తలు ఆయన ఇచ్చిన ఆతిథ్యం గ్రహించి తృప్తులై దేవలోకానికి పోయారు. రాముడు నిలింపులు పోగానే పుష్పకం దిగి బ్రహ్మతుల్యుడైన కలశభవుని పాదాలకు నమస్కరించాడు. హృదయం పొంగగా స్వాగతమిచ్చి "రామా! నిరంతరచిరస్మానిహృత్సీమా! నీకు శుభం కలుగుగాక. నేను బ్రహ్మోపాసన చేశాను. అది సిద్ధించినట్లుగా నీ రాక తెలుపుతూంది. పలుకలేని ఆనందం పొందుతున్నాను. నీవు నాకు పూజ్యుడవు. అనంత కళ్యాణగుణాకరుడవు. అతిథులందరకంటె గొప్ప అతిథివి. నామానసంలో ఎల్లప్పుడు నీవే వుంటావు. దేవతలు విప్రబాలకమృతి, శంబుకవధ నాకు తెలిపారు. ఆ శూద్రమునిని వధించటం అందరికీ సాధ్యంకాదు. మోక్షప్రదాతవు కనుక సాధించావు. ఇటు దేవకార్యం, అటు ఆతనికోరిక ఏకకాలంలో నెరవేర్చిన నిన్నెంతప్రస్తుతించేది? ఈ రాత్రికి నాయాశ్రమంలోనిల్చి, ఆతిథ్యం స్వీకరించి నాకు హర్షం కలి గించు. రేపు విమానంపై అయోధ్యపోవచ్చు. నీవు ఆదినారాయణుడవు. నీలో సర్వం నిలిచింది. సర్వంలో నీవు వున్నావు. నీవు సర్వభూతవు. సనాతన పురుషుడవు. నీవు వినావేరే తెలియదగిందిలే"దని పరమభక్తితో బ్రహ్మర్షి పల్కాడు.

రాత్రి భోజనానంతరం రామాగస్త్యులు వెన్నెల బయలులో ఆసీనులై నారు. ఎన్నో ధర్మగాథలు మహర్షి వినిపించాడు. రాముడు ఎంతో శ్రద్ధగా విన్నాడు. కథానంతరం "రామా! నీ కొక దివ్యభూషణం ఇస్తున్నాను. దీన్ని అనురాగంతో గ్రహించు. ఇది దివ్యం. నిజ దివ్యతేజంతో, దివ్య రూపంతో, దీప్యమానం ఇది. నీవు కైకొన నాకు సమ్మతం. పూర్వ యుగంలో విశ్వ కర్మ తన ప్రతిభ చూపించే నిమిత్తం రచించాడు. దీనిని దివ్యులే ధరించలే మన్నారు. శక్రసమన్విత సుపర్వుల నీవు సంరక్షించే శక్తికలవాడవు. దీన్ని ధరించే అధికారం నీకొక్కనికే వుంది. అందుకే నాకు చేరిన దాని నీ కోసం భద్రపరిచాను. నా ఉపాసన ముగిసింది. సరిగా సమయానికి నీవు వచ్చావు. శాస్త్రవిహితంగా నీకు సమర్పిస్తున్నాను. అంగీకరించి నన్ను ధన్యుణ్ణిచేయి. తనకు దత్తమైన ఉత్తమ పదార్థం తిరిగి దానం చేయటం గృహస్థులకు తగిన కార్యం. కనుక అర్హుడవైన నీకు అర్పిస్తున్నాను. తీసుకో" అని అగస్త్యు

దన్నాడు. "ఆర్యా! మీ ఆజ్ఞ గడువరానిది. నేను క్షత్రియుణ్ణి. అందులో భూపతిని. మేం ఇచ్చే వాళ్ళంగాని దానం గ్రహించే వాళ్ళం కాదుకదా? షట్కర్మ నిరతులైన బ్రాహ్మణులకే ఇచ్చి పుచ్చుకునే అర్హత వుంది.భూపతి నేనై భూసురునిచే దానం గ్రహించటం ధర్మ విరుద్ధం కాదా? మీకోరికకాదన లేకుండా వున్నాను. ప్రభువుగా గ్రహించ లేకుండా వున్నాను. ఇప్పటి నా కర్తవ్యం ఏమిటి?" అని రాముడు శంక వెలిబుచ్చాడు.

రామచంద్రుడు తెలిపిన సందేహం నివృత్తి చేయనెంచి కుంభ సంభవుడు "రామా! నీకు కల్గిన శంక క్షత్రియులకు సామాన్యంగా చెప్పబడిన విధి ననుసరించి వచ్చింది. నేను దాతనూ కాను, నీవు పరిగ్రహీతవు కావు. దీనికి పూర్వం గాథ ఇలా వుంది. కృతయుగంలో పాలనార్థం ప్రభువంటూ లేడు. అటు దేవతలు, ఇటు మానవులు తమ తమ ధర్మాలు తప్పకుండా జీవించే వారు. కొంతకాలం గడచినతర్వాతదేవతలకు అధినేతగా ఇంద్రపదవి కల్పించి విధాత ఇచ్చి ఆస్థానాధిపతికి ఇంద్రుడని పేరు పెట్టాడు. ఆనాటినుంచి మహేంద్రుడు సురలను పాలిస్తున్నాడు. అది జరిగిన కొంతకాలానికి మర్త్యులు కొందరు మహాతపస్సుచేసి విధాతను మెప్పించి "అమరులకిచ్చినట్లే మాకూ మహీపతిని ప్రసాదించు. ప్రజలు పాపాల బారి పడకుండా రక్షిస్తుంటాడు" అని కోరారు. అందుకు అజుడు సమ్మతించి "లోకపాలకులారా! మర్త్యుల కోరిక మన్నించ తగిందే.మీలో ఒక్కొక్క అంశ ఈయండి.దానితో ధరానాథుని సృష్టిస్తాను" అని అడిగాడు. వారు ఆవిధంగానే తమ అంశాన్ని అజునకు ఇచ్చారు. ఈ శక్తులన్నింటినీ చేర్చి క్షుపం (మథన) చేయగా క్షుపుడనే పురుషుడు జన్మించాడు. అతనినే బ్రహ్మ క్ష్మాపతిగాచేసి ఇంద్రాంశంతో వసుమతిలో ఆతని ఆజ్ఞ చెల్లేలాగచేసి, శరీరరక్షణకు వరుణాంశం లగించి, కుబేరుని అంశతో విపులధన సమృద్ధి చేకూర్చాడు. లోకాన్ని శాసించటానికి దండధరుని అంశంగా రాజదండం కల్పించి ఇచ్చాడు. ఈవిధంగా ఏర్పడిన క్ష్మాపతిత్వంలో ఇంద్రాంశచేత ఇది గ్రహిస్తే దోషంలేదు. పరమధార్మిక ప్రభుదవైన నిన్ను అధర్మ కార్యం స్వార్థాపేక్షతో నేను చేయుమంటానా? ఇది ఒక కార్యం నిమిత్తం నాకు ఈయబడింది. అది నెరవేరింది. దీని ప్రయోజనం నావద్ద ఇక లేదు. తగినవాడవు నీవేకనుక ధరించటానికి మందనం నీకు

చేర్చుతున్నాను. అదికాక అనర్ఘ పదార్థాలు రాజులు తమంతతామే గ్రహించవచ్చు. ఇది అనర్ఘ పదార్థం. ఆసక్తితో ఈయబడిందేకాని దానభావం ఏ మాత్రం నాకులేదు. కనుక గ్రహించిన నీకు ఏదోషం లేదు" అని స్పష్టం చేశాడు. ధర్మం మూర్తిగన్న కలశభవునికోరిక ప్రకారం ఆ దివ్యభూషణాన్ని అందుకున్నాడు. "మహానుభావా! అపూర్వం అద్భుతం అయిన ఈ దివ్యాభరణం సర్వ సంగపరాఙ్ముఖులైన మీకే విధంగా ప్రాప్తమైంది? ఆశ్చర్యాభినులు కదామీరు? ఆ వార్తలు చెప్పండి" అని రాముడు కోరాడు. "రామా! ఈ కథ వినదగ్గదే. చెపుతా విను"మని మొదలు పెట్టాడు.

## శ్వేతోపాఖ్యానం

"నేను ఈ యుగ ప్రారంభంలో తపస్సు నిమిత్తం తగినచోటు వెదకుతూ యోజన పరిమితంగల అడవిని చూచాను. అది మృగపక్షి వర్జితం.అది తగిందిగా తలచి లోపల ప్రవేశించి పరిశీలించాను. ఒక ప్రదేశం ఫలవితాన మూల సుమాంలతో మోహనంగా వుంది. దాని మధ్యభాగంలో జలపూర్ణ తటాకం వుంది. చక్రవాక చక్రాంగకారండవ సంతానంతో క్రమమై, పద్మ, కైరవ శైవలాన్విత సౌందర్య విలసితమై, ఆశ్చర్యకరమై, సౌభాగ్యకరమై కనుపించింది.దానికి సమీపంగా జనవర్జితమైన ఆశ్రమాన్ని చూచాను.ఆమండు టెండలో బడలిస్నానార్థం సరోవరం చేరాను.రామా!ఆ దృశ్యం ఏం చెప్పేది? ఎంతో మనోజ్ఞమైన కళేబరం జలమధ్యభాగంలో తేలి వుంది? వయోరూప లావణ్యాలు వుట్టిపడుతున్నై. ఎంతకాలంగా ఆ నీటిలో వుందో తెలియదు. కాని జీర్ణం కాలేదు. ఎప్పుడూ పరిపుష్టంగానే వున్నట్లు కనబడుతూంది.తెలియలేని ఏదోశక్తి ఆ కళేబరాన్ని అలా వుంచుతున్నదేమో ననిపించింది. నా బుద్ధికి మాత్రం కారణం గోచరించలేదు. అదేపనిగా దాన్నిగూర్చి ఆలోచిస్తూ "ఎవ్వరిదీ తనువు? ఎందుకిలా దహనం కాకుండా నిల్వ వుంది? దీనికి విమోచనం లేదా?" అని ప్రశ్నలు వేసుకున్నాను. కాని సమాధానంరాలేదు. ఇంతలో విమాన ధ్వానం వినవచ్చింది. తలెత్తి చూచాను. మంచి వయసులో వున్నవాడు, మణిహేమ భూషణాలతో శోభించేవాడు, సుందర సురసుందరులచే వీవనలు విసరించుకునేవాడు, నిజ తేజంతో పరిసరాలను ప్రభావితం చేస్తున్నవాడు, సరోవర మధ్యస్థ కళేబరాకృతికి ప్రతిబింబమైనవాడు మేరు

పర్వతాన్ని దిగుతున్న సూర్యునివిధంగా విమానంనుంచి దిగి తటాకం చేర వచ్చాడు. వెంటనే నీటిలోదిగి పీనుగును చేరబోయి ఆబగొన్నవాని చందంగా ఆ పీనుగును పొట్టనిండేట్లు తిన్నాడు. దప్పితీర జలం త్రాగాడు. ఆచమించి శుచియై విమానం సమీపించాడు. ఇంతలో ఖండితమైన శవం యథాస్థితి పొందింది. ఇదంతా నాకు కలగా తోచింది. ఆ సురరాజ సమానుడు విమానం ఎక్కబోతుండే నేను సమీపించి ఆగమని కోరాను. "ఓ ఆశ్చర్య చరిత్రుడా! నీవెవడవు? నీపేరేమి? నీ భోగంచూస్తే దేవతలను బోలి వుంది. నీ చర్య గర్హ్యంగా వుంది. ఎవడైనా పీనుగును తింటాడా? స్వర్గవాసివై వున్నవార ఉకు మానవ శవాన్ని తినటం ఏమిటి? నాకేమీ బోధ్యంగా తోచటంలేదు. పరస్పర విరుద్ధంగా వున్న నీ చరిత్ర వినిపించగలవా?" అని అడిగాను. నా మాటలువిని ఎగాదిగ నన్ను చూచాడు. నమస్కరించాడు.

"పూజ్యుడా! నీవు కోరిన ప్రకారం నా విషాదగాథ చెపుతాను.నిన్ను చూస్తుండే నామనసు ఎంతో హాయిని అనుభవిస్తూంది. దురతిక్రమణీయమైన నాదురవస్థఏమనిచెప్పేది? నాతండ్రివైదర్భుడైన సుదేవభూపాలుడు. ఆయ నకు సహచారిణులిద్దరు. ఇద్దరివల్ల ఇద్దరు కుమారుల కన్నాడు. నేను పెద్ద వాడను. పేరు శ్వేతుడు. రెండోవాడు సురథుడు. నాతండ్రి అనంతరం నేను వేల సంవత్సరాలు రాజ్యం పాలించి, ఆయువు అస్థిరం అని తలచి, తమ్ముణ్ణి ప్రభువునుచేసి ఇక్కడ మూడువేల ఏండ్లు తపస్సుచేసి బ్రహ్మలోకప్రాప్తి నందాను. అక్కడికి చేరగానే, ఆకలి దప్పులు విపరీతంగా చుట్టుముట్టినై. వాటిబాధకు ఆగలేక అజుని పాదాలపై పడి "దేవా! నీస్థానాన్ని పొందికూడా భరించలేని క్షుత్తృష్ణలతో బాధపడటం ఏమిటి? ఏం పాపం చేశాను? ఈ కడుపుమంట ఎలా చల్లారుతుంది? నాగతి ఏవిధంగా నడుస్తుంది?" అని వాపోయాను. ఆయన నన్నుచూచి "రాజా! ఇది స్వయంకృతాపరాధం.అనుభ వించక తప్పదు. నీ తపోబలంవల్ల నా లోకాన్ని పొందావు కాని నీ పాలన కాలంలో నీవు దానధర్మాలు ఏమీ చేయలేదు. శరీరాన్ని మాత్రం శ్రద్ధగా పోషించావు. పెట్టినవారికి పుట్టిందే సాక్షి. నీవు ఎవరికీ పెట్టలేదు. నీకు ఇప్పుడు పుట్టలేదు. నీ ఆకలి దప్పులు ఎటువంటివో సామాన్యుల ఆకలి దప్పులు అటువంటివే అని అప్పుడు గ్రహించలేదు. నీ శరీర పోషణమే

పరమార్థంగా చూచుకున్నావుకనుక నీ శరీరమే నీకు ఆహారం. ఆ చెరువు నీరే నీకు దాహశాంతి. నీవు నా లోకం చేరగానే నీ మృతదేహం ఆ సరస్సులో నీ తపంలోనుంచి కొంతతీసి నశించని విధంగా నిల్వ వుంచాను. నాకు తెలుసు. నీకీ దుస్థితి వస్తుందని. ఆకలి వేసినప్పుడల్లా ఆపీనుగునే భక్షించు. అందులోని నీరే త్రాగు. నీవు తినిరాగానే ఆ శరీరం పూర్వంలాగానే వుంటుంది. ఇది దానధర్మాలను చేయనందుకు శిక్ష. తపస్సు చేసినందుకు నాతో సమానంగా ఈ లోకంలో వుండటం లబ్ధి" అని కఠినంగా చెప్పాడు. ఆ కఠోరవాక్యాలు విని భయంతో "సర్వకర్మ స్వరూపుడవైన నీకే జాలి లేకపోతే నా బ్రదుకుకు అర్థమేమిటి? తరణోపాయం ఏదయినా నాకు చూపించు. అంతవరకు నీ పాదాలు విడువను" అని ఘోరంగా ఏడ్చాను. నా దీనస్థితి చూచి "రాజా! విత్తు నాటక వృక్షం ఆశించటం సాధ్యమా? దీనికి విమోచనమార్గం చెపుతా. త్రేతరాగానే అగస్త్యమహర్షి తపస్సు చేసుకునే నిమిత్తం తిరుగుతూ ఆ ప్రదేశానికి వస్తాడు. ఆయన నిన్ను రక్షిస్తాడు. ఆ మహర్షి దేవతలనే శాసించగల తపోధనుడు. నిన్ను రక్షిస్తాడని వేరే చెప్ప నక్కరలేదు. అంతవరకు నీ బ్రదుకింతే" అని విముక్తి మార్గం తెలిపాడు. ఆనాటినుంచి నేటివరకు నన్ను నేనే తింటూ బ్రదుకుతున్నాను. ఇంతకాలం గడచినా ఈ ఆకలి దప్పులు నన్ను వదలలేదు. ఇది త్రేతాయుగం. నీవు ఘటజన్ముడవు. నీవుగాక ఇతరులకు ఈ ప్రదేశం చేరరానిది. నాజ్ఞానసంపత్తిచే నిన్ను గుర్తించాను. నీ దర్శనంతోనే నాకు శాంతి కల్గింది. నేనే పాపం చేయకపోయినా, పుణ్యకర్మ ఏదీ చేయలేదు. తపస్సు దివ్యానుభూతినిస్తుంది. కాని లౌకికఫలాన్ని ఇవ్వదు. అందుచేత నావద్ద దివ్యతేజో విలసితమైన భూషణం వుంది. అది గ్రహించి నన్నీ పాప కూపంనుంచి పైకి తీయి. నీ మహిమ అపారం. నీవు దయాస్వరూపుడవు" అని కాళ్ళపై పడి గట్టిగా పట్టుకుని ప్రార్థించాడు. ఆ మహారాజు జీవితగాథ విని హృదయం ద్రవించింది. మనస్సులో ప్రార్థించి పరమేష్ఠి అనుమతి పొంది ఈ అలంకారం పుచ్చుకున్నాను. శ్వేతుడు భూషణం నాచేతిలో పెట్టగానే తొల్లిటిమర్త్యకాయం సరస్సులోనుంచి మాయమైంది. ఆక్షణమే అవనీపతికి ఆకలిదప్పులు నశించినై. వలగొని మ్రొక్కి దివ్య తేజంతో శ్వేతుడు బ్రహ్మలోకానికి వెళ్ళాడు.

ఆవిధంగా భూషణం నాకు సంక్రమించింది. ఇదిఇచ్చి ఆతడు తరించాడు. నీకిచ్చి నేను తరిస్తాను. నీకు ఎటువంటి దోషం సంక్రమించదు. నీకు పూర్వంకంటే తేజస్సు పెంచుతుంది" అని చెప్పాడు.

## అగస్త్యుడు దండకారణ్య చరిత్ర రామునకు వినిపించుట

"దేవా! ఎంత విచిత్రగాథ వినిపించావు? ఇందులో ఎన్ని రహస్యాలు ఇమిడివున్నై? ఈ శ్వేతభూపతి తపంచేసిన అరణ్యం విగత జీవకోటి అని చెప్పావు. అరణ్యం అలా వుండటం సంభవమా? మానవేతర ప్రాణికోటికి అరణ్యాలేకదా ఆవాసభూములు? అట్టిచో ఈ వైవిధ్యం ఎలా సంభవించింది?" అని రాముడు ప్రశ్నించాడు. "రామా! ఇది ఇంకొక విచిత్రగాథ.కృతంలో సర్వ జగత్తును మనువు పాలించాడు. ఆయనకు ఇక్ష్వాకు నామంగలపుత్రుడు కలిగాడు. ఆతడే మీ వంశ కర్త. ఆయన శక్తి సంపదలు నీకు చెప్ప నక్కరలేదుగదా? ఆతడు యుక్తవయస్కుడు కాగానే రాజ్యాధికారం అప్ప గించి "నాయనా! లోకంలో రాజ వంశాలకు నీవే మూల పురుషుడు. నీవు చతుర్విధోపాయాలతో ప్రజల పాలిస్తూ ధర్మాన్ని రక్షించు. నీ అనంతరం క్రమ క్రమంగా అనేక దేశాలు, అనేకరాజ కుటుంబాలు ప్రవర్తిల్లుతై. వాటికి నీపాలనం ఆదర్శమవుతుంది. కనుక, చెప్పుడు మాటలువినిగానీ, స్వార్థాన్ని కాంక్షించిగానీ, విచారించి సత్యం తెలుసుకోకుండా ఎవరినీ దండించవద్దు. ఎవరికి నిర్ణయించిన ధర్మం వారు సరిగా నిర్వహిస్తే పొందదగిన ఉన్నత స్థానాలన్నీ పొందుతారు" అని ఉపదేశంచేసి బ్రహ్మలోకం చేరాడు. ఆయన తర్వాత ఇక్ష్వాకుడు ధర్మం నాల్గుపాదాల నడిపిస్తూ అనేక సత్క్రతువులు ఆచరించి సూర్యవంశ సంతానాన్ని ధర్మరతులనైనవారిని కన్నాడు.వారిలో చివరి వాడు జ్ఞానహీనుడూ, నీతి శూన్యుడూ, విద్యారహితుడూ అయి, అను జన్ముల గౌరవించక, పెద్దల పూజింపక దుర్మదుడై సంచరించ సాగాడు. వాని ప్రవర్తనను తండ్రికి పరమాసహ్యం వేసింది. దండం తప్పదని తల చాడు. దండుడనే నామకరణంచేసి, ప్రమాదభూయిష్ఠమైన ప్రదేశం ఎక్కడ వుందని అన్వేషించి వింధ్య శైవలనగాంతరభూమిని ఎన్నికచేసి దానికిరాజుగా

తగిన పరివారంతో పంపాడు. అక్కడ మధుమంతం అనే పేరుతో రాజధాని నిర్మించి, శుక్రుణ్ని ఆరాధించి పురోహితుడుగా గ్రహించి ఇంద్రుడు స్వర్గం లాగా గండుడు మధుమంతాన్ని పాలించటం మొదలుపెట్టాడు. అతని వర్తనంలో మార్పుమాత్రం రాలేదు.

అనేక హాయనాలు గడిచినై. ఒకనాటి వసంతకాలంలో భార్గవాశ్రమ దర్శనార్థం దండుడు పోయాడు. ఆ సమయంలో వనంఅంతా వసంతశోభతో వెలిగిపోతూంది. ఆ సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ దండుడు విహారంచేస్తూ నవ యౌవనంతో కనులు మిరుమిట్లుకొల్పుతున్న సుందరిని చూచాడు. చూచిన చూపులోనే మన్మథశరపీడితుడైనాడు. సరభసంతో ఆ లతాంగి సరసకుపోయి "సుందరీ! నిన్ను చూచి మనస్సు నిగ్రహించుకోలేకపోతున్నాను. నీ వెవ్వతెవు? ఈ వనంలో ఒంటరిగా ఎందుకు సంచరిస్తున్నావు? నా వలపు తెలిసి నన్నాదరించు" అని చెప్పాడు. ఆ పలికేవాడు మోహమత్తుడూ, విచక్షణాహీనుడూ, క్రూరుడూ అని గుర్తించి "కాముకుడా! ఈ వనం నా తండ్రి దైత్యగురువు శుక్రాచార్యులది. నేను ఆయన బిడ్డను. అరజ అని నన్ను పిలుస్తారు. నాపై నీకు వాంఛవుంటే నా తండ్రిని అర్థించు. ఆయన సంతోషంతో నన్ను నీకు ప్రదానంచేస్తాడు. అంతవరకు త్వరపాటుతో నన్నంటకు. అంటి మంటలో పడ్డ శలభానివి కాకు. నేను తండ్రిచాటుదాన్ని. కన్యను. స్వతంత్రనుకాను. ఆయన నీకు గురువుకనుక తప్పక అంగీకరిస్తాడు. నా మాట వినక తొందరపడితే ఆయన ఆగ్రహానికి గురిఅయి నశిస్తావు. నా తండ్రి అందరివలె చీటికి మాటికి ఆగ్రహించడు. కోపగిస్తే కులాచలాలతో కూడిన విశ్వంభర క్రుంగిపోతుంది. సృష్టి నశిస్తుంది సుమా. ఆలోచించుకో" అని అరజ దండునితో అన్నది. శిరస్సుపై చేతులుమోడ్చి "సుందరీ! ఎప్పుడో ప్రాణహాని వస్తుందంటున్నావు. నీవు కాదంటే ఇప్పుడే ప్రాణాలుపోతై. కాలవిలంబనం సహించలేను. నీ తండ్రి చంపితే చంపుగాక. శపిస్తే శపించుగాక. నీ పొత్తుకై అన్నీ భరిస్తాను" అని బలాత్కరించి సిగ్గువెరచి మధుమంతానికిపోయాడు. దుర్మార్గుడు శీలభంగం చేయగానే తేజోహీనురాలైంది అరజ.

గోడుగోడున ఏడుస్తూ అరజ తండ్రి ఆశ్రమానికిపోయి నేలపడిదొర్లి తనకు జరిగిన అవమానాన్ని భరించలేక ఆత్మహత్యకు పాల్పడింది. ఈసంగతి

శిష్యులు గురువునకు చెప్పారు. అది విని ఆ పరమ తపోధనుడు బాధరుషావశుడై ఆశ్రమానికివచ్చి ఆత్మజాత దీనస్థితిని చూచి సంగతి విని "ఓరీ మూర్ఖుడా! తండ్రిచే దండితుడవై నన్నాశ్రయించి రాజువై నా పుత్రికనే పరాభవించావా? కన్నులు తలకెక్కి కాలభుజంగం తోక త్రొక్కావా? క్షణకాలం నిగ్రహించుకోలేక శాశ్వతశిక్షను ఆహ్వానించావా? అగ్నిశిఖల ఆలింగనం చేయతలచావా? ఈ అసమమహాఘకార్యానికి అర్హఫలం ఇప్పుడే అనుభవించు. నీ పాలితదేశం సప్తరాత్రుల పాంసువృష్టితో పాడైపోవుగాక. ఆ రజోవృష్టిలో యోజనశతమైన భూభాగం చరాచర జనసహితంగా సర్వనాశం పొందుగాక! ఛాత్రులారా! వెంటనే ఇచటినుంచి వేరుచోటికి ఆశ్రమం మార్చండి. అమ్మా అరజా! నీ విక్కడే వుండు. నీవు విచారంమాని తపస్సు చేసుకుంటూ జీవిత పరమావధి సాధించు. ఈ సరోవరం ఆశ్రయించి యోజన దూరం మాత్రం ఏ కీడూ రాదు. పాంసువృష్టి ప్రళయంలో చెదరి ఈ ప్రదేశం చేరిన జంతువులు నశించక నీకు సహకారులుగా వుంటై. అంతకంటే ఆత్మజవైనా నేను నిన్నుద్ధరించలేను. ఛాత్రులతో నేను వెడలిపోతున్నాను. నీవు నేను చెప్పిన విధంగాచేసి జన్మ సార్థకం చేసుకో" అని పల్కి వెళ్ళిపోయాడు. అరజ దుఃఖార్తయై ఆశ్రమంలో మూర్ఛపోయింది అసురగురుడు పోగానే సంవర్తక మేఘాలు సంఘటితమై సప్తరాత్రాలూ పాంసువృష్టికురిసి ప్రళయంకల్పించినై. దండుడు, అతని దండు, అతని భటులు, ఆ ప్రాంతాల్లో వసించే పౌరులు రూపనామాదులు లేకుండా పాంసు ప్రళయంలో కలిసిపోయారు. దండుని విషయంగా ముని వేదండుడు శపించినకారణంగా ఆ రాజ్యం నేలపాలు కావటం వల్ల అంతమేర దండక అనే పేరు పొందింది. కొంతకాలం నడచిన పిదప క్రమంగా తాపసులు ఆశ్రమాలు నిర్మించుకుని తపం చేయసాగారు. ఆ కారణంవల్ల జనస్థానం అనే పేరు వచ్చింది. అక్కడే నీవు ఒక్కడవే ఖరదూషణాది రాక్షసుల పదునాల్గువేల మందిని వధించింది. నీవు అడిగిన వాటికన్నింటికీ తెలిసినంతవరకు చెప్పాను. ఇక శయనించు. ఇదిగో దివ్యాభరణం. గ్రహించు"మని ఇచ్చాడు. రాముడు పరమ భక్తితో గ్రహించి కనుల కద్దుకుని ధరించాడు. మహర్షి ఆశ్రమంలో ప్రవేశించాడు.

# అగస్త్యుని అనుమతి గొని రాముడు అయోధ్యకు మరలివచ్చుట

రామచంద్రుడు శేషకాలం సుఖంగా శయనించాడు. తెల్లవారకముందే లేచి ఆహ్నిక విధులన్నీ తీర్చి కుంభసంభవుని దర్శించి పాదార్చన చేసి "మహాత్మా! ఆజ్ఞ ఇస్తే అయోధ్యకు వెళ్ళుతాను. నీ దర్శనంతో ధన్యుడ నయ్యాను. నీ అపార కృపాధనం సంపాదించాను. ఇకపై తరచుగా నీ దర్శనార్థం వచ్చి ధర్మ రహస్యాలు, జన్మ కర్మ సంబంధ రహితమార్గాలు విని పవిత్రుడనవుతాను" అని వినయంగా సెలవు వేడుకున్నాడు. రాముని వినయ సూక్తికి మహర్షి హర్షోత్ఫుల్లహృదయుడైనాడు. "రామా! నీ వినయ సంపదకు జోహారు. నీ వంటి పరమ పావనమూర్తి వేరెక్కడా లేదు. ఇది నిజం. నా దర్శనంవల్ల నీకు పవిత్రత ప్రత్యేకించి ఏమీరాదు. నీ రాకవల్ల నా ఆశ్రమం నేనూ పవిత్రత పొందుతాం. నిన్ను విడువక నుతించేవారు ఎట్టివారైనా భవ సాగరం తరిస్తారు. భూజనులు నీ పాలనచే, నీ లాలనచే, నీ దర్శనంచే శుభాధ్వసీమ పొందుతారు. పోయిరా. నయమార్గంతో భూభారం వహించు" అని సెలవిచ్చాడు. రాముడు అక్కడి ముని శ్రేష్ఠులందరికీ మ్రొక్కి అనుమతి నంది పుష్పకం అధిరోహించాడు. మునుల ఆశీస్సులతో ఇంద్రుడు అమరులచే సెలవంది మందిరానికి పోయినట్లు బయలుదేరాడు. వార్షికాబ్దనికట చంద్రుడులాగా రాముడు పుష్పకంలో పొల్చాడు. అభ్రమధ్యంలోఅర్కుడు చేరేసరికి రాముడు అయోధ్యచేరి నడిమి కక్ష్యలో అవతరించి, "ఓ విమాన రాజమా! నీకు ధన్యవాదాలు. నీవు మరల ధనేశుని సేవించ పొమ్ము" అని సెల వొసంగి తన రాకను తమ్ములకు ద్వారపాలకుని ద్వారా తెలిపి లోనికి వెళ్ళాడు.

మాధ్యాహ్నిక విధులు ముగించి మాతృ మందిరానికి వెళ్ళి హృదయ పూర్వకంగా వృద్ధమాత భోజనం పెట్టగా భుజించి నిజ మందిరంలో భ్రాతల రాకకు వేచిచూస్తూ పవళించాడు. ప్రవేశ ఘంటిక మ్రోగింది. వెంటనే ఆలోచనా మందిరం ప్రవేశించి అనుజులను రమ్మని అనుమతితెలిపాడు. తమ్ములు రాగానే ఎదురుపోయి ప్రేమ పూర్వకంగా పరిరంభం కావించి ఆసనాలం

కృతులు కమ్మని ఆదేశించి తాను తన పీఠంపై కూచున్నాడు. తన ప్రయాణం లోని విశేషాలన్నీ వివరించాడు. విప్రుని కుమారుడు జీవించి తలిదండ్రులతో స్వస్థానం చేరినందుకు సంతోషించాడు. "అనుజులారా! రాజ్యం సుభిక్షంగా వుంది. పౌరులు నీతిపరులై స్వధర్మ నిర్వహణంలో సక్తులై సుఖిస్తున్నారు. పర్జన్యుడు కాలం తప్పక వర్షించి భూమండలాన్ని సస్యశ్యామలంచేస్తున్నాడు. ఈతిబాధలు లేవు. సామంతరాజులు, స్వతంత్రరాజులు అయోధ్యా సింహాసన గౌరవం పాటిస్తామని మాట ఇచ్చి అలాగే నడుచుకుంటున్నారు. కనుక మంత్రాంగంతో పనిలేకుండాపోయింది. ఇక దేవతాప్రీతిగా సత్క్రతువులు చేయ సంకల్పించాను. అక్షయ్యం, అఘవారణం, ధర్మసేతువు, ధర్మవర్ధకం, అవ్యయం, అయిన రాజసూయం మీతోడ్పాటుతో ముందు మొదలుపెడతాను. ఆ విషయం మీతో చెప్పి మీ అనుకూల ప్రతికూల భావాలను వినదలచి పిలి పించాను. ఎవరిహృదయంలో ఏముందో దాచకుండా తెలుపండి. బాంధవ్యం వేరు. గౌరవం వేరు. ఇక్కడ అవి పాటించవద్దు" అని చెప్పాడు. "ఇది కష్టసాధ్యమైన క్రతువు. దీనితో ధర్మం వర్ధిల్లుతుంది. ఇది చేసే మిత్రుడు వరుణుడై మేటిస్థానం పొందాడు. ఇదికాకపోతే ఏ క్రతువు చేయాలో మీరే నిర్ణయించండి. నాకు ప్రత్యేక నిర్ణయం అంటూ లేదు. కనుక స్వేచ్ఛగా మీ అభిప్రాయాలు తెలుపండి" అని కూడ చెప్పాడు. అన్న మాటలు ఇరువురు శ్రద్ధగా ఆలకించారు.

భరతుడు లేచి అంజలించి "అన్నా! ఇది అన్ని విధాలా క్రతువులు చేయటానికి తగిన కాలం. సకాలంలోనే నీకు సత్సంకల్పం కలిగింది. ఈ ప్రస్తావన ఎప్పుడో ఒక్కప్పుడు నీవు చేస్తావని నాకు తెలుసు నీ స్థాయికి రాజసూయం తగినదని భావిస్తావని కూడ తెలుసు. అందుకే ముందుగా ఆలో చించి వుంచాను. నీ పరిపాలనలో, నీ నిత్యకర్మలో వసుంధర ధర్మదేవతాను గ్రహంతో నిజంగా వసుంధర అయింది. అమరులు అజుని సేవించినట్లు అవనీపతులు నీ ఆజ్ఞానువర్తులేకాక అనురాగమూర్తులై వర్తిస్తున్నారు. పౌరులు తండ్రికంటె అధికంగా ప్రేమిస్తున్నారు సమస్త భూతకోటికి ప్రాణం నీవు. ఇటువంటి మహానుభావునకు ఈ సంకల్పం ఎందుకు కలిగిందో తెలియలేకు న్నాను. ఈ అధ్వరమందే నృపవంశ నాశనం ఎంతగానో జరుగుతుంది.

రోషాలు పుడుతై. "మనమిచ్చే గౌరవం చాలక మనకున్న ఈపాటి స్వాతంత్ర్యం కూడా ఎందుకుండాలని ఈ హేతువుగా అపహరించాలని తలంచుతున్నాడని మిత్రరాజులకు శత్రుభావం కలుగుతుంది. దాంతో సంఘర్షణలు ప్రారంభమై జన నష్టం మితిమీరి కలుగుతుంది. భయంకర యుద్ధాలు జరిగి ధరిత్రి రక్తంతో తడుస్తుంది. ఈ విశ్వంభర నీ ఏలుబడిలో నిరపాయంగా, శాంతి సుఖాలతో నిండివుండగా ఏ కారణం లేకుండా యజ్ఞం పేరుతో విలయం కల్పించే సంకల్పం నీవు చేయటం తగవా? నిర్మల జలతటాకంలో రాయి విసరి సంక్షోభం కలిగించిన చందం కాదా ఇది చేయటం? ఈ కారణాల పురస్కరించుకుని రాజసూయం మాత్రం చేయవద్దని నా తలంపు. నేనేమైనా తెలియక భాషిస్తే ఆదరం ప్రధానంగా క్షమించు" అనిపల్కి ఆసీనుడైనాడు. అమృతో పమానాలైన అనుజుని వాక్యాలు విని రాముడు "సోదరా! తథ్యం అయినదేకాక విశ్వభూత హితం అయిన సలహా ఇచ్చావు. ఇటువంటి గుణవంతుడవు కనుకనే రాజధాని వదలి గ్రామంలో నివసించి జటివై పాలించినా ధర్మం నాల్గుపాదాల నడిచింది. నీ హితవు పాటించి ఆ క్రతుచింత విడిచి పెట్టాను. భూపతి ప్రజలకు సుఖశాంతులు కలిగించాలే కాని అకారణ కష్టాలు కల్పించటం ధర్మం కాదు. బాలురు పల్కిన వాక్యమైనా శుభ ప్రతిపాదకంగా వుంటే అవశ్యం గ్రహించుమని పెద్దలన్నారు. అందుచే సుమతివి నీవు చెప్పిన హితం శుభదమైంది కనుక గ్రహించాను. నీవు బిడియపడవద్దు."

## లక్ష్మణుడు వృత్రువధ కథ రామునితో చెప్పుట

అనిపల్కి "అనుజులారా! ఇది మానుకున్నా ఇంకోటైనా చేయాలని వుంది. పేరు గల్ల క్రతువుల్లో ఏదిచేస్తే బాగుంటుందో ఆలోచించి మీరే నిర్ణయించండి" అని కోరాడు. సౌమిత్రి లేచి చరణాభివందనం చేసి, "అన్నా! నాకు తోచిందే నేనుచెపుతాను.అశ్వమేధం అన్నిక్రతువులకంటే అధికఫలకారి. ఆ క్రతువులో జనక్షయంకాని,శత్రు మిత్రభేదంకాని,రాగద్వేషాలుకానివుండవు. తెలిసితెలియకచేసిన సర్వపాపాలు నశిస్తవి. దేవేంద్రుడు వృత్రునిచంపితెచ్చుకున్న బ్రహ్మహత్యా దోషం ఇది చేసి పోగొట్టుకోలేదా? ఆ కథను పెద్దలు

ఈ విధంగా చెప్పగా విన్నాను. శతయోజన విస్తృతి, దానికి మూడురెట్లు వున్నది గలవాడైన వృత్రుడనేవాడు మూడు లోకాలను ఇంద్రుని కాదని పాలించాడు. నెయ్యంలోనూ, తియ్యంలోనూ ఎవరు చూపని నేర్పు చూపించాడు. ఆతడు ధర్మజ్ఞుడు, ప్రాజ్ఞుడు, కృతజ్ఞుడు. ఆతని పాలనలో వసుధ కామధేనువులాగా కామితాలు ప్రసాదించింది. క్రమమూల ఫలాలు, కుసుమ సంతానం వృక్షాలు కొరత లేకుండా కూర్చినై. ధాత్రి దున్నకుండానే ఫలించింది. ఈ విధంగా చాలా కాలం పాలించి "విషయ సుఖాలన్నీ బంధనాలు. శరీరం అశాశ్వతం. శాశ్వతమైనది బ్రహ్మలో లీనం కావటం. దానికి తపం తప్ప వేరే మార్గం లేదు" అని భావించి జ్యేష్ఠసుతుని మధురాపురానికి ప్రభువును చేసి, వనంలో అనుపమతపం ఆచరిస్తున్నాడు. ఆతని పాలనలోనే శక్తిహీనులుగా జీవించిన దేవతలు ఆతడు చేస్తున్న తపస్సు చూచి, ఎన్నడూ లేని ఎక్కడా ఎరుగని వ్యథ పొందారు. శాశ్వతంగా త్రిలోకాధిపత్యం వృత్రునికే దక్కుతుందని ఇంద్రుడు భయపడి చక్రధరుని సన్నిధి చేరి తన బాధంతా వెళ్ళబోసుకున్నాడు. "ఆతని తపోగ్నికి దేవలోకం అట్టుడికినట్లు వుడికిపోతూంది. దిక్పాలురేకాక నేనూ అశక్తుణ్ణి అయ్యాను. యుద్ధంలో జయించటం సాధ్యంకాదు. తపోభంగం అంతకంటే దుస్సాధం.నాగతి ఏమిటి? ఈ తపం ఇలా సాగితే నా వునికివల్ల ప్రయోజనం వుండదు. నేనే గాక ఈ సర్వజగత్తు ఆతనికి విధేయంగా బ్రతకాలి. దేవా! ఎన్నో విపత్తుల్లో నన్నాదుకున్నావు. నాకై నిర్ణయించిన కాలం ఇంకా ముగియలేదు. విధి నిర్ణయం వ్యర్థమైతే పునస్సృష్టి మాత్రం సాధ్యమెలా అవుతుంది? నీవు గాక పరిష్కరించే దైవం ఎవరున్నారు? నీ అనుగ్రహం పొందిన వాడు కావటం చేత ముల్లోకాలు లోగొన్నాడు. అన్యథాశరణం నాస్తి, త్వమేవ శరణంమమ" అని అమరపతియై కూడ అతిసామాన్యులకంటే ఆర్తితో పాదాలపైబడి వేడుకున్నాడు. ఇంద్రుని వలపోత విని శ్రీమహావిష్ణువు మౌనమూర్తి అయినాడు. "జగన్నియామకా! ఆర్తశరణ్యా! సాధుచరిత్రులైన బృందారకులు నీఅభయం కోసం అర్రులుచాచి వేచి వున్నారు. ఆతడు నీ శక్తితోనే ఇంతవాడయ్యాడు. ఇతరులకిది దుస్సహం. అనుగ్రహించే వరకు ఈ దాసుడు నిన్ను వదలడు. దీనికి తరణోపాయం ఏమిటో నాకు చెప్పు. నీకు మాపై అనురాగం లేకపోతే

లేదనిచెప్పు. ఆతనినే శరణుచొచ్చి మా అమృతత్వాన్ని హరించి దావు ప్రసాదించుమని వేడుకుంటాం" అని ఏడ్చాడు.

మౌనమూర్తియైన ముని హృత్సంచారి శ్రీవిష్ణువు "మహేంద్రా! నేను సౌహృదబద్ధుణ్ణి. ఆతనిలో ఏ లోపం లేదు. అన్ని అర్హతలు ఆతనికున్నై. మీ మేలు కోసం ఆ పరమభక్తుణ్ణి నేను చంపను. నాకంతా తెలుసు. ఆతని మరణం నీచేతనే జరుగుతుంది. అలాగే విధి లిఖించాడు. ఆయవకాశం పురస్కరించుకుని మీకు క్షేమం కలిగే ఉపాయం చెపుతాను. నా తేజస్సు నీయందూ, నీ శతారమందూ, ఆతడున్న ప్రదేశమందూ, నిలుపుతాను. అప్పుడు ఆతడు నీచే వధ్యుడవుతాడు. ఇంతకంటే వేరే మార్గంలేదు. ఆ విధంగా ఆచరించి ఫలానుభవం పొందు"మని చెప్పాడు. వెంట వచ్చిన వేల్పులంతా ఆదిదేవుని అనేక విధాల నుతించి, "దేవా! దిక్కుమాలిన మేం నీ కృపవల్ల మళ్ళీ దిక్కుగల వాళ్ళమైనాం. ఆ దైత్యవధ సలిపే సమయంలో ఇంద్రుణ్ణి నీవే కాపాడాలె. ఆతని తేజం అసామాన్యం కదా?" అని విన్నవించి సెలవంది మహేంద్రునితో వృత్రుని తపోవనానికి పోయారు. సర్వసృష్టి మరచి ఆత్మదర్శనంలో లీనమైన ఆ తపోరాశిని దేవతలు సమీపించలేక పోయారు. ఇంద్రుడు విష్ణుతేజం ఆక్రమించినందున నిరాటంకంగా దరిసి ఘోరవజ్రహతి శిరశ్ఛేదం చేశాడు. కంఠం తెగిన వెంటనే సముద్ర నిర్గత బడబాగ్నివలె బ్రహ్మహత్య మహాపాపం భయంకర భూతరూపంగా ఇంద్రునిపైకి దూకింది. ఆ దుస్సహ భూతాన్ని చూచి పాకశాసనుడు భయపడి పారజొచ్చాడు.

శచీపతి పదవీ భ్రష్టత్వప్రాప్తిస్తుందేమోయని ఏ పాపం చేయని, మహా తపస్సంపన్నుని ఘోరంగా హత్య చేశాడే కాని, ఆ పాపం భరించరాని ఆకృతితో పైనబడితే నిగ్రహించుకోలేక లోకాలన్నీ చుట్టుముట్టాడు. నీడవలె వదలక వెంటబడి భూతం తరుమసాగింది. అందితే ఆ క్షణంలో ఇంద్రుడు ఏమవుతాడో ఎవరికీ తెలియదు. ఏ లోకంలోనూ రక్షణ లేక అన్ని లోకాలకు అవతల అంధతమస్సులో దాక్కున్నాడు. అమరులు నష్టమతులు, ప్రష్ట మహేంద్రులు, అగ్నిపురోగములు అయి రమాపతి సన్నిధానం చేరి బహుకాలం సపర్యలు చేసి "దేవాదిదేవా! మహానుభావా! జగత్పరిపాలన బాధ్యత వహించి ఇంత వరకు ఏ లోపం దేవతలకు కలుగకుండా

కాపాడావు. నీ ఆనతి ప్రకారమే వృత్రుని సంహరించాడు. అది బ్రహ్మ హత్యగా మారి భయంకర భూతరూపం దాల్చి వెంటపడింది. అతడు చచ్చింది నీ శక్తిచే. వచ్చింది పాపం పాకశాసనునకు. ఆయన దుష్కృతికి ఆహుతి కాకుండా బయట పడే ఉపాయం చెప్పు. మాకూ,వాసవునకూ నీవే శరణ్యం" అని ప్రాధేయపడ్డారు. వారి గోడు ఆలకించి "సురలారా! మీ విన్నపం విన్నాను. ఇంద్రుడు బ్రహ్మహత్యా దోషం నుంచి విముక్తి పొందే మార్గం చెపుతా వినండి. మీరంతా కలసి అతనిచే అశ్వమేధయజ్ఞం చేయించండి. అది పూర్తికాగానే అతని పాపాన్ని హరిస్తాను.పోయిన దివ్యశక్తులన్నీ చేకూరుత్తై. మళ్ళీ ఇంద్ర పదవిలో ప్రతిష్ఠితుడవుతాడు. ఆ విధంగా ఆచరించండి" అని తరణోపాయం లక్ష్మీపతి అమరులకు చూపించాడు. వారంతా మహేం ద్రుని వెన్నాడుతున్న పాపభూతాన్ని గుర్తించి, కనుమరగించి అంధతమ సంలో ప్రవేశించారు.

పాపులకు తప్ప ప్రవేశంలేని అంధతమసంలో దాగిన అమరపతి తాను చేసిన క్రూరకృత్యానికి పరితాప పశ్చాత్తాపాలు పొందాడు. సర్పం లాగా నష్టమతి గత చేతనుడై దిక్కులేక, మార్గాంతరం కానరాక అల్లాడు తుంటే, అతని అంశతో లోకాన్ని సమృద్ధవంతం చేసే శక్తి నశించటంతో లోకాలు తపించినై. అరణ్యాలు, పూలతోటలు, ఫలవృక్షాలు మూలముట్టుగా ఎండిపోయినై. నదీనదాలు, సరోవరాలు, కూపాలు, తటాకాలు శోషించినై. కరవుకాటకాలు విలయతాండవం చేయజొచ్చినై. భూతకోటి నామమాత్రావశి ష్టంగా మిగిలింది. ఎట్టకేలకు నిలింపులు ఇంద్రుని గుర్తించారు. శ్రీవిష్ణు సందేశం వినిపించారు. మహా తపస్సంపన్నులైన మహర్షులతో, దిక్పాలురతో కలసి అశ్వమేధాన్ని అమరేశునిచేత చేయించారు. సవనానంతరం బ్రహ్మ హత్యా మహాఘం దేవతలకడ కరుదెంచి "సురలారా! మహర్షులారా! ఇంద్రుడు హత్యా దోషం నుంచి విముక్తిపొందాడు. నేనాతని విడిచిపెడుతున్నాను. నాకు ఉండేచోటు కావాలె. అది నిర్దేశిస్తే, నేను అక్కడికి పోతాను" అని చెప్పింది. వారంతా "కలుషభూతమా! నీవు సంపూర్ణ దేహంతోవుండే ప్రమా దం వుంది. నీవు నాల్గుభాగాలై నీ ఇష్టం వచ్చిన చోట నిల్వు. మళ్ళీ మహేం ద్రుని వంక తలెత్తి చూడకు" అని శాసించారు. అందుకు అఘం "పూజ్యు

లారా! వాన కారు నాలుగు నెలలు నదులను ఆశ్రయించి వుంటాను. ఆ సమయంలో కామవారిణినై, కలుషమానస దర్పనాశినినై పూర్ణంగా పారే ప్రవాహాల్లో వుంటాను. ఒక భాగం ఇది. రెండవ భాగం ధరలో ఊషర క్షేత్రం (చవిటినేల) గా వుంటాను. మూడో భాగన యౌవనవతులలో రజో దోషంగా మూడు దినాలుంటాయి. మిగిలిన నాల్గవ అంశతో సాత్వికులైన బ్రాహ్మణులను కల్లలాడి, వంచన చేసి చంపే వారిలో వుంటాను. ఇందుకు మీరు సమ్మతిస్తే ఆ విధంగా ఆచరింమతాను" అని తను నివసించే పద్ధతి హత్యాఘం తెలిపింది. అందుకు వారంతా ఆమోదముద్ర వేశారు. భూతం చతుర్విధాలుగా విభాజ్యమై అదృశ్యమైంది. బ్రహ్మహత్యా దోషపంకంనుంచి విష్ణుదేవుని కృపాలోకనంతో బయటపడిన మఘవుని యథామర్యాదలతో దేవతలు స్వర్గలోకానికి కొనిపోయి బృహస్పతి, మహర్షులు వేదపఠనంతో ఆశీర్వదించగా సింహాసనంపై ప్రతిష్ఠించారు.

## రాముడు సౌమిత్రికి ఇలుని వృత్తాంతం చెప్పుట

అని సౌమిత్రి అశ్వమేధ సవనం ఎంత ముఖ్యమైందో, ఎంత శక్తిమంతమైందో చెప్పాడు. ఆలకించిన రాముడు హర్షంతో పొంగిపోయాడు. "సోదరా! నీమాటలు బంగరు మూటలు. కంటక రహితమైన బాటలు. సమృద్ధంగా వున్న పేటలు. వృక్షలతా మండితమైన పూదోటలు. అశ్వమేధం అట్టి మహత్తు కలదే. సందేహంలేదు. పూర్వం కర్దముని పుత్రుడు ఇలాభిధేయుడు బాహ్లికేశ్వరుడు ధారుణి అంతా తన వశంలో వుంచుకుని ధర్మం తప్పక పాలించాడు. వేల్పులు, రాక్షసులు, దనుజులు, నాగులు ఆ ధర్మ ప్రభువును తత్పరులై భజించేవారు. ఆతడు భృకుటి బంధనంచేస్తే భువనాలు కంపించుతై. ఆతడు మచ్చలేని మహీపతి. త్రిభువన సంతోషదాయకంగా పాలించుతుండగా ఒక కాలంలో వసంతం వచ్చింది. ఆ సమయంలో బల భట వాహయుక్తుడై భయంకరారణ్యానికి మృగయాభిరతితో పోయి, అనేక జంతువుల చంపి, తృప్తి పొందక ఇంకా దూరం పోయాడు. అది షడాననుడు ఉదయించిన స్థలం. అక్కడ మహేశుడు గౌరీ సమేతుడై కేళీలోలుడై వున్నాడు. ఆ ఆనందవేళ అంబిక సంతోషంకోసం హరుడు ఆడురూపం ధరించి ఆమెతో విలాసంగా విహరిస్తున్నాడు. ఆ దంపతులు అతివలుగా సంచరిస్తుండే ఆ పరి

సరం అంతా ఆడురూపాన్ని పొందింది. ఆ వింతచూస్తూ అవనీపతి ముందుకు అడుగు వేయగానే తానొక ముగుదరూపం పొందాడు. అతనితో వచ్చిన వారంతా ఆడువారయ్యారు. ఈ హఠాత్పరిణామానికి ఇలుడు వ్యసనపడి "ఇది బాలేందు శేఖరుని ప్రభావం" అని గుర్తించి ఆ మహాదేవుని శరణు చొచ్చాడు. "ఇది తెలియనిచేత భవానీనాథా! అనుగ్రహించు"మని అర్థించాడు.

మహాదేవుడు మహిపతినిచూచి నవ్వాడు. "రాజా! నీవు దోషివికావు. అయినా నీకీ ఆడుతనం అనుభవించక తప్పదు. ఇంకేదయినా వరం కోరుకో ఇస్తాను" అని అన్నాడు. ఆ మాటలకు అవనిపతి సంకట పడ్డాడు. ఇతర వాంఛలు ఏమీలేక ఆ స్త్రీత్వం భరించలేక శాంకరీచరణ సరసీరుహాలపై వ్రాలాడు. "అమ్మా! లోకజననీ! నేను నీ బిడ్డను. తెలియక ఇందు వచ్చాను. ఈ ఆడురూపం పొందాను. బిడ్డ చేసిన అపరాధం తల్లి సహించకపోతే ఇంకెవరు సహిస్తారు? కామితార్థ ప్రదాయిని. కృపామతివి. వరదానకర్త్రివి. నీదర్శనం విశ్రుతసౌఖ్య నిదానం. నాపాపాన్ని పారద్రోలి నాకు పురుషత్వం అనుగ్రహించు. నీవు నన్ను వదలినా నీచరణాలు నేను విడువను" అని వాపోయాడు. ఆమె ఆతని బాధను అర్థం చేసుకుంది. "నాయనా! ఇలా! నేను మీ అయ్యవారికి అర్ధాంగినికదా? నేను ఇచ్చే వరం కూడ అర్ధ భాగమే. కాని పూర్ణంగా పొందలేవు. తక్కిన సగం ఏనాటికైనా ఆయన ఈయవలసిందే. నీవు నన్ను ఏం కోరుతావో కోరు" అని చెప్పింది. దాక్షాయణి దయతో చెప్పిన మాటలకు ధరణీశుడు తృప్తి పొందాడు. "అమ్మా! నీ బిడ్డపై నీకు అనురాగం కలిగితే ఒకనెల మగవాడుగా, ఒకనెల ఆడుదానిగా వుండేలాగా అనుగ్రహించు"మని కోరుకున్నాడు. అందుకు ఆ పరాంబిక "వత్సా! నీవు కోరినట్లే వరం ఇచ్చాను. అయితే ఒక నిర్ణయం కూడా ఇందులో వుంది. పురుషుడైన వేళ స్త్రీ భావం, స్త్రీ అయినవేళ పురుషభావం నీకుండదు. అలావుంటే నీకు శుభం కలుగదు. అందుకే ఈ నియమం చేర్చాను. కాలాంతరంలో నీసంపూర్ణ వాంఛ నెరవేరుతుంది" అని చెప్పింది. కొంతైనా ఆ తల్లి కృపవల్ల నెరవేరిందని కువలయపతి తృప్తి పడ్డాడు. ఆడుదియైనప్పుడు ఉద్యానవన సంచారం, పురుషుడైనప్పుడు రాజ్యపాలనం సలిపేవాడు. స్త్రీగా ఇలా నామంతో, పురుషుడుగా ఇలుడనే పేరుతో వ్యవహరించేవాడు" అని చెప్పాడు.

ఆ విచిత్రగాథ విన్న తమ్ములు ఆశ్చర్య చకితులై "అన్నా! ఈ కథ విచిత్రతరమే కాకుండా విషాదభరితంగా కూడా వుంది.ఏపాపం ఎరుగని ఇలాపతి ఇంత దురవస్థకు పాల్పడటం విధి విధానం దాటరానిదని ఋజువు చేస్తూంది. పాపం!ఆయన ఆడుదిమై ఏం చేశాడు? తుదముట్ట వినాలని కుతూహలం మెండైంది. ఆనుపూర్వికంగా ఆ కథ చెప్ప"మని అడిగారు. "అనుజులారా! అవును. విధి బ్యాయంకాకపోతే ఏమిటి? మన చరిత్రంతా అందుకు ఉదాహరణమేకదా? రాజ్యం లభించినా పెద్దతమ్ముడు పధ్నాల్గు సంవత్సరాలు పాదుకా సేవకుడై, జటియై గడిపాడు. అంతకాలం రెండో తమ్ముడు ఏ అవాంతరాలు లేని సంసారియై కూడ బ్రహ్మచర్యంతో, స్త్రీ దాహార సుఖాలకు దూరమైనాడు" అని అంటుంటే తమ్ముళ్ళు కన్నీళ్ళు పెట్టుకుంటూ, "అన్నా! నీవు చెప్పిన రెండూ గృహస్థులకు ఏదో రూపంలో ఎంతో కొంతకాలం తప్పవు. మళ్ళీ మామూలు జీవితం సాగుతుంది. ఇది లోకసామాన్య ధర్మం. దీన్ని విధి బలీయమని చెప్పటానికి తగినంతబలం లేదు. నిజంగా నీ చరిత్ర అందుకు అన్నివిధాలా తగింది. కష్టపడినంతకాలం కూడా కలసి కాపురం చేయకుండా శాశ్వతంగా అర్ధాంగిని పాసిన మహాపురుషుడవు. మేం ఎంత మంది వున్నా, ఎన్నివిధాల సహకరించినా మా వదినలేని లోటు పూర్తి చేయగలమా?" అనిచెప్పవలసింది చెప్పలేక, కంఠం రుద్ధంకాగా, మాటపెగలక గ్రుక్కిళ్ళు మింగారు. వారి స్థితిచూచి రాముడు క్షణకాలం మౌనముద్ర వహించి, బాహ్యస్మృతితో తమ్ములవంక చూడలేకపోయాడు. తనలో తాను తెప్పరిల్లి తేరుకున్నాడు. "నా హృదయాన్ని ఆకట్టుకున్న మీరున్నంతకాలం నాకు మీ వదినలేని లోటులేదు. ఆమె బాహ్యంగా దూరమైనా అంతరంగంలో నిత్యం నన్ను సేవిస్తూనే వుంది. ఆమెను నేను ఆదరిస్తూనే వున్నాను. మా అనుబంధం కేవలం దైహికమాత్ర పర్యవసాయి కాదు. మన కథలో అవాంతరగాథ ఇది. ఇలుడు స్త్రీ అయినాడుకదా? అతనితోపాటే వచ్చినవారంతా వనితలైనారుకదా? ఆ మొదటినెలలోనే అతడు చెలులతో కూడి స్వేచ్ఛావిహారంచేస్తూ, నిజ శరీరకాంతితో దిక్కులు వెలిగిస్తూ, భూమిరుహ గుల్మలతా పరికీర్ణమైన కాననాల్లో కాలి నడకతో పయనించి కొలదికాలంలో సుందర ప్రదేశం చేరాడు. (నవ్వుతూ) చేరాడుకాదు, చేరింది అని చెప్పాలె.అవునా?"

అని అనగానే తమ్ములు అన్నతోపాటు పక్కన నవ్వారు. "సంపూర్ణ సుధాకరునివలె ప్రస్ఫుటంగా దేహరుచులు పరిసరాన్నికాంతిమంతంచేస్తూ సరసీజల మధ్యంలో తపం చేస్తున్న నవయౌవన మూర్తిని, కుముదబాంధవు కుమారుని, బుధుని చూచింది. మరుతూపులకు ఓపలేక మగువ మగువలతో జలక్రీడకు దిగింది.

జలజేషణలు సలుపుతున్న జలకేళికి సరోజలం సంచలించింది. తరంగాలు ఉద్ధృతంగా లేవటంతో ధ్యానంలోవున్న బుధుడు కనువిప్పి చూచాడు. అసలె జగదేక సుందరి. ఆపై స్నాన సుందరి. ఆ మీద అతడు నవయౌవన తపస్వి. స్మరునకు చేతినిండా పని దొరికింది. చెరకువింటిని తుమ్మెద వింటుగుణం కూర్చగానే ఇలా బుధులలోని సద్గుణం సడలింది. పూవుటమ్ము చేర్చగానే ఒకరినొకరు చూపులతో త్రాగటం ప్రారంభమైంది. లక్ష్యం దృష్టిస్తుండే "ఓహో! ఎవరీ సుందరి? దేవకాంత కాదు కన్నార్పటూంది కనుక. నాగకన్యకాదు వక్రగమనం లేదుకనుక. మర్త్యకాంత అయితే ఈ విలాసం, ఈ ప్రకాశం ఎలా వుంటై? ఈ త్రిభువనమోహనాంగి ఏజాతికి చెందిందో? కన్యయో, గృహిణియో? ఈ తరుణి వరునిపెండ్లాడకపోతే నాకు తగిన దయిత. దైవలిఖితం ఎలా వుందో? మనస్సు మాటిమాటికి మదనశర నిర్భిన్నమవుతూంది" అని బుధుడు భావించాడు. "అబ్బా! ఏం సోయగం? సహజ శరీరలావణ్యం చేతనే సుందరీలోకాన్ని జయించేటట్లున్న ఈ తరుణ తపస్వి తపశ్శక్తిచే ఇంకా శోభిస్తున్నాడు. ఈతడు నిసర్గ సౌమ్యుడు. నా హృదయం అపహరిస్తున్నాడు. ఈయతి పతి అయిన సతి ఎంత అదృష్టవంతురాలు? ఆ భాగ్యం నాకు కలిగితే నా యౌవనం సార్థకమవుతుంది" అని ఇలాదేవి తలపోసింది. బుధుడు స్మరశరవిద్ధుడై తపం చాలించి సుందరిని కన్నార్పకుండాచూస్తూ జలం నిర్గమించి ఆశ్రమంలోకి వచ్చాడు. అంతకు ముందే వారి వెదలివచ్చిన వనితల పిలిచి "తరుణులారా! మీరెవ్వరు? ఆమె ఎవ్వరు? మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? కలమాపు తెలుపండి" అని అడిగాడు. ఆ జవ్వనులు "పరమ తపోనిధీ! ఆమె మాకు భర్త్రి. అవివాహిత. మాతో విలాసంగా వనభూముల్లో సంచరించవచ్చింది. ఆమె వైదర్భి. పేరు ఇల. మీ పేరేమి? మా విషయం ఇంత సాదరంగా

వినటానికి ఎందుకు సంకల్పించారు?" అని అంగనలు ప్రశ్నించారు. అందుకు తరుణతాపసి ప్రత్యుత్తరం ఈయనోతూ వారి యథార్థస్థితి తన దివ్యజ్ఞానంతో తెలుసుకుని "కన్యలారా! నాపేరు బుధుడు. తండ్రిచంద్రుడు. నేను బ్రహ్మచారిని. గార్హస్థ్యం స్వీకరించ తలిచాను. తగిన వధువు దైవ ప్రేరణచే సన్నిధికే వచ్చింది. మీరంతా ఈ పర్వతకందరాల్లో నివసించండి. మీకు తగినఫలమూలాలు నేను సమకూర్చుతాను. మీరు పురుషులవుతారు. ఇకనుంచి మీజాతిని కింపురుషులని పిలుస్తారు. మీకు శుభం కల్గుతుంది. పొండ"ని చెప్పాడు.

ఆ పలుకులకు వారంతా ఆనందం పొందారు. అనుకోకుండా పురుషత్వం ప్రసాదించినందుకు కృతజ్ఞతతో నమస్కరించి తమకు ఏర్పాటు చేసిన నెలవులకు తరలిపోయారు" అని రాముడు చెప్పగా సోదరులు కింపురుషుల జన్మవృత్తాంతం విని తక్కినకథకూడా వినిపించుమని కోరారు. "తమ్ములూ! తరువాత కథవినండి. కిన్నరయోషల సంయమి దూరంగా పంపించి, శిరంవంచి కడగంట వీక్షిస్తున్న కన్యాలలామనుచూచి, "నేను సోమసుతుడను. బుధుడను. స్నేహపర్యాకుల దృక్కులతో నన్ననుగ్రహించు. నీవు భయపడవద్దు.అంగీకారం లేకపోతే నిన్నునిర్బంధించటంకానీ, శపించటం కానీ చేయను. అనుకూలానురాగులైన ఆలుమగలు ధన్యజీవులు. అదేనేను నీనుంచి అర్థిస్తున్నాను" అని ప్రేమ తొణికిసలాడగా అన్నాడు. "ఎప్పుడా తను అర్థిస్తాడా? అతను సుఖం అనుభవిస్తానా?" అని ఉవ్విళ్లూరుతున్న అలివేణికి ఆ ప్రార్థన అమృతపానం చేసిన హర్షాన్ని చేకూర్చింది. "స్వామీ! నేను స్వతంత్రను. నీకడవుండటానికి ఇష్టపడుతున్నాను. నీ ఆజ్ఞ పాలిస్తాను. నన్ను గ్రహించవచ్చు" అని సమ్మతి తెలిపింది. ఆమె అంగీకారానంతరం అర్థాంగిగా గ్రహించి ఐహికసుఖం అనుభవించుతున్నాడు. వసంతం గడచి గ్రీష్మం వచ్చింది. ఒకనాటివేకువనే బుధుడులేచి పూర్వంవలె జలంలో ప్రవేశించి ఊర్ధ్వబాహుడై తపం ప్రారంభించాడు. తెల్లవారగానే ఇలఇలుడుగా మారింది. మునీంద్రునిచూచి, "దేవా! నాపేరు ఇలుడు. భృత్యులతో వేటకు వచ్చాను. వారేమైరో నాకు తెలియదు. మీరు దూరదర్శులు. తెలిస్తే చెప్పి నాకు గతి కల్పించండి" అని వేడుకున్నాడు. "రాజా! నీ సైన్యం రాళ్ళ

వర్షం కురిసి నేలపాలైంది. నీవు నా ఆశ్రమంలో వున్నందున జీవించావు. నాతోపాటు ఫలమూలభక్షణం చేస్తూ సరోవరజలం పానంచేస్తూ కాలంగడుప" మని బుధుడన్నాడు. "అయ్యో! మహాత్మా! ఎంత ఘోరంజరిగింది? ఇదినాకే మాత్రం తెలియదు. రాజ్యం విడిచివచ్చాను. భృత్యులు మడిశారు. నేనిక్కడ నిలవటం భావ్యమా? అనుజ్ఞ ఇస్తే నా పురానికిపోయి కుమారుడు శశిబిందుని రాజుగాచేసి మళ్ళీ వస్తాను. భార్యాపుత్రుల, బంధుపరివారాన్ని వదలి సంసారి నైన సంయమిగా అడవిలో మౌనిగా వుండటం మర్యాదకాదు. దయతో సెల విమ్వండి" అంటే, "రాజా! ఎందుకు తొందరపడతావు? నీహితంకోరేచెప్పాను. నీవు దూరంగా వదలివచ్చిన సైన్యం నశించింది. నీతో వచ్చిన కొలది పరి వారం నీకుకాకుండా పోయింది. నీవిప్పుడు ఒంటరివాడవు. నామాటపై సంవ త్సరం ఇక్కడవుంటే నీకు అన్ని విధాలక్షేమం కలిగిస్తా"నని బుధుడు చెప్పాడు. ఇలుడందుకు అంగీకరించి "ఆశ్రమంలోవుండి తపంచేసుకుంటా" నన్నాడు. ఆనెలగడిచింది. మళ్ళీ రాగానే మగువగామారింది. బుధుడామెతో సంసారం సాగించాడు. సంవత్సరాంతానికి ఇల బుధుని సమాగమంతో పురూ రవుడనే బాలుని కని బుధునకిచ్చింది. పదియవనెలలో పడతి ప్రసవించి బిడ్డనుగని పదకొండో మాసం పురుషుడుగానూ, పన్నెండోనెల కాంతగానూ గడిపి, బుధుడిచ్చిన గడువు వత్సరం ముగియగానే మళ్ళీ మగవాడుగా మార్పు పొందింది. పురుషుడైన రాజుకు హృద్యగాథలతో తృప్తిపర్చాడు.

మంచి సమయంలో బుధుడు ఆత్మమిత్రులనూ, సంవర్తునీ,చ్యవనునీ, కశ్యపునీ, దుర్వాసునీ, ఇంకా యోగ్యులైన యోగివర్యులనూ ఆహ్వానించి "మహాత్ములారా! ఈ కార్దమేయుడు ఎంతటి మంచిరాజో మీకుతెలుసు. ఈతనికి ప్రాప్తించిన ఇక్కట్టు ఎటువంటిదో మీరెరుగుదురు. ఇతనికి మేలు చేయాలని సంకల్పించాను. మీ కరుణకు పాత్రుడని వేరే నేను చెప్పనక్కర లేదు. ఏ ఉపాయంతో ఈతని ఉద్ధరించగలమో చెప్పండి" అని అంటుండే, కర్దమమహర్షి సద్విజాళి సేవించగా చనుదెంచాడు. క్రతువు, పులస్త్యుడు, వషట్కారం, ఓంకృతి వచ్చారు. అందరుకలసి కర్తవ్యం ఏమిటని ఆలో చిస్తుండగా కర్దముడు "మహర్షులారా! నాకు తోచింది చెపుతున్నాను. ఈ రోగానికి మందు గరళకంఠుని ప్రీతుని చేయుట ఒక్కటే. ఆయన తృప్తి

పొందాలంటే అశ్వమేధయాగం ఒక్కటే. అవనీపతిని తేల్చాలంటే శంకర ప్రీతిగా తురంగమేధంచేద్దాం" అని అన్నాడు. అందరు హర్షించారు. సంవర్త రాజర్షి ఛాత్రుడు మరుత్తు సర్వసంభారాలు సంఘటించాడు. బుధాశ్రమ ప్రాంతంలో శంకరప్రీతిగా సంయములు వేదవిహితంగా సప్తతంతువు సొంతంచేశారు. శంకరుడు ప్రీతుడై సవనకుంభంలో సాక్షాత్కరించాడు. "మహర్షులారా! మీరుచేసిన కార్యంనాకు ప్రీతికలిగించింది. ఇలునకు ఏమేలు చేయగా తలచి ఈ క్రతువుచేశారు? తెలిపితే అది తీర్చి మీకు ప్రమోదం కలిగిస్తాను" అని హరుడు పల్కగా "శంకరా!పాపనాశంకరా! విశ్వక్షేమంకరా! మృత్యుభయంకరా! అభయంకరా! నీ దర్శనంతో మాపాపరాశి క్షాళితమైంది. ఈ లోకోత్తర పూజ్యుడు ఇలుడు అపరాధంలేకుండానే స్త్రీక్రీడావనంలో ప్రవేశించి ఆడువి అయ్యాడు. తల్లిజగదంబ అనుగ్రహించింది అర్ధభాగం. మిగిలిన అర్ధం నీవు అనుగ్రహించి శాశ్వతపురుషత్వం ప్రసాదించు"అని అర్థించారు. "మహర్షులారా! మీ పరోపకారవాంఛ నాకు పరమాహ్లాదంకలిగించింది. ఇలుడు ఈనాటినుంచీ దోషరహితుడై శాశ్వతంగా పురుషుడై, పురుషార్థాలు సాధించి నన్ను చేరుతాడు" అని వరం ఇచ్చి అంతర్హితుడైనాడు. యజ్ఞంముగించి తాపసులు ఆశ్రమాలకు వెళ్ళారు. అందరి అనుమతితో ఇలుడు స్వరాష్ట్రానికి పోయి శశిబిందును ప్రభువునుచేశాడు. మధ్యదేశంలో ప్రతిష్ఠానపురంపేరుతో రాజధాని నిర్మించి పురూరవుని ప్రతిష్ఠించి నియమనిష్ఠలతో తపస్సుచేసి నీలకంఠుని సన్నిధానంచేరుకున్నాడు. విన్నారా సోదరులారా? హయమేధం ఎంతటిదో? ఎట్టి సంకటాలైనా ఇందుశేఖరుని కృపతో ఈడేరుతై" అని ముగించాడు.

## శ్రీరాముడు పురోహితాదుల పిల్చి అశ్వమేధం చేస్తానని చెప్పుట

అనుజన్ములు ఆ కథవిని పరమానందభరితులైనారు. రాముడు తనకై దుఃఖించిన తమ్ములను విచిత్రకథాగమనంతో మరల్చి హర్షచిత్తులకావించి, "సుమిత్రానందవర్ధనా! నీవు మన పురోధలైన వశిష్ఠ వామదేవ జాబాలి కాశ్యపులను, భూసురోత్తముల తోడి తెమ్ము. సవనం సాగిస్తాను. అఖిలలక్షణ

యుక్తమైన అశ్వరాజాన్ని విడుస్తాను" అనిచెప్పగా లక్ష్మణుడుపోయి వార లతో మందిరం ప్రవేశించాడు. కృతనమస్కారుడైన భూజానిని దీవించి మహర్షులు ఉచితాసనాసీనులయ్యారు. రాముడు ప్రాంజలియై "మహాత్ము లారా! అశ్వమేధం చేయ సంకల్పించాను. అందుకు మీ ఆశీర్వాదం, అనుజ్ఞ అర్థించటానికి ఆహ్వానించాను. సెలవిస్తారా?" అని వేడుకున్నాడు. రామ ముఖోద్గతమైన ఆ ప్రార్థనవిన్న మహర్షులంతా ఆనందంతో పులకించారు. ఆత్మలో హరుని స్మరించారు. "రామ! ప్రభూ! నీ సంకల్పం మాకు నచ్చింది. రాజులకు రాజసూయంకంటే అశ్వమేధమే అర్హమైంది. అవశ్యం ఆచరించి ఐహికాముష్మికఫలం అందుకో"మ్మని సమ్మతితెలిపారు."సౌమిత్రీ! యజ్ఞానికి పూజ్యులు అనుజ్ఞఇచ్చారు. ముందుగా సర్వకీశవర్గంతో సుగ్రీవుని దారపుత్ర సహితంగా క్రతువర్శనంకోసం రావలసిందని కిష్కింధకు దూతలనుపంపు. అలాగే వేరొకవర్గాన్ని లంకాపతి విభీషణుని సపరివారబంధుమిత్రంగా ఆహ్వా నించేందుకు లంకకుపంపు. నాకు మిత్రులైన నానా రాజశేఖరులనందరినీ యథావిధిగా దూతలపంపి పిలిపించు. దేశాంతరాలలో పేరుమోసిన ద్విజులను రప్పించు. వారేకాక కుటుంబాలతో రావలసిందిగా చెప్పించు. అగస్త్యాదిమహ ర్షుల ఆమంత్రించు. నర్తకులను,గాయకులను, పౌరాణికులను, శాస్త్రజ్ఞులను, వేష ధారులను, హాస్యచక్రవర్తులను ఆహ్వానించు నైమిశారణ్యంలో గోమతీతీరంలో యజ్ఞవాటిక నిర్మించు. వచ్చేవారికి ఆవాససౌఖ్యం కలిగేలాగా ఆశ్రమాలు, హర్మ్యాలు, మందిరాలుఏర్పాటుచేయి.భరతుడు నూరువేలబస్తాలబియ్యం,పదివేల యెద్దులపై పెసలు,నువ్వులు, సెనగలు,ఉలవలు,మినుములు,ఉప్పుకారం, మిరప కాయలు, తగినంతగా తైలాదులు, గంధపు చెక్కలు, వంటచెరకు, కోటి హేమనిష్కాలు, పదికోట్ల వెండినాణాలు, ఇంకా ఇతర సంబారాలతో తరలి ముందుగా స వ న వా టి క కు చేరుతాడు. ఆ తర్వాత నటులు, నర్తకులు, నైగమశ్రేష్ఠులు, సూదకారులు, భటులు, శూరులు, వర్తకులు, కోశాధిపతులు, పనివారు, తల్లులు,మీమీ అంతఃపురం, నాపత్ని సీత కాంచన ప్రతిమ, దీక్షా వస్తులతో అతనివెనుక అయోధ్యావాసులు వెళ్ళుతారు. నేను నిమిత్తంగా మీరే అధ్వరం నెరవేర్చాలి."

అని ఆదేశించాడు. ఆయన అభిమతానికి సహస్రగుణితంగా సర్వం

సోదరులు నిర్వహించారు. నల్ల ఇర్రితో సమానవర్ణంగల సలక్షణాశ్వాన్ని, ఋత్విక్కులు, లక్ష్మణుడు రక్షించగా వదలి, రాముడు నైమిశారణ్యంలో క్రతువాటికకు వచ్చాడు. అక్కడి యజ్ఞశాల నిర్మాణానికి అచ్చెరువు పొందాడు. అవనీజపతి నైమిశంకరాగానే, అవనీపతులు బహుళోపహారాలను కొనివచ్చి సమర్పించారు. వారందరకు అనురాగంతో ప్రత్యర్చనం గావించి' విశాలగృహాల్లో విడుదులు చేయించి సానుచరాళికి అన్నపాన వస్త్రాదులు' ఇతర సౌకర్యాలు కొరత లేకుండా భరతశత్రుఘ్నులు చూచారు. సుగ్రీవుడు తనవారితో కలసి బ్రాహ్మణులను వెదకి వారు చాలంటున్నప్పటికి ఇంకా, ఇంకా అంటూ పూజలు సత్కారాలు నెరవేరుస్తున్నాడు. విభీషణుడు మంత్రులతో, సేనాపతులతో, భటులతో వృద్ధులనూ, ఋషులను అర్చిస్తూ సంతుష్టుల చేస్తున్నాడు. తురగాన్ని రామానుజుడు రక్షించగా,విహిత పద్ధతి సవం సాగుతుండగా "కొరత లేకుండా ఇవ్వండి, చూడండి, అర్చించండి, ఆరాధించండి" అనే మాటలుతప్ప అన్యభాషణాలు మచ్చుకైనా వినరావటంలేదు.చక్కెరతో, బెల్లంతో చేసిన బహువిధ మధుర పదార్థాలు, పిండివంటలు, నేతులు, పెరుగులు, పులుసులు, అప్పడాలు, వడియాలు-ఒకటేమిటి? అన్ని దేశాలలో అనుభవజ్ఞులైన వంటలవారు చేసిన రకరకాల భాజనాలు భోజనాలసమయంలో విస్తరాకుల్లో వడ్డిస్తుంటే ఆ వాసనలే ఘ్రాణతర్పణం కావించి దూరంగావున్న కొత్తవారిని ఆహ్వానిస్తున్నై. "ఏమయ్యోయ్! ఆ శాకం ఇలా తీసుకురా. ఏదీ పాయసం? ఇంకా కొంచెం వంచు. గారెలు, బూరెలు ఈ బంతికి రాలేదండీ" అనే మాటలకు మారు, "స్వామీ! నీకు నమస్కారం బాబూ! క్షమించు. ఇలా వడ్డిస్తే ఎలా? నాయనా! చాలయ్యా చాలు. రామప్రభువే కరుణారస హృదయుడనుకున్నాం. తమ్ములు ఆయన్ను తలపులోనికి రానియ్యటం లేదు. ఇంకా చిత్రం, వానర రాక్షసులు వారిని మరపిస్తున్నారు. వద్దుబాబూ అంటే వినరే. ఇంకా కొంచెం ఇదే కదండీ. ఇవి బాలకులకు వుంచండి" అంటూ వర్దన చేస్తున్నారు. అహో! ఏమి రామయ్యా? ఏమి తమ్ములు? ఏమి మిత్రులు?" అన్న మాటలు రాత్రింబవళ్ళు భోజనవేళ, భోజనానంతరం, ప్రసంగంలో ప్రజాముఖంలో ప్రస్ఫుటమవుతున్నై. మలినుడు, దీనుడు, కృశుడు, ఆ మహాధ్వరంలో మచ్చుకైనా

కనుపించలేదు. దీర్ఘకాలం జీవించిన మౌనులు ముక్కుపై వ్రేలు వేసుకున్నారు "ఇంత వరకు ఇటువంటి క్రతువు కనలేదు. వినలే"దని విస్మయం పొందారు. బంగారం కోరే వారికి బంగారం, ధనం కోరే వారికి ధనం, వస్త్రాలు కోరే వారికి వస్త్రాలు, గోవులు కోరితే గోవులు, భూములర్థిస్తే భూములు-ఒకటేమిటి? ఏది కోరితే అది, అడిగిన దాని కంటె అతిశయంగా అర్థులు పొందారు. యాచకులు అభిమతార్థాలు పొంది.

"అడుగకుండుటయును మాటయర్థించంచె
యీయకుండుటయును మాట యెఱుగకుండ
దాతృతాగుణ రమ్యమై తనరు నీదు
హస్త వారిజమునకు దీర్ఘాయురస్తు!

ప్రథితగుణ సాంద్ర! దశరథ రామచంద్ర!
ఎవని మెచ్చి కొనుదు నెవని కాదందును?
తమ్ములేమి? ప్లవగ దైత్యులేమి?
యొకరి నొకరు మించి ప్రకటించి హృదయంబు
అర్థిజనుల దనుపుటయ్యె రామ!"

అంటూ కీర్తించారు. "శక్రమఖం చూచాం. ధనేశుని క్రతువు దర్శించాం. సూర్యసుతుని సవనం వీక్షించాం. వరుణుని యజ్ఞం కనుగొన్నాం. అవి ఈ యజ్ఞానికి సాటిరావని అందే లోటుమాటేకాని ధావి వచనం కానేరా"దని అబ్బురపడేలాగా వనచర నిశాచరులు వాసో ధన భోజన వస్తు సముదాయం సంయములకు సమర్పించారు. ఈ ప్రకారం భరత లక్ష్మణ శత్రుఘ్నులు, సుగ్రీవ విభీషణులు, వారి పరివారం కార్యం చక్కతీసుస్తుంటే, సర్వసుగుణ సముపేతమైన సప్తతంతువు సంవత్సరం నిండినా ముగింపులేక సాగుతూనే వుంది.

## వాల్మీకి మహర్షి కుశలవుల రామాయణం గానంచేయ నియమించుట

రాముని సంకల్పానుసారం అవిచ్ఛిన్నంగా సవనం సాగుతూంది.ఎంత

కాలం గడుస్తూందో ఎవరికీ పట్టటం లేదు. యాచకులు, అర్థులు, ఆశ్రితులు ఇంటిమాటే మరచి కుటుంబాలతో అక్కడే వున్నారు. మహర్షులుకాని, మహీపతులుకాని స్వస్థానాలకు పోతామని రామునకు చెప్పటానికే జంకుతున్నారు. ఆయన స్వయంగా అనుమతించే లక్షణం ఎవరికీ కనుపించటంలేదు. ఇది ఇలా వుండగా, సవన ప్రారంభానికి ముందు మహర్షులందరిని ఆహ్వానించినప్పుడు వాల్మీకులవారిని ప్రత్యేకంగా ఆహ్వానించటం జరిగింది. ఆయన శిష్యగణంతో వచ్చి తాపస వాటికకు చేరువగా ప్రత్యేకంగా నిర్మించిన ఆశ్రమంలో విడిది చేశాడు. ప్రభువుచేత, మహర్షులచేత అర్చితుడై ఆ మహాతేజుడు, ఆత్మజుడు ఆహ్నికాలు తీర్చి విశ్రాంతి అనంతరం "వత్సలారా! మీరు రేపు ప్రాతఃకాలం కాల్యాలు ముగించి బ్రాహ్మణజనం నివసించేచోటా, మౌనివాదల, రాజమార్గాల్లో, ప్రభువుల విడుదుల్లో, రామచంద్రుని ప్రాంగణంలో, క్రతువు జరిగే ప్రదేశంలో, రథ్యల్లో మీరు నేర్చిన రామాయణాన్ని కర్ణరసాయనంగా గానం చేయండి. ఇంకా విశేషం ఏమంటే, ఋత్విక్కులు వినేలాగా పాడితే మరీమంచిది. కొండలనుంచి లభించే పండ్లు, వృక్షాలొసంగే మధురఫలాలు భుజిస్తూ పాడండి. పురబాహ్యదేశ భవముల్లో సురుచిర ఫలాలుతిని పాడితే, అలపుకాని, సొలపుకాని, అపస్వరంకాని, రాపెక్కటంకాని, కాయానికీ, కంఠానికీ రావు. ఒకవేళ మీ గానం వినే భావంతో రాముడు పిలిపిస్తే, తాపసులెల్ల వినేలాగా, నేనేర్చిన ప్రమాణాలు మనస్సులో నిల్పి, దినానికి ఇరవై సర్గలు మాత్రమే చదవండి. ధనకాంక్ష వద్దు. లోభం తగదు. గుణప్రధానంగా జీవించే మనకు, ఫలమూలోపజీవులమై మనకు, ఆశ్రమస్థులకు అవి పరిహార్యం. ప్రభువు మిమ్మల్ని ఎవరివారని ప్రశ్నిస్తే, జంకు గొంకు లేక వాల్మీకి శిష్యులమని మాత్రం చెప్పండి. మునుపటిలాగే మూర్ఛనా పద్ధతి తప్పకుండా, వీణాతంత్రుల్లో అపూర్వ సుస్వరాలు పలికించి, కలతలేకుండా కంగారుపడకుండా గానం చేయండి. ప్రభువు ఆహ్వానించి పాడుమంటే ప్రారంభంనుంచి పాడండి. అవజ్ఞ వద్దు. భూతకోటికి భూమీశుడే జనకుడు. ఈభావం ధర్మమార్గంనుంచి తలపడ్డది. ఈనాటికి మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకుని, వీణలను, తంత్రులను సరిచేసుకుని, వేగంగానే నేను చెప్పిన రీతిగా దినచర్య ముగించి గాయక వేషధారులై పోయి గానం చేయండి" అని కుశలవు

లకు చెప్పాడు. ఆ బాలకులు మహర్షి మాటలకు పొంగిపోయి "ఆచార్యా! మీ పాదసాక్షిగా, మీ ఆజ్ఞ పాలిస్తాం. మీరు మాకిచ్చిన సంగీత హృదయాన్ని మా గానంతో సజ్జన సంతానానికి సంతర్పణ కావిస్తాం" అని గురుదేవునకు ఆత్మ సంతృప్తిగా పలికి పాదాభివందనంచేసి సెలవు తీసుకున్నారు.

తెల్లవారింది. ఖగకుల కలస్వనం స్వరభేదం సూచించింది. కోకిల పంచమంలో పాడింది లయబద్ధంగా రాజహంస నడిచింది. మయూరం షడ్జమ స్థాయిలో క్రేంకారం చేసింది. తుమ్మెద ఝంకరించి స్వర సంచారంచేసింది. కాలరమణి ప్రభాత ప్రకృతిని వీణగాచేసి లోకబాంధవుని స్తుతిస్తూ రాకను సూచించింది. బాలకులు కృతస్నాతులై అగ్ని వ్రేల్చి, వీణలు ధరించి, గాయక వేషధారులై, గురుని స్మరించి తంత్రులు మీటారు. ఆ మధుర ధ్వని వాయు వశంచేత పరిసరజన కర్ణపుటాలకు పీయూషం పంచింది. "కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరం, ఆరుహ్య కవితా శాఖాం, వన్దే వాల్మీకి కోకిలమ్" అని కుశలవులు గురుస్తవం గానం చేయగానే ప్రకృతి పరవశించింది. విడుదుల్లోనుంచి వారికి వారే అధికారులూ, అనధికారులూ, పౌరులూ, బాలకులూ ఆ బాలకులచేరవచ్చారు. వచ్చినవాళ్ళను చూచి హెచ్చిన కుతుకంతో కుశలవులు పాడటం సాగించారు. ఎంతసేపైనా శ్రోతలు కదలరు. బాలకులు ఆపరు. ఈ వింత శ్రీరాముని చెవి సోకింది. ముచ్చటపడ్డాడు భరతునిచేత తనవద్దకురప్పించుకున్నాడు. బాలకుల చూచాడు. గానం విన్నాడు. కర్మాంతరంలో (రెండు పనుల మధ్య విరామకాలం) సభ కూర్చాడు. ధర్మవిదులు, తాపసశ్రేష్ఠులు, మహీపులు, శ్రుతిపారగులు, పురాణజ్ఞులు, సర్వకళానిపుణులు, పదాక్షరసమాస పారంగతులు, జ్యోతిష్కులు, విజ్ఞులు, తదజ్ఞులు, సాముద్రికవేత్తలు, కళామాత్రాభాగకుశలులు, గాయకులు, పురధాములు, హేతువాదదక్షోత్తములు, కార్యశూరులు, సత్క్రియాకల్పచతురులు, వృత్తసూత్రవివేకులు, గీతవృత్తవేదులు, నీతినిపుణులు, శాస్త్రసంగతులు, ఇంగితజ్ఞులు, భాషాధికారులు, వేదాంతులు, వైదికచ్ఛందోవిదగ్రగులు, వాదనాకుశలులు, చతుర్విధ కవిత్వ రచనా ధురంధరులు ఆ సభను అలంకరించారు. ఆ మహాసభా మధ్యస్థ వేదికపై సూర్యచంద్రుల వలె ప్రకాశిస్తూ, పూర్వాచార్య నిర్మితం, అపూర్వం, పాఠ్యజాతుల్లో గాన

పరిపాటికల్గి, ప్రమాణాతిశయంచే మానితమై, తంత్రీలయ సమన్వితంగా ప్రకాశించే రామాయణాన్ని బాలకులు గానంచేయసాగారు.

గానాకర్ణనంతో సభ సమ్మోహితమైంది. భూపాలునకూ, బాలకులకూ పోలికలు కొట్టవచ్చినట్లు కనుపించటంతో సదస్యులు అటు రామునీ ఇటు బాలకులనూ వాపోవక కన్నులతో త్రాగుతున్నారన్నట్లున్నారు. " కుమారులెక్కడ? క్ష్మాపతి ఎక్కడ? బింబ ప్రతిబింబాలుగా వున్నారు. ఇదిసాధ్యమా? క్షత్రియుడైన రాముడు, బ్రాహ్మణ శ్రేష్ఠుడైన వాల్మీకిదారకులు ఏకరూపంగా ఏర్పడటం ఎంత విచిత్రం? ఇది ఊహకందే విషయమేనా? జడలు, వల్కలాజిన ధారణ లేకపోతే రామునకూ, బాలురకు అభేదంకాక భేదం ఎక్కడ?" అన్న భావం సభాసీనుల అందరి మనస్సుల్లో సంచలనం కలిగించింది. గురు నిర్దేశానుసారం కుశలవులు మౌనినారద దర్శితమైన ప్రథమసర్గ మొదలు ఇరవై సర్గలు వరుసగా గానం చేశారు. ఆ గానం అతిమానుషమై, అతి మధురమై, ఆనంద వీచీ విహారంతో శ్రోతలను ముంచి ఎత్తింది. అప్పటికి అపరాహ్ణం అయింది. బాలకులు గానం ఆపారు. ఆ మధురనాదం ఆగగానే శ్రోతలు స్వప్నలోకంనుంచి క్రిందపడినట్లు ఒక్కసారి త్రుళ్ళిపడి మామూలు స్థితికి వచ్చారు. రామచంద్రుడు, భరతుడు "బాలకులు సెలవడుగుతున్నా"రని చెప్పేవరకు లోకస్మృతి పొందలేదు.

"సోదరా! పద్దెనిమిదివేల బంగరునాణాలు తాపసకుమారులకుకానుకగా ఇవ్వు. ఇంకా వారి అభిమతం తెలుసుకుని అదికూడా తీర్చు" అని చెప్పాడు. భరతలక్ష్మణులు ఆమేరకు ధనంతెచ్చి వేరువేరుగా గ్రహించండి అని అంటూ వారి ముందుంచారు. ఆ ధనరాశినిచూచి బాలకులు విస్మితులైనారు. "ప్రభూ! ఇంతటి ఘనసత్కారం నీవదాన్యతకు చిహ్నంగానే నిల్చింది కాని, మాకు ప్రయోజనం ప్రసాదించలేదు. ఈ బంగారు మాడలు కొనిపోయి మేమేంచేసుకుంటాం? వీటితో వచ్చేప్రయోజనం మాకేముంది? మేం ఋషిబాలకులం. మా ఉనికి అడవుల్లో. మా పరివారం పశుపక్షిమృగకీటకాలు. మా ఆహారం వేరూ, వెల్లంయలూ, ఆకులూ, అలం, పళ్లూ, కాయలూ. మా ఆవాసం ఆకులతో కప్పినగుడిసె. ఈ జీవితానికీ, ఈ ధనానికీ పొత్తెక్కడ? ఇది ఎవరికిస్తాం? ఏంచేస్తాం? కొనిపోయి గోతిలో దాచవలసిందేకదా? అగ్నిహోత్రం త్రవ్వేపనిముట్లు

కూడ మాకు లేవే? నీ ధర్మబుద్ధికి, నీ ఉదారభావానికి ధన్యవాదాలు. అనుమతిస్తే పోయివస్తాం. భారతి బహుమూర్తులతో సాక్షాత్కరించిందని ప్రథమ కూర్పే సవస్సులో నీవంటి ఉత్తమప్రభువు, సరసుడు, దయామూర్తి మా గానం ఆలకించి మమ్మల్ని ప్రేమతో పలకరించి గౌరవించటమే మాకు తృప్తి కల్గించిన సత్కారం. మాకేమీ అక్కరలేదు. ప్రభువుల కృపవుంటే మాకు చాలు" అని అంటుంటే రాముని నేత్రాలు చెమ్మగిల్లి రెండు బిందువులు రాల్చినై. సభ్యుల్లో సంచలనం కలిగింది. "అబ్బా! ఇది ఎంత విస్మారం? ఆ కంఠధ్వని, ఆ వినయం, ఆ వాక్యవిన్యాసం, ఆ అంగరుచి, ఆ హావభావ విలాసాలు, శ్రీరాముని శైశవం కన్నులకు కట్టిస్తున్నై. అహో! ఆశ్చర్యం. పరమాశ్చర్యం" అన్న భావాలు ఆసంచలనంలో గోచరించినై. ఇంకా ఏమేమో ఊహలు వస్తూపోతూ రూపుదిద్దుకోలేకపోయినై.

## రామాయణాన్నిగూర్చి రాముడు కుశలవుల ప్రశ్నించుట

"కుమారులారా! మీగానంకలెనే మీ వినయభాషణం నన్ను ముగ్ధుణ్ని చేసింది. మీరు గానంచేసిన రామాయణం ఏ మహానుభావుడు రచించాడు? మీకీగానవిద్యకు ఆచార్యుడెవ్వరు? దీనికి మూలం ఏమిటి? దేనినిగూర్చి? నేవినదలచుకున్నాను. సంశయించకుండా వినిపిస్తారా?" అని ఆప్యాయంగా రాముడు అడిగాడు. "ప్రభూ! భగవానుడైన వాల్మీకి కృతికర్త. మీ సవన ప్రదేశ సవిధ యందే వున్నాడు. ఈ కావ్యంలోని విషయం ప్రభువులైన మీ చరిత్ర. ఇరవైనాల్గువేల శ్లోకాలు, నూరు ఉపాఖ్యానాలు, అయిదునూర్ల సర్గలు, కాండాలు ఆరు, ఉత్తరకాండతో ఏడుగా ప్రకాశింపచేశాడు. దీనికి శ్రీరామాయణం అని నామకరణం చేశాడు. ఇందులో నీసంపూర్ణ జీవితగాథ భూత వర్తమానాలేకాక భవిష్యత్తుకూడ శుభాశుభఫలాలతో పూరించాడు. మా సంగీతాచార్యులుకూడ వారే. మేం ఆ పూజ్యుల ఛాత్రులం. నీకు విన కుతూహలంవుంటే విశ్రాంతి కాలంలో ప్రతిదినం ఇరవై సర్గలు గానంచేస్తాం. ఇది మా గురువర్యుల ఆదేశం. మేం ప్రతిఫలం ఏమీ కోరం. మా ఆచార్యుకు

ప్రజా బాహుళ్యంలో ఇది ప్రచారం చేయమని సెలవిచ్చాడు" అని విన్నవించారు.

ఆ సంభాషణం ఆలకించిన సభవారు పునశ్శ్రవణానికి ఉత్సుకత ప్రకటించారు. రామునకుగూడ పూర్ణంగావినాలని దృఢసంకల్పం కలిగింది. తదాది విశ్రాంతి కాలంలో తమ్ములతో, సభాసదులతో రామాయణం గానం చేయించవలసిందిగా ఆదేశించాడు. బాలకులు ఆశ్రమానికి, రాముడు కర్మశాలకు,సభవారు విడుదులకు వెళ్ళారు. మరునాటినుంచి కుమారద్వయం రామాయణ గానం క్రమపద్ధతిలోచేస్తూవుంది. అంతకంతకు ఆ కథ అమృతాన్నీ, అద్భుతాన్నీ, ఆశ్చర్యాన్నీ, ఆసక్తినీ, ఆశంకనూ రేకెత్తిస్తూసాగింది. ఆరుకాండలు పూర్తి అయినై. ఉత్తరకాండ జరుగుతూ వుంది. జానకి గర్భవతి కావటం, అపవాదం రావటం, అవనిజాత ఆశ్రమదర్శనం కోరటం, ఆ నెపంతో సౌమిత్రితో వాల్మీకాశ్రమ ప్రాంతంలో విడిచిరమ్మని చెప్పి పంపటం, లక్ష్మణుడు గంగ దాటించి రామాజ్ఞ చెప్పటం, విన్న మైథిలి మూర్ఛపోగా వాల్మీకి మహర్షి ఆశ్రమం చేర్చటం, అక్కడ ఆమె ప్రసవించటం, శత్రుఘ్నుడు ఆ శుభవార్త విని ఆనందించటం, శంబుకుని వధించటం, అగస్త్య మహర్షిని సేవించటం, అశ్వమేధం తలపెట్టటం, అవనీపతుల ఆహ్వానించి, అశ్వాన్ని వదలి సవనం సాగించటంవరకు సాగింది. ఆ నాటికి సభ ముగిసింది. అందరి హృదయాల్లో ఆనంద చంద్రిక వెల్లివిరిసింది. సాధ్వీమతల్లి జానకి క్షేమంగా ప్రసవించిందనీ, కొడుకులతో కుశలంగా వున్నదనీ విన్న మహాజనం పొంగిపోయింది. ఆ ఆనంద రేఖలో ఒక ఆశంక వచ్చిందికూడ. "ఆమె కన్న కుమారులువీరేనా?" అని. "ఎందుకుకాకూడదు? ఈ మొక్కల్లే చెప్పతున్నై" అని. అంతలో పరిహారం. ఆరాత్రిగడిచింది. మరునాడు సభ్యులకు ఆప్రదేశం చాలలేదు. విశాలప్రదేశంలో ఏర్పాటుచేయబడింది. ఆనాటి సభ్యుల ఉత్కంఠ అవధులు దాటింది. అందరి కన్నులు ఆ బాలకులమీదే వున్నై. కుమారులు తంత్రులుసవరించి గురుస్తుతిచేశారు. వాల్మీకిమహర్షి తన శిష్యులైనకుశలవులతో యజ్ఞశాలలో రామాయణం గానంచేయమని ఆదేశించటం, ప్రభువు కోరితే సాంతంగావినుపించుమని చెప్పటం, వారువచ్చి గానంచేయటంవరకూ పాడారు. అంతతో అందరి సంశయం నివృత్తి అయింది. సభ్యుల వదనాల్లో దరహాస

రేఖ తాండవించింది. రాముడు ఉత్సుకత ఒక వంక, ఉద్విగ్నత మరో వంక నెట్టుకునిరాగా, ఆగలేక లేచి నిలబడ్డాడు. "సభ్యులారా! ఈ బాలకులు సీతా తనూజాతులనివిన్నారుకదా?" "రామప్రభూ! వినటమేకాదు. కళ్ళారకన్నాం. ఈ బాలకులు వచ్చిననాడే మాకు సంశయం కలిగింది. ఈ దివ్యమంగళ విగ్రహాలు సీతమ్మకు, నీకుకాక ఎవరికి కల్గుతారు? మాభారం తీరింది. మూర్ఖజన సందోహంలోని అజ్ఞానం నశించింది. పరమేష్ఠి సదృశుడైన వాల్మీకి మహర్షి ఆ తల్లిని ఆదరించటమేకాక, అల్పుల, దుర్జనుల నోళ్ళు మూయించటానికీ, కళ్ళు తెరిచి సత్యం కనుగొనటానికీ అమృత కల్పమైన రామాయణం రచించి, ఆమె బిడ్డలచే నీ ఎదుట, మా ఎదుట, మహర్షుల ఎదుట గానం చేయించి శీలవతిగా స్థాపించాడు. రఘువంశ మణిదీపలైన ఈ ముద్దుబిడ్డలు ఆదర్శదంపతులైన సీతారాముల చల్లని కడుపుపంట.పూర్వం ప్రజాభిప్రాయాన్ని మన్నించి నిండు చూలాలిని, మహాసాధ్విని, ఆదర్శగృహిణిని నిర్దాక్షిణ్యంగా పరిత్యజించావు. ఏకపత్నీవ్రతుడంటే ఇలా వుండాలనీ, ప్రభువంటే ప్రజల పీడించి భోగలాలసుడుగా జీవించటంకాదు, వారి అభిమతాలు మన్నించేవాడుగా వుండాలనీ, లోకం కోసం ఆచరించి, అనుభవ పూర్వకంగా చూపించావు. పశ్చాత్తాప వహ్నిలో పునర్జీవితులైన ఆ ప్రజల అభిమతానుసారం, వారి ఆనందంకోసం ఆమెనూ, పుత్రులనూ మా సమక్షంలో గ్రహించి, మమ్మల్ని పాప పంకిలం నుంచి ఉద్ధరించుమని ఏకకంఠంగా ఎలుగెత్తి చెపుతున్నాం. ఇది ప్రజాభిప్రాయం. నీవు ప్రజాభిమానివి. ప్రజా రంజకుడవు. ప్రజా ప్రతినిధివి" అని కొందరు పెద్దలు లేచి సమాధానం ఇస్తుంటే కరతాళ ధ్వనులతో పులకితుడైన సమీరుడు తన హర్షం దిగంత పరివ్యాప్తం చేశాడు. ఆ మాటలు విన్న రాముడు "పూజ్యులారా! దశరథులు ఎప్పటికీ ప్రజాప్రతినిధులే. మీ కోరిక ను . అంగీకరించే ముందు నేను కొన్ని మాటలు చెపుతాను. ప్రజాశబ్దం సమూహార్థద్యోతకం.అందుచేత అది సృష్టిలోని ఎన్ని భేదాలు ఎన్ని సమన్వయాలు కలవో అన్నింటికి ప్రతినిధి. కనుక దాని అభిమాన దురభిమానాలు రెండూ వివేకులకు సమానమే. ఆనాటి అపవాదు సృ జి ం చి న ప్రజకానీ, ఈనాడు అభిమానం చూపించిన ప్రజకానీ భిన్నమైంది కాదు. ఇదే అది. దానికి దీనికి బాహ్యదృష్టే ప్రధానం. అంతర్దృష్టి శూన్యం. ఆనాటి నా భార్య

అగ్ని పరీక్ష మీరు చూడలేదు. చూడలేదుకనుక చెప్పినా నమ్మరు. మాటపై విశ్వాసం మహాత్ములకేకాని, మానవ నామధారులకు కల్గదు. అప్పుడూ ఇప్పుడూ మీపై మమకారం నాకు ఒకటిగానే వుంది. మారలేదు. భార్యా పరిత్యాగంతో మీ బాహ్యాలోకన దూషితమైన భావాన్ని పరిష్కరించాను. ఈనాడు సత్యదర్శనా పూర్ణమనస్కులైన మిమ్మల్ని సీతాశపథ రూపంతో సంతుష్టుల చేస్తాను. వార్తాహారీ! నీవు వాల్మీకుల విడిదికి వెళ్ళి "మహర్షిశ్రేష్ఠా! మీరు రచించి చిరంజీవులచే గానం చేయించిన నా గాథ ఆమూలచూడం విన్నాను. ఎందుకు మీరీ బృహత్కావ్య నిర్మాణం చేశారో, అవి నాబిడ్డలచేత, నా సమక్షంలో, నా పౌరులు, నావారు, మేం అందరం అర్చించే వారు వినేలాగా గానంచేయించారో, అందులోని పరమార్థం అర్థంచేసుకున్నా. మీఅవ్యాజకరుణారసవృష్టినాపైకురిసినందుకు సృష్ట్యంతంవర్ధిల్లాను. ఏదయార్ద్ర హృదయంతో మా దంపతుల శీలాన్ని ఆదర్శవంతంగా లోకానికి చాటారో ఆ హృదయంతోనే సీత పరిపూత అనీ, వీతకల్మష అనీ పౌరజనం నమ్మే లాగా ఆమెచే శపథం చేయించాలని రాముడు అర్థిస్తున్నాడు" అని చెప్పి ఆయన సందేశం అందుకునిరా" అంటూ ఆదేశించాడు. రాముని హృదయం చీల్చుకుని వచ్చిన ఆ వాక్యాలు ప్రజాహృదయాన్ని మూసలోపుటంపెట్టాయి.

రామాజ్ఞ కొనిపోయినదూత వాల్మీకిని దర్శించాడు. ప్రభుసందేశం వినిపించాడు. ఆయన ఇచ్చిన సందేశం కొనివచ్చాడు. "ప్రభూ! "ప్రాణపతి ఆజ్ఞ మానవతులకు దాటరానిది. భార్యకు భర్త్రు తిరస్కృతి దైవ తిరస్కృతి కంటె ప్రమాదమైంది. ఆయన అభిమతం తప్పక నెరవేరుస్తుంది. రేపు సభలో ఆమె శీలాన్ని అందరూ దర్శించవచ్చు" అని చెప్పమన్నాడు" అంటూ విన్నవించి వెనుకకు తగ్గాడు. దాశరథి హృష్టుడైనాడు. "సభాసదులారా! భ్రాతసహిత ఋషీశ్వరులారా! సపరివార మహీపతులారా! బయటకు చెప్పలేక లోపల సంశయంతో బాధపడే లోకులారా! మహానుభావుడైన వాల్మీకిమహర్షి సీత సాధ్వీత్వాన్ని ప్రకటిస్తుందని వార్తపంపినసంగతి మీరు ఇప్పుడు విన్నారు. రేపు మహాసభ జరుగుతుంది. దానికి అందరూ ఆహ్వానితులే. ఆమె లోకంనుంచి పొందిన అపవాదు పాపుకుంటుందో, లోకం తాను కల్పించిన అపవాదు సత్యమని నిరూపించుకుంటుందో, దర్శించవచ్చు.

తప్పక దయచేయవలసిందిగా కోరుతున్నాను. ఈనాటికి సభ ముగిస్తున్నాను" అని చెప్పారు. "రామా! ఈ నిర్ణయం నీకే చెల్లింది. ఇంత నిర్భయంగా లోకంకోసం రెండుసార్లు పరీక్షకు నిల్పిన మగవారు ఇంతవరకులేరు ఇక ముందుండరు" అని శ్లాఘిస్తూ మౌనులు ఆశ్రమాలకు వెళ్ళారు. పౌరులు నిరాధారంగా, బుద్ధిలేక కల్పించిన నింద ఇంత విషమపరిణామానికి దారితీసినందుకు పశ్చాత్తాపదగ్ధులై తమతమ నెలవులు చేరుకున్నారు.

యజ్ఞశాలలో ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన విశ్రాంతి మందిరానికి రాముడుచేరాడు. సమయోచిత విధులుపూర్తిచేసి, నియతాహారం స్వీకరించి దర్భలపై పరచిన జింకచర్మంపై పట్టుశల్లా పరచగా దక్షిణహస్తం తలగడగా మేనువాల్చాడు. మెలకువకాదు, గాఢసుషుప్తికాదు. కలతనిద్ర కావచ్చు. అది స్వప్నావస్థఅందేసరిపోతుంది. కలవచ్చింది. తానూసీతాపునస్సమాగతులైనారు ఒండొరులు అవనతవదనులైనారు.పరస్పరం భాషించాలనుకున్నారు. పలుకులు రావు.సన్నిహితులుకావాలనుకున్నారు. పాదాలుకదలవు. ఇంతలోజగన్మోహన సుందరి మధ్యలో సాక్షాత్కరించింది. "స్వామీ! నేను వచ్చిన పని ముగిసింది. రేపు నిన్ను వదలిపోతున్నాను. ఇంతవరకు సంపూర్ణ మానవుడుగా ప్రవర్తించేందుకు ఇంద్రప్రేరితనై నీలో నివసించాను. నేను నీ వైష్ణవ మాయను. ఇకనుంచి నీవు మాయామానుషవిగ్రహుడవుగా పరిగణించబడి ప్రస్తుతించబడతావు. వైకుంఠంలో నీ దర్శనం వాంఛిస్తూ వుంటాను. ఈ ఆకారంలో మీకు కలిసి జీవించే అవకాశంలేదు. భృగు శాపాన్ని ఇంతవరకు దుష్టశిక్షణార్థం నిరోధించాను. రేపటినుంచి అది అనుభవానికి వస్తుంది. ఆ శాపాన్ని నీవై అంగీకరించావు కదా? ఇక నాకు శలవు" అని పల్కి ఆ సుందరి అదృశ్యమైంది. సీత క్రమక్రమంగా దూరమైపోతూంది. తాను తొందరగా నడిచినా, పరుగెత్తినా చేరుకోలేకపోతున్నాడు. ఆగ్రహం వచ్చింది. కనులు తెరిచాడు. ఎదుట ఏమీలేదు. అంతా ప్రశాంతంగా వుంది. మళ్ళీ నిద్ర పట్టలేదు. కొలదికాలంలోనే నియత కర్మారంభానికి సూచనగా యజ్ఞశాల ఘంట మ్రోగింది. రాముడులేచాడు. కాలకృత్యాలుముగించాడు. స్నాతుడై వార్చాడు. నిత్య విధి తీర్చాడు. క్రతువాటిక చేరాడు. అక్కడి పనులన్నీ ఆచరించాడు. భరతుని పిల్చి సభా ప్రదేశాన్ని గూర్చి తెలుసుకున్నాడు. సభకు వెళ్ళుతూ,

వసిష్ఠ వామదేవ జాబాలి కాశ్యప గాధి జగర్గ చ్యవన పర్వత నారద భార్గవ శక్తి వామన భరద్వాజ దుర్వాసోగ్నిసుత సుప్రభ సుయజ్ఞ మౌద్గల్యాది మహర్షులను, రాత్రించర వనచరులను, భూపాలురను, చాతుర్వర్ణ్య జనాన్ని సభకు రమ్మని చెప్పటానికి సౌమిత్రిని నియమించాడు. దూర తీరాల నుంచి బ్రహ్మణ్యులు యోగశక్తులతో జానకీ శపథాన్ని తిలకించాలని వచ్చారు. అరు దెంచిన వారంతా అద్రివలె అచలస్థితిలో వున్నారు. సభా ప్రారంభవేళ తెలు పుతూ ఘంటాఘోష, తూర్యారావం మ్రోగింది. అప్పటికే అన్నీ ముగించు కుని సిద్ధంగావున్న మహర్షి సీతతోనూ, ఆమె బిడ్డలతోనూ సభా ప్రవేశం చేశారు. సభ వింజమాకిడినట్లయింది.

ఆత్మతేజఃపుంజంతో సదస్యుల అనుశాసిస్తూ, నిజతపఃఫలంతో సత్య ధర్మాలకు రూపకల్పనచేస్తూ వాల్మీకి వస్తుంటే, శిరం వంచుకుని, కన్నీరు కారుస్తూ, పతినిధ్యానిస్తూ, స్వస్తికచిహ్నంగా రెండుచేతులు కంఠానికి చేర్చి నిమీలితాక్షియై కొంత నడిచి, హస్తద్వయంమోడిచి వెనుక సీతవచ్చింది. కుశ లవులు మిగిలిన శిష్యగణంతో, మునులతో ఆ వెనుక వచ్చారు. మహర్షి వెంట మైథిలి వస్తుంటే, విధాత వెంట అనుగమనం చేసే శ్రుతిమాత చందంగా మహర్షులు, యోగులు దర్శించారు. జనకరాజర్షివెంట కల్యాణ వేదికకువస్తున్న జానకిని అయోధ్య పౌరులు కాంచారు. విజ్ఞులు, వివేకులు సత్యంతో కూడిన ధర్మంగా తిలకించారు. సామాన్యులు శోకభారంతో హాహాకారాలు చేశారు. కొందరు సీతను పొగడితే, కొందరు రాముని పొగడారు. మరికొందరు సీతా రాముల కలిపి మేలు మేలని మెచ్చుకున్నారు. అపవాద సృష్టికి నిలయమైన వారు వాతాహతికి వాతూల పుంజంవలె ఆదృశ్యం చూడలేక చెల్లాచెదురైనారు. బ్రహ్మణ్యుడైన వాల్మీకి సభా మధ్యంలో ఏర్పరచిన వేదికపైకి ఎక్కి రామునివంక చూచాడు.

"ఇక్ష్వాకు వంశమండనా! దుష్టజనఖండనా! దాశరథీ! దయాశరధీ! రణభీమా! శ్రీరామా! జానకి సువ్రతాత్మ. శుభధర్మస్ఫీత చారిత్ర. నీవు లోక నిందకు మూలాలియైన సాధ్విని నా ఆశ్రమ ప్రాంతంలో విడిచి పెట్టిం చావు. నేనామెను జనకునివలె కాపాడాను. ఆమె నీ వంశాంకురాలను ఇద్దరిని కన్నది. వారే నా శిష్యులు. కుశలవులు. నిన్నటివరకు రామాయణం గానం

చేసింది నా అనుమతితో వారే. ఈ తల్లి శపథం చేసేముందు నేను సత్యస్థాప నకు ప్రతిజ్ఞ చేస్తున్నాను. నేను ప్రచేతసునకు పదో కుమారుణ్ణి. మనసావాచా కర్మణా అనృత దోషం ఎరగను. ఈ కవలలు నీ పుత్రులే. అగణిత సహ స్రాబ్దాలు అతి ఘోరంగా తపస్సుచేసి, అజుని అనుగ్రహాన్ని, ఆత్మశక్తిని పొందాను. ఈ లోకమాత, సర్వలక్షణ సముపేత, సీత పతివ్రతకాదేని, ఈ సంతానం నీవీర్య జాతం కాదేని నేను పొందిన తపఃఫలం ఇప్పుడే మీ ఎదుట దగ్ధమై బూడిదరాశిగా రూపొందుగాక. త్రికరణముల పాపం చేసినవాడు పొందే లోకం నాకు ప్రాప్తించుగాక. సర్వసృష్టికి ప్రధానమైన పంచ భూతాలను నా దివ్యదృష్టితో పరిశీలించే ఈమె శీలవతిగా, లోకమాతగా గురు తించే ఆశ్రమం ఇచ్చాను.ఆమె సౌశీల్యం అంగనాలోకం ఆదర్శంగా గ్రహించ టానికే ఆమె చరిత్ర వ్రాశాను. అందుకే "సీతాయాశ్చరితం మహత్" అని చెప్పుకున్నాను. ఆమె పతివైన నిన్ను "రామం సత్య పరాక్రమం" అని అనేకార్థ ప్రతి పాద్యమైన విశేషం వాడి గౌరవించాను. ఈమె శీలవతి అనీ, పరిశుద్ధ అనీ నీకు తెలుసు. తెలిసి కూడ లోకంకోసం త్యాగం చేశావు. ఆమె ఎటువంటిదో ఎరిగినవాడవుకనుక ఆనాడు అగ్ని పరీక్ష చేయించావు. ఈనాడు ఏ పరీక్ష విధిస్తావో విధించు. లేదా ఆమె తన సౌశీల్యం ఎలా ప్రకటించాలని భావించిందో ఆలాగే చేయవచ్చు. నా సత్య స్థాపనలో నేను చేసిన ప్రతిజ్ఞ ప్రకారం నా తపఃఫలం బూడిద కాలేదు.నాకు పాపం అంటలేదు. కనుక సీత శీలవతి అని సత్యస్థాపన జరిగింది. నీ అను మతి అయితే నీసతి, సహధర్మచారిణి దాన్ని తన సౌశీల్యంతో బలపరుస్తుంది" అని పల్కి వేదిక దిగి ఆసనం అలంకరించాడు.

మహర్షి వేదికదిగగానే రాముడులేచి మహర్షికి అభివాదంచేసి, సీత వైపుతిరిగి "పరమ తపస్వీ! ఆనాడూ, ఈనాడూ అనేకాదు. ఏనాడూ నిన్ను శంకించలేదు. ఎంత పరిశుద్ధులమైనా, ఎంత అనురాగబద్ధులమైనా మనమధ్య లోకంవుంది. ఈలోకంతో నాకేమని తిరస్కరించే అవకాశం నాకు పూర్ణంగా వుంది. కాని, నేను పరమభక్తుడైన భరతుని తృప్తికై రాజ్యం గ్రహించాను. దానితో ప్రజాభిమతం తెలిసి ప్రవర్తించవలసిన అవసరం నాకు కలిగింది. అందుకే బాహ్యంగా నాకు నిన్ను దూరంచేసి జీవితాంతం దుఃఖభాజనుడుగా

మిగిలిపోయాను. ఆనాడు లంకలో అగ్నిప్రవేశం చేసేముందు ఏ భావాన్ని పొంది ఉభయుల గౌరవం ఉద్ధరించావో, ఆ భావంతోనే అమాయకులైన ఈ పౌరుల నీ బిడ్డలుగా భావించి ఈనాడు శపథం చేయి. నిన్ను మాటిమాటికీ రచ్చకీడ్చుతున్న పాపకర్ముడని నీ పతిని భావించక క్షమించు. ప్రజాపాలనం అందరు రాజులవలె హంసతూలికా శయనం మనకుకాదు. కటిక రాలపై పరచిన కంటకాలు కల్గిన భూశయనానికి మనం సంతృప్తి మాత్రస్థానీయులం. ఆనాడూ ఈ విధంగా చేయమని నిన్ను కోరలేదు. ఈనాడూ కోరను. భావి నాకు రాత్రేతెలిసింది. నీ ఇష్టానుసారం చేసి సీతారామనామాన్ని సార్థవంతంగా, సత్యధర్మ ప్రతిరూపంగా, శాశ్వతంగాచేయి. ఇంతకంటె నేనుచెప్పేది ఏమీలేదు. భార్యను విడిచిన భర్తకు ఆమెను అనుశాసించే అధికారం ఎక్కడ వుంది? ఇది అభ్యర్థనగా మాత్రమే గ్రహించి ఆచరించు" అని రాముడు చెపుతుంటే మానవత్వం కలవారి హృదయం కరగిపోయింది. భావనకందని ఏ విషమపరిణామం రానున్నదో అని అక్కడిలోకం అల్లాడిపోయింది. మళ్ళీ రాముడు "మైథిలీ! మన విశ్వాసం ఏనాడూపోలేదు. అందుకే నిన్ను లంక నుంచి కొనివచ్చాను. అక్కడ జరిగిన పరీక్ష ఇక్కడివారు విశ్వసించలేదు. ఇక్కడివారు విశ్వసిస్తే నేను హాయిగా వూపిరి పీల్చుతాను" అని విషయం ముగించపోతుంటే రాముని అభిప్రాయంతెలిసి ఇంద్రాదిదేవతలు, బ్రహ్మవసు రుద్రసిద్ధసాధ్య మరుత్తులు మొదలైనవారు సీతా శపథం చూడటానికి వచ్చి మింటనిల్చారు. వారికందరకు రాముడు నమస్కరించి "మహాత్ములారా! నమ్మేవారికి మహర్షి ప్రతిజ్ఞ ఒక్కటే చాలు. అదినేను నమ్మాను. లోకం నమ్మితే సంతోషిస్తాను" అని ముగించాడు. సుఖావహం, హృదయంగమం, దివ్యసుగంధంకలవాడై అనిలుడు అక్కడి లోకులకు హాయికూర్చేనిమిత్తం వీచాడు. జానకి బిడ్డలచేయూతతో వేదికనెక్కింది. ఇద్దరిబిడ్డల కౌగిలిలోనిలుపుకుంది. కన్నీటితో శిరంతడిపింది. పోయి మహర్షులవద్ద నిలవండని ఆదేశించింది. తనపతివంకచూచింది. ఆచూపులో "హృదయేశ్వరా! నేనువచ్చినపని ముగిసింది. ఈ జన్మలో మనకు కలయిక నేటితో ముగిసింది. నీ రాకకోసం వైకుంఠంలో వేచివుంటాను. భవిష్యద్దర్శనం కలిగించని చెప్పావుకదా? ఇక నేను మాత్రం చెప్పేదేముంది? నీవై కోరుతున్నావు కనుక దాన్ని సత్య

భాషిణిగా పూర్తిచేయి" అన్న భావాలుస్ఫురించి తాను కన్నకలకూ, కలలోని ఘటనకూ, జరుగుతున్న పరిణామానికీ పోల్చుకుని గంభీరమూర్తియైనాడు. సీత తలవంచి సభకు, పతికి నమస్కరించింది.

## సీతాదేవి శపథం చేయుట

"తల్లీ! మాధవీదేవీ! (భూమాత) పరిణయం మొదలు ఈ క్షణంవరకు నా పతిదేవుని తప్ప అన్యపురుషభావం వాక్కాయకర్మల్లో పొందనిదాననైతే, నన్ను గూర్చిన నా తండ్రివంటి వాల్మీకిమహర్షి సత్యస్థాపన సమర్థవంతమైన దయితే నన్ను నీలో చేర్చుకుంటానికి దారి ఈయి. అపస్మారకస్థితిలో అసురునిచే అపహృతనైన వేళ అతనివల్ల కలిగిన దేహస్పర్శ నా శీలానికి భంగకారి కాక అతని మరణానికే హేతువైతే నన్ను నీలో చేర్చుకుంటానికి దారి ఈయి. నా మరదిపట్ల ఆనాడు పలికిన పలుకులు స్త్రీజాతి సహజమైనవిగా కాక, పతిదేవునిపైగల అనురాగం అంచులు దాటిన ఆవేశంలో విచక్షణా రహితంగా వచ్చినవనీ, అనంతరం అశోకవనంలో పతివియోగక్లేశంలో పశ్చాత్తాపంతో ఆ పాపం అంతరించిందనీ, అగ్నిపరీక్షలో భౌతిక శరీరం భస్మమై పుటం పెట్టిన బంగారంవలె పవిత్ర శరీరం వచ్చిందనీ, బ్రహ్మాది దేవతలు నా శీలం ప్రస్తుతించగా, సీతచే నేనే శుచినైనానని అగ్నిదేవుడు అన్నది నిజమైందనీ నీవు విశ్వసిస్తే, నీ బిడ్డపై నీకు కూర్మి వుంటే నన్ను నీలో చేర్చుకుంటానికి దారి ఈయి" అని మూర్ఖులు కల్గించిన మూడునిందలపై శపథం చేసింది. అచంచలయై నిలిచింది.

దిక్కరి శ్రవణ విదారకంగా మేఘం గర్జించింది. భూమి కంపించింది. సభాంగణం సదస్య సమూహంతో తల్లకిందయింది. శ్రీరాముడాసీనుడై యున్న సింహాసనం మూడంగుళాలు భూమిలోకి దిగింది. అమితవిక్రములైన అహిపతులు, దివ్యరత్నజ్వలితం, దేవతావిరచితం, దివ్యసింహాసనం తలలపై ధరించి ప్రజలు పరమాద్భుతం పొందగా భూమి తనయ ముందు భూమిలోనుంచి పైకి కొని వచ్చారు. ఆ సింహాసనంలో మహా మంగళ స్వరూపిణి అయిన ధాత్రీదేవి అధిరోహించి వుంది. ఆమె శరీర కాంతులు ప్రేక్షకులకు నయన దుస్సహమైనై. ఆమె చేతులు చాచి సీతను గ్రహించి, కుశల మడిగి అంకంలో కూర్చుండబెట్టుకుని రసాతలానికి కొనిపోయింది.

ఆమె తల్లితో అంతర్హిత అవుతుంటే ఆకసం నుంచి అమరులు అవిచ్ఛిన్నంగా పుష్పవృష్టి కురిశారు. సురలు, మునులు శ్లాఘించారు. "ఔర, బాపురే, బళీ, ఆహాహా, బాగు" అన్న జనసందోహవాక్యాలు మిన్నుముట్టినై. "అమ్మా జానకీ! నిన్ను కన్నవారు ధన్యులు. నిన్ను కైపట్టినవాడు పురుషోత్తముడు. నిన్ను దర్శించినవారు గతకల్మషులు. తల్లీ! నీ నడవడిక ఇట్టిదని చెప్పే అధికారం ఆదికవి వాల్మీకికే తప్ప అన్యులకు వాచామగోచరం. మా అజ్ఞానంచే చల్లని తల్లిని నిన్ను పోగొట్టుకున్న దౌర్భాగ్యులం" అని పౌరుల్లో కొందరు ప్రస్తుతించారు. కొందరు గొల్లున ఏడిచారు. కొందరు ఆమె మూర్తిని భావాంబర వీథిలో తిలకించారు. భూతల గగనతల పాతాళల్లో వసించే జీవకోటి సీత చైతన్యమై ప్రతిమలుగా మారింది.

సుగ్రీవాది కపిమండలం, "అజ్ఞానలోకం మాటి మాటికి చేసే అపనిందలకు అవమాన రూపమైన పరీక్షలు తనకు తప్పవనీ, ఎంత ఘనమైన పరీక్ష ఇచ్చినా లోకం ఏదోఒక నిందవేస్తూనే వుంటుందనీ, భర్త ప్రజాభిప్రాయం మన్నించక తప్పదనీ, అందువే సంసారంసాఫీగా సాగదనీ, విషయ భేదంతో వియోగం తప్పదనీ తలచిన ధరణీజాత, శాశ్వతంగా మూర్ఖ లోకానికి బుద్ధివచ్చే రీతిగా, పతి ప్రజానిందలకు పాత్రుడై మనశ్శాంతి కోల్పోవటం భావ్యంకాదనీ శరీర త్యాగం చేయటం ఆమె సౌ శీ ల్యా ని కి అధికాధిక ప్రతిష్ఠ కలిగించిం"దని హర్షం వెలిబుచ్చింది. యజ్ఞదీక్షలో చేత ధరించిన పలాశదండాన్ని ఊతగా పట్టుకుని రాముడు తలవాల్చి ఉ ప్పె న కు వార్థి కల్లోలం పొందినట్లు సీత రసాతల ప్రవేశం చేసిన ఘటనకు సంక్షోభం పొందాడు. గట్టు తెంచుకున్న వాహినివలె శోకం కన్నులవెంట అశ్రువులుగా ప్రవహించింది. "సాధ్వీ! నేను నీ సౌశీల్యాన్ని, అనురాగాన్ని, సేవను తెలిసినవాడనైనా, ఇక్ష్వాకువంశ ప్రభువుగా నీపట్ల దుర్బలుడనైనాను. నన్ను నీవు తెలిసికొన్నంతగా లోకం తెలిసికోలేదు. నీవైన నాపై కనికరం చూపక నన్ను శాశ్వత దుఃఖితునిగాచేసి విడనాడి పోవటం ధర్మమా? అవును. ఇంతకంటె మానవతి ఏం చేస్తుంది? చీటికీ మాటికీ బజారుకీడ్చే భర్తతో ఎంత క్షమాగుణ సంపన్నురాలైన ఆడది అయినా సంసారం ఎలా సాగించుతుంది" అని శాంతింప చూచాడు. అంతలో పురుషధర్మం ప్రకోపించింది. "శత

యోజన విస్తీర్ణ సాగరందాటి అమోఘవరాలందిన అసురుణ్ణి సబాంధవంగా సంహరించి సీతను దెచ్చుకున్న నాకు, నా సమక్షంలో నన్ను తృణీకరించి నా భార్యను కొనిపోయిన భూదేవిని శిక్షించి మరల తెచ్చుకోలేనా?" అన్న భావం రాగానే దండతాడిత దందశూకంగా రోజాడు.

అశ్రువులు రాల్చిన నేత్రాలు రోష కషాయితమై అగ్ని స్ఫులింగాలు రాల్చుతున్నై. కంపితగాత్రం వింధ్యనగంవలె విక్రమించింది. చేతనున్న దండం రాజ దండంగా ధరించాడు. "వసుధాదేవీ! నా సీతను నాకుతెచ్చి వప్ప గించు. లేదా? నా ఆగ్రహం పర్యవసానం ఏమిటో చూడదలుచుకుంటే నా మాట తిరస్కరించు. హలధరుడై జనకుడు యజ్ఞక్షేత్రం దున్నుతూ నీలో నుంచేకదా పొందాడు? ఆమెనేకదా నాకు భార్యగ సమర్పించాడు? అందుచే నీవు నాకు అత్తగారి వవుతావు. కనుక నా విజ్ఞప్తిని పాటించి సశరీరగా నా సహధర్మచారిణినితెచ్చి నాకు తప్పికూర్చు.కాదంటే నేనుచేయ బోయేపనికూడా తెలుపుతున్నాను. సరిత్సముద్ర పర్వతకానన పట్టణాంతో నిన్ను రూపుమాపుతాను. ఆస్థితికి నేను రాకుండా మాదాంపత్యాన్ని పునరుద్ధ రించు. లేదా? నన్నుకూడ ఆమెసన్నిధచేర్చు. అత్తగారివిగా నీకు అదిధర్మం. బిడ్డపట్లతల్లి కోరేదే అదికదా? నీవు నామాట మన్నించేట్లులేవు. కాలహరణం సహించలేను. ఆగ్రహం అవమానంతో అధికమవుతూంది. లక్ష్మణా! నా కోదండం. తూణీరం" అని అన్నాడు.

రాముడు ఆగ్రహభావం పొందగానే సకలచరాచరజగత్తు స్తంభీభూత మైంది. బ్రహ్మ అకాలప్రళయాన్ని దర్శించాడు. ఆరసంనుంచి సీతాశప థాన్నిచూడవచ్చిన విధాత హంస వాహనారూఢుడై రామునిముందు సాక్షాత్క రించాడు. "రామా! శాంతించు. శాంతించు. పూర్వభావాన్ని పొందు. మనం సలిపినమంత్రాంగం మర్యాదనుకాపాడు. గురుతుచేసి కర్తవ్యబోధ సలప టానికి నేనెంతవాణ్ణి? నీ జననం వైష్ణవసంబంధం. ఇప్పటికిశాంతి వహించు. నీవు లేక నీసతి స్వస్థానంచేరదు. ఆమెరసాతల సీమలో నీ అఖండతపో బలంతో సర్వసుఖసమేతగా, క్షేమంతో వుంటుంది. నీకీవిషయం నిన్నరాత్రే తెలుపబడింది. ఆగ్రహముక్తుడవై సవనకార్యంసాంతంచేయి.

శేషించిన ఉత్తరకాండ కథవిను. అందులో బ్రహ్మర్షి ఆత్మదర్శనంతో

నీ భవిష్యత్కార్య విధానం విరచించాడు. నామాటకు విలువ ప్రసాదించు. అది లోకోత్తరకావ్యం. అది నీ భూతవర్తమాన భవిష్యత్తులలోని సుఖదుఃఖాలు సత్యంగా జరిగినవి, జరగబోయేవీ చెప్పింది. ఆ కావ్యం వినటానికి నీవే అర్హుడవు. మహర్షి నిన్నుగూర్చి ఎందుకు వ్రాశాడంటే నీయందే అఖిలలోకం సుప్రతిష్ఠితమైవుంది కనుక. ఇదే ఆదికావ్యం. అద్భుతమై, అజ్ఞానచ్యుతమై, సత్యమై, యుగాలుమారినా మారని యశస్సునుగూర్చే విధంగా లిఖించ బడింది. ఆ మహాకవి నా ఆజ్ఞచేతనే పరిసమాప్తంచేశాడు. నేను నా లోకంలో నిర్జరాళితో ఆయన వినిపించగా విన్నాను. ఈ కావ్యానికి నీవుగాక అన్యుడు నాయకుడుగా, అన్యస్త్రీ జానకిగాక నాయికగా అర్హులుకారు. అందుకే శ్రీరామాయణం అనిపేరు పెట్టాడు. ఉత్తరకాండలో రేపు నీవు వినబోయే ఘట్టంలో ఇప్పుడు జరిగినకథవుంది, ముందేం జరుగుతుందో అది నీకు ముందే బోధపడుతుంది. తప్పక మునులతోకూడి విను"మని రాముని కొక్కనికే కనిపించి చెప్పి సురగణంతో అదృశ్యుడయ్యాడు. రాముడు శాంతించాడు. విధినిర్దేశం ప్రకారం శేషం వినదలిచాడు. "మహాత్మా! బాలకులచేతగానం చేయించు"మని అర్థించి అనుమతిపొందాడు. బాలకులతో వాల్మీకితన విడిదికి వెళ్ళగా, సభముగించి రాముడు నియుక్తనిలయానికి చేరాడు.

సభావసాన సమయంలో సదస్సును మరల రేపు కూర్చుదని సహోదరులతో చెప్పలేదు. సభ్యుల రమ్మని చెప్పలేదు. సాయంవేళా విరచనా కార్యకలాపం ముగించి శయనమందిరం చేరి తానూ సీతాకలిసి పొందిన సుఖదుఃఖాలను మననం చేసుకుంటూ, మనస్సును నిగ్రహించుకుంటూ రాత్రి గడిపాడు. సూర్యోదయం కాగానే పుత్రకుల రావించి, "చింతమాని శేష కథ గానం చేయండి" అని కోరాడు. వారు శ్రుతిపీనంగా భవిష్యద్రామచరితం పాడసాగారు. మహర్షులుమాత్రం తమంత వచ్చి శ్రవణపేయంగా, భవబంధ హరంగా విన్నారు. శేషభాగం పూర్తికాగానే యజ్వలు అశ్వమేధ యాగం ముగించి, విశ్వశ్రేయస్సుకోసం, యజ్ఞక్షేత్రపవిత్రతకోసం, శాంతిమంత్రాలు పఠించి "సర్వం శ్రీపరమేశ్వరార్పణమస్తు" అనిరామునిచేజలంయజ్ఞకుండంలో విడిపించారు. సవనం సాంతంకాగానే సీతావియోగదురంత చింతతో దూరాగతులై క్రతుదర్శనార్థం వచ్చిన మర్కట దనుజమనుజాధిపులను అతులిత సన్మానాలతో గౌరవించి స్వదేశాలకుపోవ అనుమతి ఇచ్చాడు.

## శ్రీరాముడు పుత్రులతో అయోధ్యకు వచ్చుట

సుతులు, సోదరులు, పరివారజనం వెంటరాగా అయోధ్యకు తిరిగి ఏతెంచాడు. ఏబదేండ్లయినానిండని రాముడు ఎన్నో యజ్ఞాలుచేశాడు. కాని, ద్వితీయ సతీకరగ్రహణం మాత్రం చేయలేదు. అన్నిక్రతువుల్లో, అన్ని శుభాశుభకార్యాల్లో, అపనిజ ప్రతిరూపంగా చేసిన బంగారు ప్రతిమనే భార్యగా సరసనుంచుకుని చేశాడు. ఆవిధంగా పదివేల వత్సరాలు బంగారు సీతను భార్యగా ప్రక్క నిల్పుకుని ప్రజలను పాలించాడు అనేక సవనాలుసలిపాడు. అఖండదానాలు చేశాడు. అవికాక అగ్నిష్టోమగోసవములు, అతిరాత్రవ్రత ములు కష్టసాధ్యమైనవికూడ ఆచరించాడు. వానర రాక్షసలోకం ఆజ్ఞాబద్ధమై వర్తించింది. జనులు పూర్ణాయుష్కులూ, పూర్ణకాములు అయినారు. ఋతు బద్ధంగా ఇంద్రుడు వర్షించాడు. కాటకాలు కాలు నిలుపుకోలేక విశ్వాంతరాళా లకు పలసపోయినై. పుష్టులై హృష్టులై, జరారుజాదోషరహితులై పల్లీగ్రామ నగర పట్టణవాసులైన పౌరులంతా సిరిసంపదలతో తులతూగారు. అకాల రణాలులేవు. అన్యోన్య హింసాకాండలేదు. ముందువెనుకల స్తుతినిందలు వు. బహుదీర్ఘకాలం ఇక్ష్వాకు వంశ్యుల అందరినీ మరపించి రాముడు జ్యం పాలించాడు. పతిపుత్రవియోగంతో పదునాలుగేండ్లు దుఃఖభాగినిగా ..సిపిన కౌసల్య చిన్నతనంలోనే కొడుకు ముచ్చటైన కాపురం చూస్తు కలవ టంతో పరిపూర్ణ సంతోషం పొందలేకపోయింది మనుమలతో కొడుకురాగానే కోడలు వున్నట్లుగా కొంతతృప్తిపడింది. బహుకాలం బ్రదికింది. అనంతరం ఆమె మరణించింది. ఆమె వెనుక సుమిత్రా కైకలు మరణించారు. మాతృ దేవుల మరణానంతరం తమ్ములతోకూడి తల్లులకు ఊర్ధ్వదైహిక కర్మలు సశాస్త్రీయంగా జరిపాడు. పుత్రులుచేసిన కర్మఫలంగా స్వర్గంలో వున్న దశరథుని సేవించటానికి తల్లులు ముగ్గురు దివ్యదేహాలతో తరలిపోయారు. రామచంద్రుడు సలిపిన ప్రేతవిధులు పితృదేవులకు శాశ్వత స్వర్గలోక ప్రాప్తి చేకూర్చింది.

## యుధాజిత్తు గార్గ్యుని శ్రీరామునికడకుపంపుట

మాతృదేవుల మరణంవల్ల కలిగిన చింత క్రమంగా సోదరులు తరిం

చారు. భరతలక్ష్మణులు రామునకు రెండు భుజాలుగానుండి రాజ్యపాలనంలో సహకరించారు. ఒకనాడు తమ్ములతో రాముడు గోష్ఠి సలుపుతున్న తరుణంలో ద్వారపాలకుడు వచ్చి గార్గ్యముని రాకను విన్నవించాడు. వార్తవిన్న రాముడు సోదరులగూడి క్రోశమాత్రదూరం ఎదురుపోయి అర్ఘ్యవిధి నిర్వర్తించి, ప్రేమ గౌరవాలతో మేనమామపంపిన బహువిధ పారితోషికాలందుకుని, పురంలోనికి ఆహ్వానించి తెచ్చి ఉపవిష్టుని కావించాడు. "మహాభాగా! మా తాత, మామ క్షేమంగా యున్నారా? ఏమి కార్యం మాతో చేయించతలచి నిన్ను పంపారు?" అని ప్రశ్నించాడు. "రామా! మీవారంతా కుశలంగా వున్నారు. ముఖ్యంగా మీ మేనమామ పంపిన విషయం విను. "సింధునదికి ఉభయ తీరప్రదేశాలు సర్వకాల సుభిక్షదేశాలు. పూర్వం ఇక్ష్వాకుల పాలనలో ఆ దేశాలు సామంతంగావుండేవి. వాటిని మూడుకోట్ల శైలూషపుత్రులు ఆక్రమించారు. విక్రమించారు. వారుసాయుధులు. యుద్ధకోవిదులు. సాహసోపేతులు. వారినిర్జించటం నీకుకాక మాకు సాధ్యంకాదు. నీకుఇష్టమైతే దారుణాహవంలో గంధర్వుల జయించి ఆ దేశాలు స్వాధీనం చేసుకో. వారివల్ల వచ్చే విపత్తులేదుకాని, నీ సార్వభౌమాధికారానికి మచ్చ వస్తుంది. నేను దూతలచే చెప్పించాను. వారు వినలేదు. సామంతులుగాకాక, మిత్రులుగా అధికారం గుర్తించమన్నా తిరస్కరించారు. వారు గంధర్వులట. స్వతంత్రులట. మానవుల అధికారం గుర్తించరట. ఈ విషయం నీ దృష్టికి తేవాలనే ఉగ్రతేజుడూ, అంగిరసుని పుత్రుడూ అయిన గార్గ్యమహర్షిని పంపాను. నీకు తోచినవిధంగా ఆచరించు" అని నాతో చెప్పి పంపాడు. ఇదే నా రాకకు కారణం" అంటూ ముగించాడు. రాముడు భరతునివంక చూచాడు. నీ కొడుకులిద్దరినీ పిలిపించుమన్నాడు. మహర్షిని చూచాడు. "దేవా! వీరు మా మామ సోదరిసుతుని సుతులు. తక్షపుష్కలులు. అనుపమ బలశాలులు. వీరిని భరతునితో పంపుతాను. తాత రక్షణలో ధరణీపాలనం చేస్తారు. నాతమ్ముడు గంధర్వుల నిర్జించి ఆ దేశాలను రెండు భాగాలుగా విభజించి ఇద్దరు బిడ్డలకు అప్పగిస్తాడు" అని రాజ్యాభిషిక్తులుగా అప్పటికప్పుడు సలిపి, తగినబలంతో తమ్ముని మునివెంట పంపాడు.

దినమేకరాత్రంగా ప్రయాణంచేసి కేకయపురం చతురంగబలంతో భరతుడు చేరాడు. దారిలో పలలాదాలైన సత్త్వాలు, భూతాలు, గంధర్వా

మిషం కడుపార మెక్కటానికి సైన్యం ముందుగా సాగిపోయింది సింహాలు, పులులు, రాబందులు పురోభాగంలో ప్రయాణించగా నేలపై పదిహేనుదినాలు ప్రయాణం సాగించి వచ్చిన మేనల్లునితో సర్వసన్నద్ధంగావున్న తన సైన్యం జతచేసి యుధాజిత్తు గంధర్వపురాన్ని ముట్టడించాడు. ఏడు రాత్రులు ఏక ధాటిగా పోరుసాగింది. జయాపజయాలు అనిశ్చిత పరిస్థితిలో నిల్చినై. ఆయుధ జలచరాశితో శోణితాపగలు ప్రవహించినై. చెక్కు చెదరక సమ యుద్ధం చేస్తున్న శత్రువుల పౌరుషాన్ని సహించలేక భరతుడు సంవర్త నామంగల సమవర్తి మహాస్త్రం నారి కర్ణాంతం తెగలాగి రోషసంజ్వ లన్మూర్తియై ప్రయోగించాడు. ఆకాలాస్త్రం కాలానల హవ్యవహజ్వాలామాలి కలవలె కత్తులవాన కురిసి మూడుకోట్ల రిపుజాలాన్ని నామరూపాలులేకుండా నాశనంచేసింది. కదనంలో గంధర్వులు నిహతులైన విధంచూచి దేవతలు విస్తుపోయారు. శత్రువుల జయించి సాధించిన సింధుతట ద్వయదేశాలకు పుత్రద్వయాన్ని ప్రభువులుగా చేసి పుష్కలునికి పుష్కలావతీ, తక్షునకు తక్షశిలా రాజధానులుగా ప్రకటించాడు అనాటి నుంచి అది గాంధారదేశనామంతో ప్రసిద్ధికెక్కింది. భరతుడు ఒక సంవత్సరం అక్కడవున్నాడు. పాపరహిత వ్యవహారాలతో, సుందరోద్యానాలశోభతో, విభక్తాంతరాపణాలతో, నవ్యవిమానాలతో, సుందరమందిరాలతో, మనోహరు లైన దేవాలయాలతో, తిలకతాలతమాలవకుళాది వృక్షసంతానబంధురసుమ సౌరభాలతో, పోటీపడినట్లు, వాదాడుకున్నట్టు పురయుగాన్ని భరతుడు వృద్ధి పరచాడు. మామా, పుత్రులూ కోరగా మరినాల్గు సంవత్సరాలు అక్కడ వుండి కుమారులకు పాలనా దక్షతననేర్పి అన్న సేవార్థం అయోధ్యకు మరలి వచ్చాడు.

విజయుడై వచ్చిన భరతుని ఆలింగనంచేసుకుని, యుద్ధవార్తలు, కుమారుల కుశలవార్తలూ విని ఆనందించాడు. సౌమిత్రినిచూచి "సోదరా! లక్ష్మణా! నీవలెనే నీ పుత్రులు సర్వలక్షణలక్షితులు. రాజ్యార్హులు. చిన్న పెద్ద తమ్ముల కుమారులకు తగినచోట ప్రభుత్వం అప్పగించాను. నీ చిరం జీవులనుకూడా యోగ్యస్థానాల్లో నిలిపితే నా భారం తీరిపోతుంది. తమ్ముడా! భరతా! విన్నావుగా నా అభిమతం? ఆశ్రమాలకూ, భూపతులకూ పీడకలుగ నట్టి ప్రదేశాలు ఎక్కడవున్నవో చెప్పు" అని అన్నాడు. భరతుడు దీర్ఘంగా

ఆలోచించాడు. "అన్నా! మన ఏలుబడిలోనే కారుపథం అనే ప్రదేశంవుంది. దానికి తమ్ముని పెద్దకొడుకు అంగదుని ప్రభువుగా చేయవచ్చు. ఆచోటు అబాధము, అతి మనోజ్ఞమూ అయింది. చంద్రకాంత ప్రదేశానికి రోలంబకేశుకు, సుకుమార సుందరుడు చంద్రకేతుడు రెండోవాడు ప్రభువుగా తగినవాడు" అని చెప్పాడు. రాముడు పొంగిపోయి రాకుమారుల రావించి అంగదుణ్ణి అంగదీయపురానికి రాజుగా అభిషేకించి తమ్ముడు లక్ష్మణుని తోడిచ్చి పడమర దిశగా పంపాడు. చంద్రకాంతాపురానికి మల్లయుద్ధ విశారదుడైన చంద్రకేతుని ప్రభువుగాచేసి భరతునితో ఉత్తర దిశకు పంపాడు. ఉభయులు కుమారులను కొనిపోయి రాజధానిగా అంగదపురాన్ని (కారుపథం) అభివృద్ధిపరచి లక్ష్మణుడూ, చంద్రకాంతాన్ని రాష్ట్రంగా దిద్ది భరతుడూ వత్సరకాలం గడిపి వారివారికి అధికారం అప్పగించి అన్న సన్నిధానానికి వచ్చారు. అన్న సేవలో వారిరువురికి కాలగమనం తెలియలేదు. పది వేల వసంతాలు సోదరచతుష్కంలో పరిమళించాయి. సదాప్రజారంజకులై, చతుర్విధ పురుషార్థ పూరిత మనస్కులై, శోభిత భాగ్యరమా విలాసులై, ప్రస్ఫుట తేజోవంతులై, ఆహుతులతో వెలిగే అగ్నిహోత్రత్రయంలాగా ప్రకాశించారు.

## రామ దర్శనార్థం కాలుడు వచ్చుట

ఏకాదశ సహస్ర సములు నిండుతుండగా తాపస వేషంతో దండధరుడు రాముని మందిర ద్వారాన్ని చేరవచ్చాడు. ద్వారముఖంలో నిల్చివున్న సౌమిత్రిని చూచి, "నేను దూతగా వచ్చాను. రామచంద్రుని చూడకోరుతున్నాను. రహస్య కార్యాన్ని కూర్చి చర్చించవలసి వుంది. నారాక చెప్పి పంపు"మని కోరాడు. "నన్ను అమితౌజస్కుడైన సంయమి అవసరంగా పంపాడని కూడ చెప్పు" మన్నాడు. స్వయంగా సౌమిత్రిపోయి ఆ వార్త రామునకెరుకపరిచాడు. ఆజ్ఞపొంది సంయమి కడకేతెంచి నమస్కారపూర్వకంగా కొని చని లోన విడిచాడు. వచ్చిన కృతకతాపస పుంగవుడు రాముని ఆశీర్వదించి నిల్చాడు. అర్ఘ్యపాద్యాదులతో అతిథిని అర్చించి అర్హపీఠాధిష్ఠుని చేసి "మహాత్మా! సేమమా? ఎక్కడనుంచిరాక? ఎవరి సందేశం తెచ్చారు? నావలన ఏమి వాంఛించారు? సెలవీయండి. శిరస్సుతో ఆ కార్యం తీరుస్తాను"

అని అడిగాడు. "రామచంద్రా! ఈ రహస్యం మన ఇద్దరికే పరిమితం. మన సంభాషణ సమయంలో అన్యులు రాకూడదు. వినకూడదు. ఆ విధంగా కట్టుదిట్టంచేసి, అది అతిక్రమించినవారిని అంతకపురానికి ఆతిథ్యం నిమిత్తం నీవు పంపుతానని ముందు మాటఇస్తే నేవచ్చిన కార్యం వినిపిస్తాను. కాదంటే పోతాను" అని మాయాముని ఆగాడు. యతికిమాట ఇచ్చి తమ్మునితో "రామానుజా! ఇందుకు నీవే సమర్థుడవు. నీవు ద్వారంకాచి, భటులను దూరంగా పంపు. మా సంభాషణవేళ వచ్చినవాడూ, విన్నవాడూ వధ్యుడు" అని రాముడు ద్వారరక్షణకు లక్ష్మణుని నియమించాడు. "చెప్పిన ప్రకారం చేశాను. ఇక సెలవియ్యి" అని కోరగా కాలుడు మందిరం పరిశీలించి, లేచి రాముని ఏకాంతంగా వున్నచోటికి కొనిపోయి తనరాక తెలియ చెప్పటానికి ఉద్యుక్తుడయ్యాడు.

"రామా! శ్రద్ధగా విను. నేను బ్రహ్మ సందేశం కొని వచ్చాను. నేను పూర్వజన్మలో నీ పుత్రుణ్ణి. మాయచేత సర్వ సంహారకుడనై కాలుడని పేరు పొందాను. బ్రహ్మ నీతో ఈవిధంగాచెప్పమన్నాడు."నీస్వస్థానంచేరిమమ్మల్ని రక్షించే సమయం సమీపించింది. సృష్ట్యంతంలో జలమయంగా లోకం వుండగా మొదట నన్ను సృజించావు. తర్వాత జలేశయమైన నాగవరం, అనంతమనే భోగవంతం, అయిన మాయచేత మధుకైటభుల చంపావు. వారి అస్థి మాంసాదులచే సశైలకాననాదులు కల మేదిని పుట్టింది.నీ నాభికమలంలో పుట్టిన నాకు ప్రాజాపత్య కర్మ నీవే అప్పగించావు. ఆ అధికారంతో విశ్వం సృజించాను. కాని రక్షించలేక పోయాను. నీవే రక్షించి నాకు యశస్సు ప్రసాదించుమని వేడుకుంటే విష్ణునామంతో రక్షకుడవయ్యావు. పిమ్మట అదితి పుత్రుడవై పుట్టి భ్రాతలకు సాహాయ్యం చేస్తున్నావు. ఆ నీవే లోక విద్రావణుడైన రావణాసురుని వధింప మానవ రూపధారివై అవతరించావు. ఈ అవతారానికి పదకొండువేల సంవత్సరాలు ప్రమాణం. ఈ నియమం నీవే నిర్ణయించావు. నీ నిర్ణయకాలం చేరువైంది. నీ ప్రేమపాత్రులమైన మమ్మల్ని కాపాడ స్వస్థాన ప్రవేశం కోరుతున్నాను" అని విధాత తెలుపుమని నన్ను పంపా"డని కాలుడు రామునితో చెప్పాడు. రాముడు నవ్వి "నా ఈ జననం లోకరక్షణార్థమేకదా? ఎక్కడినుంచి వచ్చానో అక్కడికే మళ్ళీ వస్తాను. నా కోరిక కూడా అదే. నాకు ఇక్కడికి వచ్చిన పని తీరింది. అశాంతి, కల్లోలం,

భయం వీడినుంచి ప్రజాబాహుళ్యం ఉద్ధరించబడింది. నా వశవర్తులైన అమర నాథులు సంపూర్ణ శక్తితో నా సంకల్పానికి తోడు పడవలసి వుంది. నా కది నియమం" అని చెప్పాడు.

రాముడు, కాలుడు రహస్య చర్చ జరుపుతుండగా దుర్వాసుడు రామ దర్శనార్థం వచ్చాడు. వాకిట నిలిచిన లక్ష్మణునకు తన వచ్చుట తెలిపి "కాలం మీరకుండా కలిసికోవలసిన అవసరం వుం"దనిచెప్పి రమ్మన్నాడు. "ప్రభువు వ్యగ్రుడు. జాగు కుండా మీ కార్యం నేను నెరవేరుస్తాను. కాదా? నిమేష కాలం ఆగండి" అని సౌమిత్రి వినయంతో విన్నవించాడు. దుర్వాసుడు ధూర్త బుద్ధితో "ఏమీ? నన్నే ఆగుమంటావా? నీవిపుడే పోయి చెప్పి తీరాలి. పోకపోతే నిన్నూ, నీ అన్ననూ, నీ వంశాన్నీ, నీ పురాన్నీ దగ్ధం చేస్తాను. నేను ఆగను. శపించుతాను" అని జలం గ్రహించపోతుండే "నా ఒక్కని మరణానికి వెరచి నేను పోకపోతే మా వంశమే నిర్మూలించబడుతుంది. ఇది జరుగరాని పని. నావారి క్షేమంకోసమేకాక ప్రజాక్షేమంకోసం కూడా నా మరణం జరిగి తీరాలె" అని క్షణంలో నిర్ణయించి లోనికిపోయి మునివచనాలు చెప్పాడు. విన్నరాముడు కాలునిపంపి లక్ష్మణుని వెంట వెలుపలికివచ్చి ఆతిథ్యం ఇచ్చి రాక కూర్చి ప్రశ్నించాడు. "రామా! సహస్రాబ్దాలు అతి ఘోర తపం చేశాను. ముగించి వచ్చాను. ఆకలి భరించలేను. భోజనం ప్రసాదించు"మని ముని కోరాడు. మృష్టాన్న భోజనంతో రాముడు మునిని తృప్తి పరచాడు. అనంతరం దీవించి ఆశ్రమానికి పోయాడు. కాలునికిచ్చిన మాట రాముని మనస్సులో ఖలుకుమంది. "సంహారకాలం సమీపించింది. అందుకే కాలుడు వచ్చాడు. ఇక నా ఉనికి ఇక్కడకా"దని తలచాడు.

గ్రస్తేందు మండలంవలె కళహీనంగా వున్న అన్నవదనం సౌమిత్రి చూచాడు. "అన్నా! మదర్థం ఇటు సంతాపిస్తావా? నీ నిర్ణయకాలం చేరు వైంది. ఇక మమకారం ఎక్కడ? నన్ను వధించి సత్యాన్ని రక్షించు. నీవు బాసతప్పితే ఇంత వృద్ధికి తెచ్చిన జనం నరకంలో కూలుతుంది. నాపైగల ప్రేమకు నిదర్శనం నీవ్రత పాలనమే" అని హెచ్చరించాడు. ఖోధనంది రాముడు సభ తీర్చాడు. జరిగిన సంఘటన వివరించాడు. వసిష్ఠుడు "రామా! నాకిది ముందే తెలుసు. ఆత్మీయుని దోషం లేకుండా విడనాడటం చంపటమే అవుతుంది. కనుక పరిత్యజించు"మనీ, "ధర్మహాని ప్రపంచ నాశనకారణ"

మనీ "ఉండని శరీరాలకై ధర్మనష్టం కలిగించరా"దనీ చెప్పాడు. "ధర్మ రక్షణార్థం తమ్ముడా! నా సతిపలెనే నా ప్రాణమైన నిన్ను పరిత్యజించాను" అని పల్కి మొగం పెడ త్రిప్పుకున్నాడు. సభ ముగిసింది. రాముడిపాదాల కన్నీటితోకడిగి సౌమిత్రి గృహానికి పోకుండానే సరయూనది చేరపోయాడు. స్నానం చేసి వార్చి, జితేంద్రియుడై, శ్వాసబంధించి సమాధి నిష్ఠుడైనాడు. ఊర్మిళ పతి సరసన యోగశక్తితో వచ్చి నిలిచింది.ఇంద్రుడు సురసేవితుడై వచ్చి ఆ దివ్యదంపతుల విమానంలో నిలుపుకుని ఎవరికి కానరాక అంతర్హితు డైనాడు. విమానం స్వర్గం చేరేవరకు దేవతలు పుష్పవృష్టి కురిశారు. ఊర్మిళా లక్ష్మణులు బొందితో స్వర్గం పోవటం రాముడు చూచాడు. మహా ప్రస్థానయాత్రకు సంకల్పించాడు. పాదచారియై కొలువు కూటానికి వచ్చి సంపూర్ణ సభ ఏర్పాటు చేయించాడు. సభామధ్యంలోనిల్చి తమ్ముణ్ణి భరతుని అయోధ్యాపతిగా ప్రకటించాడు. అందుకు కైకేయీ సుతుడు ససేమి అంగీక రించలేదు. "వంశవర్ధనులు, స్వీయాపత్యాలు, కుశలవులుండ భరతునికి పట్టం కట్టడం భావ్యంకాదనీ, అంతకంటె మరణశిక్ష మంచి"దనీ ఏడ్చాడు. "ఉత్తర కోసలకు లవునీ, అయోధ్యకు కుశునీ అభిషిక్తుల చేయటం ధర్మమనీ" అర్థించాడు. ఈ ప్రతిపాదన అందరు అంగీకరించారు. భరతుని కోరికపై చినతమ్ముడు శత్రుఘ్నునికి దూతలచే రమ్మని కబురుపంపి, దుఃఖిస్తూ నేలపై పడిన పౌరుల వీక్షించి "పౌరులారా! మీ అభీష్టానుసారం నాతో మహా ప్రస్థానం చేయటానికి సమ్మతించాను. మీరు చింతపడవ"ద్దని రాముడు పౌరుల ఆశ్వాసించాడు.

## శ్రీరాముని మహాప్రస్థాన యాత్ర

కుశలవుల రావించి దక్షిణోత్తర కోసలదేశాలకు ప్రభువులుగా అభిషే కించాడు. ధనసంచయాన్ని పేదసాదలకు, అర్థులకు, ఆశ్రితులకు తరుగు లేకుండా ధ్యానమగ్నుడై దానధర్మాలు సలిపాడు. శత్రుఘ్నుడు దూతలచే సర్వం తెలుసుకుని పెద్దవాడైన కుశునకు కుశావతీ, రెండోవాడైన లవునకు శ్రావస్తి రాజధానులుగా చేసి రాముడు భరతునితో అయోధ్యా నగరాన్ని విజనంగా విడిచి మహాప్రస్థాన యాత్రా ప్రయత్నంలో వుండటం భావించి, మధురాపట్టణం జ్యేష్ఠపుత్రుడు సుబాహునకూ, వైదిశాపురం ద్వితీయసుతుడు

శత్రుఘ్నాతికి పట్టణాలుగా అభిషేకించి, సర్వస్వం సమంగా పంచి ఒక్కడే రథంపై రాముని చేరవచ్చాడు. లంకాపతీ, కిష్కింధాపతీ సర్వ పరివారం సేవించగా వచ్చారు. "మాకూ, మీతోడిదే లోకంగా అనుగ్రహించు"మని అర్థించారు. రాముడు సుగ్రీవునితో "ప్రాణమిత్రమా! నిన్ను విడిచి పోలేను. అంగదునకు అధికారం అప్పగించు. నా వెంట రా" అని చెప్పి "భక్తాగ్రేసరా! విభీషణా! నీవు చిరంజీవివై ఇక్కడే నిల్వు. సూర్యచంద్రులు, తారలు, నక్షత్రచక్రం యథాస్థితి నిల్చినంతకాలం, నా గాథ ప్రజలచే మన్నించబడినంత కాలం నీవు భక్తాగ్రగణ్యుడవై, నా నుంచి గ్రహించిన జగన్నాయకుని సేవించి తరించు. నా మాటకు అడ్డం చెప్పకు" అని లంకేశుని ఒప్పించాడు. ఆ మీద హనుమంతుని చేరి గాఢంగా కౌగలించుకుని "అర్కజునివలె నీవు జీవితం విడ నాడకు. నాకు అది ఇష్టంకాదు. నీవు ఎంతకాలం శరీరంగా వుంటావో నా చరిత్ర అంతకాలం నీతో నిలుస్తుంది. నా గాథ వున్నంతవరకు నీవుంటావు. నాకూ, నీకూ అవినాభావసంబంధం వుంది. అందుచే నీవు పునస్సృష్టి దాకా వుండకతప్పదు" అని చెప్పాడు. హనుమంతుడు "ప్రభూ! నీ నామామృత పానంతో బ్రదుకుతాను. నాకు తృప్తికలగటంలేదు. నేను జీవించినంతకాలం నీవు నాలో నిల్చి దర్శనం ఇస్తూ వుంటానని వరం ఈయ" మని వేడాడు. ఆ విధంగా అనుగ్రహించి, మైందద్వివిద జాంబవంతాది మహా కపిశ్రేష్ఠులతో "పూజ్యులారా! కలి ప్రవేశంవరకు జీవించి పిమ్మట విష్ణుసాయుజ్యం పొందండి. భల్లూకవనచరులారా! మీరంతా నాతో రండి" అని చెప్పాడు.

ఆ రాత్రి ప్రస్థాన సంబంధ కర్మలు ఆచరించాడు. ఉదయం కాగానే పురోధసుని చూచి "స్వామీ! అగ్రజాతులతో అగ్నిహోత్రాలను ముందుగా పంపండి. గురుదేవులు వాజపేయచ్ఛత్ర వర్గాన్ని వెంటకొని నడుస్తారు" అని చెప్పి సూక్ష్మాంబరధారియై, దర్భలు చేతదాల్చి, పరబ్రహ్మ మంత్రం ఆత్మలో పఠిస్తూ, మార్గసౌఖ్యం మరచి గృహసోపానాలను దిగి వస్తుంటే, అపసవ్యభాగంలో శ్రీదేవి, హ్రీదేవినిల్వగా, ఎడమవైపు సంహారశక్తినిల్వగా, పురుష రూపంతో శరచాపాలు, సర్వాయుధాలు ముందుండగా, బ్రాహ్మణా కృతులతో శ్రుతులు, సర్వజగద్రక్షిణి గాయత్రి వెంట ఓంకృతి వషట్కారాలతో వెంటరాగా, బ్రాహ్మణులు, ఋషులు వేదం పఠిస్తూ నడవగా వాకిళ్ళు తెరిచిన స్వర్గానికి (వైకుంఠానికి) ప్రయాణించాడు. ఆయనవెంట అంతఃపుర

స్త్రీ బాల వృద్ధజనం, పక్షధరకింకరులతో దాస దాసీజనం కదలింది. సాగ్ని హోత్రులై, పత్నులతో భరతశత్రుఘ్నులు, రామగుణకీర్తనం చేస్తూ ప్రకృతులు పోయారు. ఆ మహాప్రస్థానవేళ ఆనందం విశ్వరూపం ధరించి యాత్రికులుగా కన్పించింది. ఆయన పోయినంత మేర మానవ పశు పక్షి క్రిమికీటకాదులు, మృగసందోహం వెన్నంటింది. పురిలో నిల్చిన అగోచర భూతాలు అనుసరించినై. అయోధ్యలో శ్వాసపీల్చేప్రాణి మిగులలేదు. అంతా నిర్జనం, నిరామయం, నిరాలంబగా మారి శూన్యం విలపించింది. రాముడు సకల ప్రాణులు తన్ను సేవించిరాగా, అర్ధయోజనంగమించి పశ్చిమముఖంగా పారే సరయూ తీరం చేరాడు. ఆకులావర్త భీషణ ఘోషణమైన ఆ ప్రదేశంలో సప్రజుడై దిగాడు. ఆ శుభవేళ పితామహుడు ఇంద్ర దేవతా మహర్షి గణ సేవితుడై అంబర తలాన హంసయానుడై నిలిచాడు.

అమరుల శరీర విమాన కాంతులతో ఆకసం కోటి భాస్కరోదయం వలె భాసించింది. దైవతకరముక్తమై ప్రసూనవృష్టి కురిసింది. బంధుర సుగంధ బాంధవ్య సంబంధ మందగ మనుడై గంధవహుడు వీచాడు. అప్సరసలు ఆడగా, గంధర్వులు పాడారు. మంగళతూర్య ఘోష విరిసింది. సరయూ జల గర్భంలో నిల్చిన శ్రీరాముని చూచి విధాత "శ్రీమహావిష్ణూ! భద్రమైన మా అదృష్టంకొద్దీ వస్తున్నావు. దుష్ట శిక్షణం, శిష్ట రక్షణం చేసి లోకాలలో శాంతి నెలకొల్పావు. నీవు కోరినచోట, నీ తనువైన వైష్ణవ తేజంలోనో, నభంలోనో ప్రవేశించు. అఘచయ విభంగ! విమల దయాంతరంగ! రఘుకులాంబుధి చంద్ర! శ్రీరామచంద్ర" అని స్తుతించాడు. ఆ పల్కులు విన్న రాముడు సానుజుడై, సశరీరుడై వైష్ణవతేజంతో ప్రవేశించాడు. అప్రాకృత శరీరుడైన రాముడు ఆత్మతేజంలో ప్రవేశించగానే అమరులతో అన్ని లోకాలప్రాణులు పూర్ణకామంతో పొంగిపోయినై. రాముడు విష్ణువైనాడు. "సువ్రతా! విధాతా! వీరంతా నా అవతార కాలంలో సేవించి, నాకై భౌతిక కాయాలు వదలి వచ్చారు. తగిన స్థానాలు కల్పించి సత్కరించు" మని ఆదేశించాడు. ఆ ఆదేశానుసారం బ్రహ్మ వచ్చిన వారందరకు సంతానం అనే పేరుతో లోకం కల్పించాడు. సురాంశతో జనించిన వానరులంతా తమ పూర్వ దేహాలలో లీనంఐనారు. సుగ్రీవుడు సూర్యమండలం చేరాడు. పౌరులు, తిర్యక్కులు, క్రిమికీటకాలు రామనామం జపిస్తూ సరయువులో క్రుంకి సంతాన

లోకం చేరినై. "రామనామ స్మరణ మాత్ర భవసంతరణం జరుగు గాక. రామాయణ పఠనమాత్ర ఇహపరసౌఖ్యాం లభించుగాక" అని అమృతవాక్యాలు పల్కి బ్రహ్మ తన లోకం చేరాడు.

## శ్రీరామాయణ ఫల శ్రుతి

ఇది సోత్తరమై, బ్రహ్మపూజితమై, రామాయణ నామంతో ప్రసిద్ధి కన్నట్టిది. అన్నిటిలో ముఖ్యమైంది. దీనిని వాల్మీకి రచించాడు. దీనికి రామాంతరనామంగల ప్రాగ్విధి విష్ణువు నాయకుడు. శ్రీలక్ష్మి సీత నామాంత రంగా నాయిక. దీనిని వైకుంఠంలో అమృతాంధసులు అనవరతం గానం చేస్తుంటారు. అందుకు కారణం దివ్యంకావటం. ఇది ఆఖ్యానం. ఆయుష్కరం. పాపనాశనం. సౌభాగ్యప్రదం. ఆమ్నాయసదృశం. ఇది శ్రీ రామాయణం. శ్రాద్ధకాలంలో శాంతినిస్తుంది. పాదమాత్ర పఠనంతో అనపత్యుడు సంతాన వంతుడవుతాడు. ధనంలేనివాడు ధనికుడూ, పాపి పుణ్యపురుషుడూ అవు తాడు. సర్వార్థప్రదమైన రామాయణం భవసాగర సంతరణం. బహుకాలం అయోధ్య శూన్యంగావుండి ఋషభుడనే రాజు పాలనలో పూర్వస్థితిపొందింది. శ్రీ రామాయణమహాకావ్యాన్ని వాల్మీకి సహోత్తరం, సభవిష్యంగా ఆవిష్క రించాడు. సంపూర్ణంగా ముని సుర మహర్షి గణంతో జలజాసనుడు విని సత్యమని అంగీకరించాడు. భక్త పాఠకలోకానికి వల్మీకోద్భవుడు చివర సందేశం ఈ విధంగా ఇచ్చాడు.

"సనాతనం, సత్యధర్మ సమ్మతం, శాశ్వతం అయిన శ్రీ రామాయ ణాన్ని సంశయరహితంగా నిండు మనసుతో పఠించి శాశ్వతంగా విష్ణుసాయు జ్యం పొందే నిమిత్తం ప్రజోపకారభావంతో రచించబడింది. పఠనమాత్ర భవబంధచ్ఛేదకం సలిపి పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మ లోక నిత్య నివాసం కలిగించుగాక."

ఓమ్ శాన్తిశ్శాన్తిశ్శాన్తిః

సుగుణాలంకృత దివ్య కాయమమలం శోభాకరం శ్రీప్రదం
నిగమాన్త ప్రతిపాద్య మబ్ధి శయనం నిర్దగ్ధ పాపాటవీం
అగజానాథ విరించి సేవిత పదం వ్యామోహ విచ్ఛేదకం
ఋగుదార స్తవనీయ మంజు చరితం శ్రీరామచన్ద్రం భజే.

౨

నీ కల్యాణ కథా విధానమును నే నిర్ణిద్ర భక్తిన్ బ్రభూ!
వా కొన్నాడను నీవు శ్రోతగను; "దుర్వారంబు సంసార బా
ధా కష్టంబులఁ దీర్చి యేలు" మనుచున్, దారిన్ గటాక్షించి నా
యీ కాయంబును నిన్నుఁజేర్పఁగదె తండ్రీ! రామచంద్రా! యిఁకన్.

౩

తల్లీతండ్రియు, దారపుత్త్రికులు "సీతారాములే" యంచు నా
యుల్లం బందున నమ్మి నీదు చరితం బుత్సాహినై వ్రాసితిన్
గల్లంజేయక నా శ్రమంబు, దశదిగ్భాగంబులన్ ద్వద్య శో
వల్లిన్ బ్రాకఁగఁజేయ నాంధ్రమున; దేవా! కూర్చు మా శక్తినిన్.

౪

నేనే సృష్టిలయాది కారణ మ్మృదా నీ భర్తృపాదాంబుజ
ధ్యానై కాత్ముఁడనేని, దివ్య పదసంధాన క్రియా పూర్ణవి
ద్యానైపుణ్య విలాస భాసిత బృహద్దర్పుండనేనిన్, త్వదీ
యానంత ప్రథ సత్యమేని రఘురామా! దీని వెల్గింపుమా.

నమోస్తు రామాయ సలక్షణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై,
నమోస్తు వాతాత్మ భువేవరాయ, నమోస్తు వల్మీకభవాయ తస్మై.

## శ్రీ హనుమన్నుతి

౧

నీ కటాక్షంబుచేత జనించి, మధుర
కవితసెప్పంగనేర్చి జగంబుమెచ్చ,
వ్రాయఁబడె వానిచేత రామాయణంబు
నీవు వ్రాయింపఁగాఁ బావనీ! నమోస్తు.

౨

దురితంబుల్ పొనరించియుండుటను మేదోమాంసపూర్ణంబుగాఁ
బరమాసహ్యకరంబుగాఁ దనువు ప్రాప్తంబయ్యె; నద్దాని నీ

కరుణాలోకనవృష్టిమూర్చి త్రిజగత్కల్యాణ సంధాయిగా
విరచింపంగను రామచంద్రునికథన్ వీరాంజనేయాఖ్యతో
నరసింహార్యునికోరఁజేసి భవబంధచ్ఛేదమున్ సల్పి నీ
చరణాబ్జంబులచెంతఁజేర్చితివహో! సామీరి! ప్రేమాకృతిన్.

౩

కోర భవాంధకారమునఁ గూలి నశించెడి భోగభాగ్యముల్,
కోర నిజప్రతిష్ఠ, గుణలోభులతో సహవాససంగముల్,
కోరెద నొక్కఁడేయొకఁడు, కోమలదృష్టుల నారసింహుతిఁ
దారములేని నీ కృపకుఁ బాత్రునిజేయఁగ, రామగాథ పెం
పారఁగ ధాత్రినిల్పఁగ, దయామతి నేలఁగ నన్నుపావనీ!

౪

శాంతిసౌభాగ్యముల తోడ క్ష్మాతలంబు
కలినిబర్హణమొనరింపఁగా ఘటించి,
చదువువారికి హృదయప్రశాంతికూర్చి
నేను నిను నమ్మి చేసిన నియమమెపుడు
సాగఁజేయుమపావనీ! సత్యముగను.

౫

రామునకు మంగళంబగు
భామామణి సీతకగుతవరమంగళముల్
సామీరికి మంగళమగు
క్షామంచలికగు సమస్త సన్మంగళముల్

శ్రీ రామచంద్రార్పణమస్తు.

ఓం తత్ సత్

వాల్మీకర్షిపదార్చనము.

# హనుమాన్ చాలీసా

శ్రీగురుచరణ సరోజరజ నిజమనముకుర సుధారి
నౌరజు రఘువర విమలజశ దాయక ఫల చారి॥
బుద్ధిహీన తను జానికై సుమిరౌ పవనకుమార్
బల బుద్ధి విద్యాదేహు మొహి హరహు కలేశవికార్॥

దోహా : పవనతనయ సంకటహరన మంగలమూరతిరూప
రామలఖన సీతా సహిత హృదయ బసహు సురభూప॥

జయ హనుమాన జ్ఞానగుణసాగర
జయ కపీశ తిహులోక ఉజాగర 1.

రామ దూత అతులిత బలధామా
అంజని పుత్ర పవనసుత నామా 2.

మహావీర విక్రమ బజరంగీ
కుమతి నివార సుమతికే సంగీ 3.

కంచనవరణ విరాజ సువేశా
కానసకుండల కుంచిత కేశా. 4.

హాథవజ్ర ఔధ్వజా విరాజై
కాంధే మూంజ జనేవూ ఛాజై. 5.

శంకరసువన కేసరీ నందన
తేజప్రతాప మహాజగవందన. 6.

విద్యావాన గుణీ అతి చాతుర
రామకాజ కరివేకో ఆతుర. 7.

ప్రభుచరిత్ర సునివేకో రసియా
రామలఖన సీతా మన బసియా. 8.

సూక్ష్మ రూప ధరి సియహిఁ దిఖావా
వికట రూప ధరి లంక జరావా. 9.

భీమరూప ధరి అసుర సంహారే
రామచంద్రకే కాజ సఁవారే. 10.

లాయ సజీవన లఖన జియాయే
శ్రీ రఘువీర హరషి ఉర లాయే. 11.

రఘుపతి కీన్హీ బహుత బడాయీ
తుమ్మమప్రియ భరతహి సమభాయీ. 12.

సహస వదన తుమ్హరో యశగావైఁ
అస కహి శ్రీపతి కంఠ లగావైఁ 13.

సనకాదిక బ్రహ్మాది మునీశా.
నారద శారద సహిత అహీశా. 14.

యమ కుబేర దిగపాల జహాఁతే
కవి కోవిద కహి సకై కహాఁతే. 15.

తుమ ఉపకార సుగ్రీవ హిఁ కీన్హా
రామ మిలాయ రాజపద దీన్హా. 16.

తుమ్హరో మంత్ర విభీషణ మానా
లంకేశ్వర భయే సబ జగ జానా. 17.

యుగ సహస్ర యోజన పర భానూ
లీల్యో తాహి మధుర ఫల జానూ. 18.

ప్రభు ముద్రికా మేలిముఖ మాహీఁ
జలధి లాంఘిగయే అచరజ నాహీఁ. 19.

దుర్గమ కాజ జగతకే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హరే తేతే. 20.

రామ దుఆరే తుమ రఖవారే,
హోత న ఆజ్ఞా బినుపైసారే. 21.

సబ సుఖ లహై తుమ్హారీ శరనా
తుమ రక్షక కాహూకో డరనా. 22.

ఆపన తేజ సమ్హారో ఆపై
తీనోఁ లోక హాంక తే కాంపై. 23.

భూత పిశాచ నికట నహిఁ ఆవై
మహావీర జబనామ సునావై. 24.

నాసై రోగ హరై సబ పీరా
జపత నిరంతర హనుమత వీరా. 25.

సంకటసే హనుమాన ఛుడావై
మన క్రమ వచన ధ్యాన జో లావై 26.

సబ పర రామ తపస్వీ రాజా
తినకే కాజ సకల తుమ సాజా. 27.

ఔర మనోరథ జో కోయి లావై
తాసు అమిత జీవన ఫల పావై. 28.

చారోఁ యుగ పరతాప తుమ్హారా
హై పరసిద్ధ జగత ఉజియారా. 29.

సాధు సంతకే తుమ రఖవారే
అసుర నికందన రామ దులారే. 30.

అష్ట సిద్ధి నౌనిధికేదాతా
అస వర దీన జానకీ మాతా. 31.

రామరసాయన తుమ్హారే పాసా
సాదర తుమ రఘుపతికే దాసా. 32.

తుమ్హరే భజన రామకో పావై
జన్మ జన్మ కే దుఖ బిసరావై. 33.

అంతకాల రఘువరపుర జాయీ
జహాఁజన్మ హరిభక్తకహాయీ. 34.

ఔర దేవతా చిత్త న ధరయీ
హనుమత సేయి సర్వసుఖకరయీ. 35.

సంకట కటై మిటై సబ పీరా
జో సుమిరై హనుమత బలవీరా. 36.

జై జై జై హనుమాన గొసాయీఁ
కృపా కరో గురుదేవ కీ నాయీ. 37.

జో శతబార పాఠకర కోయీ
ఛూటహిబంది మహాసుఖహోయీ. 38.

జో యహ పఢై హనుమాన చాలీసా
హోయ సిద్ధి సాఖీ గౌరీసా. 39.

తులసీదాస సదా హరిచేరా
కీజై నాథ హృదయ మహఁ డేరా. 40.



